# స్మృతిగీత

## సి. వేదవతి

జీవనగీత : డాక్టర్ బెజవాడ గోపాలరెడ్డి

స్మృతిమాధురి : డాక్టర్ సి. నారాయణరెడ్డి

వియోగగీత : డాక్టర్ పి. సుమతీనరేంద్ర

అమృతగీత : డాక్టర్ రావూరి భరద్వాజ



# స్మృతి గీత

సి. వేదవతి

స్పందన సాహితీ సమాఖ్య ప్రచురణ సంఖ్య 70

ఫిబ్రవరి 1990

వెల రు. 20-00

ముఖపత్ర చిత్రణ : శ్రీ శీలా వీర్రాజు

Sole Distributors : NAVAYUGA BOOK HOUSE
4-5-317 Sultan Bazaar
Hyderabad 500 195 Phone 44688

రచయిత్రి ఇతర రచనలు : 1) శృంగారలహరి 2) తెలుగు వెలుగు
3) సామెత 4) ముంగిటిముత్యం
5) మొల్ల (తెలుగు విశ్వవిద్యాలయం ప్రచురణ)
6) సరళి - వచన, గేయ, కథా కవితలు.

ప్రతులకు : సి. వేదవతి
"గోకుల్", 45 ఎల్. ఐ. సి. కాలని
మెహెదీపట్నం, హైదరాబాదు-500 028 ఫోన్ : 253529

స్పందన సాహితీ సమాఖ్య
C/o స్పందన ప్రింటర్స్
రామానాయుడుపేట
మచిలీపట్నం-521 001

ముద్రణ : స్పందన ప్రింటర్స్, మచిలీపట్టణము ఫోన్ : 3065

# అంకితం

శ్రీ యజ్ఞమరెడ్డి బాలకృష్ణారెడ్డిగారి
ధర్మపత్ని
స్వర్గీయ రంగనాయకమ్మగారి
దివ్యస్మృతికి

నిన్నెరుగని నను
మురిపించిన నీకు
ఇది స్మృతిగీత !
రమ్యమైన రసభావన
రవళించిన ప్రియగీత !!

— వేదవతి

# ప్రశంసి

సహృదయులైన మీకు 'స్మృతిగీత' ను సమర్పించేముందు నావిగా నాలుగు మాటలు –

అద్వైతం సుఖదుఃఖయో, రనుగతం సర్వాస్వవస్థాసుయ
ద్విశ్రామో హృదయస్య యత్ర జరసాయస్మిన్న హార్యోరసః
కాలే నావరణా త్యయా త్పరిణతే యత్స్నేహ సారేస్థితం
భద్రం తస్య సుమానుషస్య కథ మప్యేకం హితత్ప్రార్థ్యతే ॥

దాంపత్య జీవితంలోని అత్యంత మాధురీమయమైన ఆత్మీయతా స్పర్శను ఇంత సుందరంగా సంభావించిన భవభూతి భావనకు ఊపిరులూది – నా చేత ఈ రచన చేయించినవారు శ్రీ యల్లమరెడ్డి బాలకృష్ణారెడ్డిగారు.

సుమారు పది సంవత్సరాల క్రితం – శ్రీ వై. బి. రెడ్డిగారితో నాకు పరిచయం కలిగించిన సహృదయులు డా॥ బెజవాడ గోపాలరెడ్డిగారు.

రమ్యాణి వీక్ష్యమధురాంశ్చ నిశమ్య శబ్దాన్
పర్యుత్సుకో భవతి య త్సుఖితోపి జన్తుః
తచ్చేతసా స్మరతి నూన మబోధ పూర్వం
భావస్థిరాఃణి జననా న్తర సౌహృదాని !

శ్రీ వై. బి రెడ్డిగారు ఎప్పుడూ ప్రీతితో స్మరించుకొనే శ్లోకం ఇది. శ్లోకాన్ని వల్లెవేయటమే కాక, తదర్థానికి ప్రత్యక్ష సాక్షులై నిలచినదీ వారే।

వారితో పరిచయం కలిగినప్పటి ముహూర్తబలం ఎంతటిదో కాని, ఆ నాటి నుంచీ అవ్యాజమైన వారి ఆదరణాభిమానాలు అందుకోగలిగిన అదృష్టం కలిగింది నాకు।

మా తొలి పరిచయంలోనే, రెడ్డిగారి గుండెలోని పచ్చి గాయాన్ని కూడా చూడవలసివచ్చింది. అప్పటికి కొన్ని నెలల క్రితమే – ఆయన అర్ధ భాగం ఈ భౌతిక జగత్తును వదలి వెళ్ళిపోయింది. ఆమె లేని జీవితానికి అలవాటు పడలేని స్థితిలో ఉక్కిరిబిక్కిరి అవుతున్నట్లున్న రెడ్డిగారిని చూచి కదలిపోయాను.

ఆయన ఎన్నో ఏళ్లగా నన్ను ఎరిగి ఉన్నట్లు ఆత్మీయంగా పలుకరించారు. తనను ఒంటరిని చేసి వెళ్లిన భాగస్వామిని గురించిన జ్ఞాపకాలను నా ముందు ఆర్ద్రంగా త్రవ్విపోసుకున్నారు. ద్రవించిపోతున్న మనస్సుతో విన్నాను ఆ దైన్యపు మాటలను - ఊహించటానికి కూడా గొంతుక పెకిలిరాక.

కడుపునిండా దుఃఖం కరళ్ళు కట్టి ఉన్నా, రెడ్డిగారి ప్రతి మాటలోనూ సాహిత్యస్పృహ తొణికిసలాడుతూ ఉండటం నాకు అప్పుడు ఆశ్చర్యం కలిగించిన విషయం ! కానీ - ఇప్పటికి నాకు తెలిసివచ్చినదేమంటే, ఆయన సాహిత్య స్పర్శ లేకుండా అసలు మాట్లాడనే లేరని !

వారితో పరిచయమైన కొద్ది కాలానికే - ఆయన ఆత్మలో ఆత్మ అయిన ఆమెతోనూ నాకు పరోక్షంగా పరిచయం కావడం ప్రారంభమైంది. ఆమె విశిష్టమైన వ్యక్తిత్వాన్ని మాటలతోనే చిత్తరువు చిత్రించి నా కనుల ముందు మూర్తికట్టిస్తూ వచ్చారు రెడ్డిగారు. మేము కలుసుకొనే అవకాశం కలిగినప్పుడల్లా ఆమెను గురించిన విషయాలు చెపుతూ ఉండేవారు. ఆమె లేకపోవడం తనకు ఎంత వెలితిని కలిగిస్తున్నదో ఉత్తరాలలోనూ వ్రాసేవారు మధ్య మధ్య సాహిత్య విషయాలు చర్చిస్తూ ఉండినా, తిరిగి తిరిగి రెడ్డిగారి ధ్యాస ఆమెమీదకే మళ్ళుతూ ఉండేది

కలసి జీవించే దంపతుల మధ్య అనుబంధమూ, అనురాగమూ పెంపొందటం సహజమైన విషయమే ! కానీ రెడ్డిగారు ఆమె పట్ల పెంచుకొన్న ఆరాధనాభావం చూస్తుంటే, నాకు అబ్బురంగా తోచేది. ఇంతగా ఆయనగారి మన్ననకు పాత్రమైన ఆ పుణ్యమూర్తిని ఊహలలోనే నిలుపుకొని దర్శించటానికి ప్రయత్నిస్తూ వచ్చాను

ఇంటినీ, ఇంటాయననూ దిద్దుకోవటం - సాధారణంగా ఏ ఇల్లాలికైనా కొంత ప్రయాసతో చేతనయ్యే పనే ! ఇక్కడ విశేషమేమంటే - ఆమె ఒక సామాన్య గృహిణిగా ఉండి - పరిచయమున్న వారందరి మెప్పునూ పొందటమే కాక, ఉద్దండులైన కవి పండిత విద్వాంసులెందరిచేతనో ప్రశంసింపబడుతూ ఉండటం !

వారిద్దరూ, ఒకరికోసమే ఒకరు జన్మించారో, జన్మాంతర బాంధవ్యాలను మూటకట్టుకుని వచ్చారో తెలియదు కాని, ఆలోచనలలో, అభిరుచులలో - ఒక్కటే శ్రుతిగా జీవనం సాగించారు. ఇద్దరూ సాహిత్యప్రియంభావుకులే !

ఇందుకూరుపేటలో వారి ఇల్లు సరస్వతీ నిలయంగా ఉండేది. కవులు, పండితులు — ఎందరో వారి ఇంటికి వచ్చి వెళుతూ ఉండేవారు. కవులకు అతిథి సత్కారాలు చేయటం వారికి ఎంతో ఆనందం కలిగించే విషయంగా ఉండేది ఎందరో పండితులకు వారి గ్రంథాలు ప్రచురించు కోవటానికి ధన సహాయం చేశారు. స్వయంగా కొన్ని గ్రంథాలు వారి చేత వ్రాయించి ప్రచురింపచేశారు. శ్రీ బండ్ల వెంకటరమణయ్యగారి మధురా విజయము, శ్రీ ఓరుగంటి నీలకంఠశాస్త్రిగారి హరిహరనాథ తత్త్వము — వంటి ప్రామాణిక సాహిత్య తాత్త్విక గ్రంథాలు వెలుగు చూడటానికి కారకులు ఈ దంపతులే! వారికి సాహిత్యవ్రతమే ఊపిరి! కవులే ఆత్మబంధువులు! కవి సత్కారాలే సహజ ధర్మాలు!

దాన ధర్మాల విషయంలోనూ, కవి పండిత సత్కారాల విషయంలోనూ ఆయనకు ఆమె ప్రోత్సాహమూ, చేయూత ఉండేవి. ఈ కార్యక్రమాలన్నిటికీ ఆమె సూత్రధారిగా ఉండేది. ఆయన చేసే మంచి పనులన్నిటికీ వెనుక అండగా నిలచిన ఆత్మబలం ఆమె!

ఇటు సాంసారిక జీవితంలోనూ — అటు సారస్వత జీవనంలోనూ ఆమె అక్షరాలా సహధర్మచారిణిగా, స్నేహితురాలిగా వర్తిస్తూ వచ్చింది ఏబది నాలుగేళ్ళ వారి దివ్య దాంపత్య జీవనంలో — అద్భుతమైన సాహచర్య దీప్తిని ఫలింప చేసుకొన్నారు.

వారి దాంపత్య కథను వింటున్నప్పుడు — స్త్రీ పుంస యోగాత్మకమైన ఒక మహత్త్వమేదో మనసుకు పట్టినట్లుండేది. అద్వైత స్థితిని అందుకొన్న దంపతి భావన లెన్నో మనసును ఊగించేవి

ఇః పైన చెప్పినదంతా నేను విని — ఎరిగిన కథ. ఈ కథ అంతా ఇన్నాళ్ళుగా నా మనస్సున సుడులు తిరిగి తిరిగి — ఇప్పుడీ " స్మృతి గీత " గా రూపుదిద్దుకొన్నది.

ఇందులో కథానాయిక శ్రీ వై. బి రెడ్డిగారి ప్రాణనాయిక. పేరు రంగనాయకి

ఆమెను గురించి ఏదైనా సంస్మరణ పూర్వకమైన రచన చేయాలని నాకు అనిపించి — రెడ్డిగారితో ఆ విషయమై ప్రస్తావన చేశాను. కాని, సాహసం చాలక వ్రాయలేకపోయాను.

ఇన్నాళ్ళుగా ఆ ఆలోచన నన్ను వెన్నాడుతూనే ఉన్నది. నేను ఆమెను గురించి ఏమి వ్రాయగలను — అన్న సంకోచం అడ్డుకొంటూ వచ్చింది.

కొంతకాలం క్రిందట రెడ్డిగారిని అడిగాను - వారి అన్యోన్య దాంపత్య జీవితంలోని కొన్ని ముఖ్య ఘట్టాలను గురించి చెపితే — నేను చేయబోయే రచనకు ఉపయుక్తంగా ఉంటుందని!

రెడ్డిగారు నవ్వుతూ—

"చూడకపోయినా ఆమెను నీవు బాగానే ఎరుగుదువు కదా! నీవెరిగిన దానికి కొంత ఊహాశక్తిని జోడించుకుని వ్రాయి...." అన్నారు.

నా పని ఇంకా కొంచెం బరువైనట్లు తోచింది. మహత్త్వపూర్ణమైన జీవితం గడిపిన వాస్తవమూర్తి ఆమె! ఆ మూర్తిని ఊహాకల్పనతో సాక్షాత్కరింపజేసుకుని అక్షరాకృతిలో అవతరింపచేయాలి! ఆ కల్పన వాస్తవానికి అతికినట్లూ ఉండాలి!

ఆమెనూ, నేను విన్న ఆమె గుణగణాలనూ భావస్థితం చేసుకుని ధ్యానిస్తూ వచ్చాను. సరిగ్గా ఆమెను గురించి రెడ్డిగారు ఎట్లా భావన చేస్తూ ఉంటారో ఊహకు తెచ్చుకోవాలని ప్రయత్నించాను.

ఆ భావన అక్షరాలలోకి ప్రవహించగా, అవతరించినవి — ప్రియతమకు ఈ ప్రేమలేఖలు —

రెడ్డిగారి అంతరంగాన్ని నాదిగా చేసుకుని ఈ రచన చేయడానికి శ్రీకారం చుట్టాను. నా ఊహలలోని భావాలన్నీ — స్మరణ సుగంధాలై, స్మృతి రేఖలై రూపందుకుని వచ్చి నాకు స్ఫూర్తిని ఇచ్చి నడిపిస్తూ వచ్చాయి

ఈ రచన ఒక వియోగ గీతం కాకూడదు! విధుర విషాదరేఖ ఎక్కడా చోటు చేసుకోకూడదు! అన్న నా స్థిర నిశ్చయం కారణంగానే - ఈ రచన ఒక మధురస్మృతి గీత కావటం!

అందుకుగాను నేను భావన చేసిన తీరు ఇది -

ఆమె ఆయన చెంత లేనిదెప్పుడు! ఆ ఇద్దరకూ వియోగమేమిటి! ఆమె ఆయన ఊపిరిలో ఊపిరిగా, మనసులో మనసుగా మసలుతూ ఉండగా - విషాదానికి తావు ఎక్కడ!

ఆ దంపతులు నా మనసుకు ఎక్కిన ప్రేమికులు! వారికి ఎడబాటు లేదు!

అతడు తొలిచూపు నాటినుంచీ ఆమెను ఆరాధించటం ప్రారంభించాడు. కలసి జీవించినన్నాళ్ళూ ఆమెను మన్నన చేస్తూనే వచ్చాడు. ఇప్పటికీ ఆ ఆరాధన అనంతంగా కొనసాగుతూనే ఉంది !

క్రొత్త పెళ్ళికూతురిగా వచ్చినప్పుడే అతడి మనస్సును ఆమె ఆకట్టుకొన్నది. క్రమంగా తన విజ్ఞతతోను, వైదుష్య ప్రజ్ఞావిశేషాలతోను - సంసార భారమంతా మీద వేసుకొని నడిపించగల సమర్థతను పెంచుకొన్నది తానే అతడి చేతిని అందుకొని నడిపిస్తూ వచ్చింది.

ఒకనాడు ఆ కర్మయోగినికి విశ్వవిభుని వద్ద నుండీ పిలుపు వచ్చింది ఆమెను భౌతిక రూపంతో అనుసరించటం సాధ్యం కాక, అతడు ఉన్నచోటునే నిలచిపోయాడు. అట్లా ఒంటరిగా మిగిలి పోయిన అతడిని స్మరణ సౌరభాలు పాతచుట్టాలవలె వచ్చి కమ్ముకొన్నవి.

తోటమాలి వెడలిపోవ
తోట మిగిలి యున్నది.
కస్తూరి మృగము మాయము కాగ
వాసన గాలిలో జీరాడుచునే యున్నది.
వకుళమాల వాడిపోవ
వసనముల సువాసన వీడలివిధముగ !

(బెజవాడ గోపాలరెడ్డి)

ఆలా వెన్నాడుతున్న అపురూపమైన స్మరణలే - ఈ మాల కట్టిన లేఖా పరంపరలు ! వారి ఏబది నాలుగు వత్సరాల సాహచర్యానికి ప్రతీకగా - సరిగ్గా అన్ని ఖండికలనే అమర్చుకొన్నాను.

ఆమె కారుణ్యనిధి, దీన జన బాంధవి, వితరణ శీలి, రసజ్ఞురాలు, స్నేహితురాలు, సలహాదారు, మాతృమూర్తి - ఆమెలోని ఈ సర్వోత్కృష్ట గుణాలన్నిటినీ ఒక్కొక్క ఖండికలో ఒకొక్క విధంగా చిత్రించాలని ప్రయత్నించాను.

నా భావనకు ఉత్తేజాన్నీ ఊపునూ ఇవ్వడం కోసం - పెక్కుమంది ప్రాచీన ఆధునిక మహాకవుల శ్లోకాలనూ, పద్యాలనూ, జానపదుల గేయాలనూ అభిమానంతో వాడుకొన్నాను. ఆ దంపతులకు ప్రియమైన సాహిత్య స్పర్శను ఈ విధంగా రచనకు జోడించటం నా ధర్మమని అనుకొన్నాను.

శ్రీ వై. బి. రెడ్డి దంపతుల వ్యక్తిగత విషయాలనూ, విశేషాలనూ ఈ రచనలో నేను చొప్పించలేదు. వారి పుత్రిక యశోధర పేరును మాత్రం నేను యథాతథంగా ఉంచాను.

యశోధర చిన్నవయస్సులోనే జీవితం చాలించింది. నలుగురు బిడ్డలనూ, భర్తనూ వదలి వెళ్ళిపోయింది. గుండెను రాయి చేసుకొని ఆ దంపతులు బిడ్డలకోసం జీవనం సాగించారు తల్లి లేని లోటును తెలియనీయకుండా వారిని పెంచి పెద్దచేశారు. రెడ్డిగారి మనుమలు ముగ్గురూ విద్యావంతులై, మంచి పదవులలో భార్యా బిడ్డలతో సుఖులై ఉన్నారు. మనుమరాలు డా॥ సుమతీ నరేంద్ర విద్యావిషయికంగా – అమ్మమ్మ, తాతగారల ఆశయాలను పండించిన చదువుల సరస్వతి. చిన్న వయసులోనే – సంస్కృతాంధ్ర భాషలలో M. A. పూర్తి చేసి, తిక్కన భారత రచనపై తులనాత్మక పరిశీలన చేసి – డాక్టరేట్ పట్టాన్ని పొందినది. ఉస్మానియా విశ్వవిద్యాలయంలో తెలుగు శాఖలో రీడరుగా ఉన్నది. సాహిత్య రంగంలో పేరెన్నికగన్న విదుషి – డా॥ సుమతి. ముఖ్యంగా నాకు ప్రీతి కూర్చిన మిత్రురాలు. ఈ ప్రేమలేఖలకు "స్మృతి గీత" అని పేరు సూచించినది ఆమెయే!

ఇప్పుడు రెడ్డిగారికి ఏ కొదువా లేదు. మనుమలూ, మనుమరాండ్ర ప్రేమాభిమానాలతోపాటు నిత్య సాహితీచైతన్య సంస్కారం వారికి ఆనందాన్ని చేకూరుస్తూ ముందుకు నడిపిస్తున్నది.

ముంతాజ్ బేగం మరణము
తాజ్ మహల్ కు పునాది వేసింది
దుహితృ వియోగము – దారా సంస్మరణ-
పండితలోకానికి దగ్గర చేర్చాయి.
సంస్మరణాల పేరుతో ఆత్మీయుల మరణాన్ని
పండిత సన్మాన సభలుగ మలచుకొన్నాడు.

(బెజవాడ గోపాలరెడ్డి)

ఇది – ఇప్పటి రెడ్డిగారి జీవనసౌభాగ్య విశేషం!

శ్రీ వై. బి. రెడ్డి దంపతుల వ్యక్తిగత జీవితాన్ని బీజప్రాయంగా మనసులో నిలుపుకొని – ఒక మహోదాత్త ఆదర్శమయ దాంపత్య వైభవాన్నీ, అర్ధధర్మానుబంధ రూపకమైన అత్యద్భుత అనుబంధ విశేషాన్నీ ముందుతరాల వారికి పరిచయం చేయాలని ప్రయత్నం చేశాను.

" పలికెడిది భాగవతమట – పలికించెడివాడు రామభద్రుండట " అని పోతన్నగారు అన్నట్లు –

ఈ రచనలో జాలువారిన హృదయగీతమంతా వారిది। సంగీతం మాత్రమే నాది।

కల్పన కంటె యదార్థ జీవితం చిత్రమైనదని అనుభవజ్ఞులు అంటారు। ఒక అద్భుతమైన, వాస్తవమైన అనుబంధానికి రవ్వంత రసభావాన్ని జోడించి పరమాప్త భావంతో చిత్రించిన లేఖామాలిక లివి– ప్రేమలేఖలైనా, చదువకూడని రహస్యాలు లేనివి – మీ చేత ఉన్న విప్పుడు –

45, ఎల్. ఐ. సి కాలని
మెహిదీపట్నం
హైదరాబాదు – 500 028

సి. వేదవతి

డాక్టర్ బెజవాడ గోపాలరెడ్డి

# జీవన గీత

పుట్టుక, బ్రతుకు, చావు- ఎంత రమ్యమైన వింతలు ! ఎరుక లేని రహస్యాలు. కమ్మని తోట సందులలో పయనించి, బ్రతుకు - చావుతల్లి ఒడిలో పరుండి పోతుంది పుట్టుక-చావు పాడెను వెంట తెచ్చుకొంటుంది. బ్రతుకు-ప్రయాణ బత్తెముగ చావును తెచ్చుకొంటుంది. చితాగ్ని వెలుగున బ్రతుకు నడుస్తూ పోతుంది. కడకు కాటికి చేరి నిద్రిస్తుంది.

పుట్టుక - పురిటి నొప్పులతో, ఏడ్పులతో, ప్రారంభమై, బ్రతుకు వంకర టింకరగ, ఎగుడు దిగుడులతో, శుక్ల బహుళ పక్షముల హెచ్చు తగ్గులతో పయనించి, మరణ వసంతమున చిరునవ్వులు వెదజల్లుతూ అమావాస్యను చేరుతుంది. ప్రశాంత తిమిర నిశీథము, సుఖ దుఃఖముల సమాప్తి శ్రమల క్లేశముల అంతము, ఆకాంక్షల యత్నాల చివరి ఘట్టము, మరణ మాత శీతల అంకములో చిర నిద్ర. మెలకువ తెలియని మైమరపు.

జీవితము ఋతు రమణుల నృత్యశాల. మంజీరరవముల శ్రావ్య రసవేదిక. ఆనంద రాగిణుల దీప్తిలో వెలుగుతుంటుంది. శ్రుతి తప్పగ, రాగ మృదంగము ఆగిపోవ, హర్ష దీపికలు ఆరిపోవ, మరణ మాత మందస్మితములు ఆరంభమై, చావు తెర జారి, దిగిపోతుంది. అంతా చీకటే ! తారతమ్యములు మాసిపోగ, అంతా ఏకాకారముగ కాన్పిస్తుంది. మృత్యుశాల సమాధిశిలయై ఎదుట నిలుస్తుంది. చీకట్లలో చిక్కిపోయి అదృశ్యమగుతాము ! మతాలు, వేదాంతాల దీపములతో వెతికినా కనబడదు. అదే జీవిత వృత్తాంతము. మరణ రహస్యము.

పుట్టినదంతా చావవలసినదే. అది తిరుగులేని అనతి. అవతార పురుషులైనా, ప్రవక్తలైనా, ఈ ఆనతికి తలవంచ వలసినదే ! చావును గెలిచిన వాడు ఇంతవరకు పుట్టలేదు. పుట్టబోడు. ఇది అందరికీ తెలిసిన సత్యమే !

కాని, చిత్రములలో చిత్ర విషయమేమిటంటే - నేడు చచ్చిన వారికై, రేపు చావబోయేవారు - ఏడుస్తారు! లోకమంతా తారుమారయినట్లు విలపిస్తారు. ఎవరు చనిపోయినా, ఏ మార్పూ కనిపించదు—దగ్గరి వాళ్ళకు కొన్ని దినాలకు తప్ప! కాలధన్వంతరి ఎడబాటుగాయాలకు మందు రాస్తూనే వస్తాడు. అతడు చాలా నిపుణవైద్యుడు. అతని వైద్యము లేకపోతే మానవుడు క్రుంగిపోతాడు. మరణము, కాలధన్వంతరి - సహచరులు; ఒకరి కనుసైగలలో ఒకరు మనుచుంటారు.

అన్ని వియోగాల వలెనే భర్తృ వియోగము, దారా వియోగము, సహజాలే! జీవితాన్ని ఆనందదాయకముగ పెంచుకొని, పంచుకొని జీవించిన వారి శాశ్వత వియోగము కలతపెట్టేదే! అట్లని దిగులు గ్రుడ్లమీద పొదుగుతూ చాలా కాలము కూర్చొనరాదు. అది - ధన్వంతరిని హేళన చేసినట్లే! చేస్తే ఏదో మానసిక దౌర్బల్యము చేతనే! మరణోన్ముఖముగ పయనించే జీవితము కొన్ని స్మృతులను కాలిజాడలుగ వదలి మాయమగుతుంది. ఆ స్మృతులనే ఊతకర్రలుగ అందిస్తాడు కాలధన్వంతరి! అట్టి కాలిజాడల కథే - శ్రీ వేదవతి పుస్తకము.

వాస్తవ వృక్షానికి ఆమె కొన్ని కల్పనాలతలను చుట్టింది. కొన్ని పూల గుత్తులను చూపింది. కల్పనలు లేని వాస్తవాలు దిసమొలగా ఉంటాయి. కల్పనా వసనాలు — అలంకారాన్ని ఇస్తాయి. మెరుగులు దిద్దుతాయి. ఎరుగని శ్రీ రంగనాయకమ్మను — ఊహానేత్రాలతో చూచి, కల్పనా వర్ణములతో చిత్రించింది. కవితాశిల్పముతో మలిచింది. శిల్ప సుధను బిందు బిందువుగ ఆస్వాదించుచున్నాడు శ్రీ వై. బి రెడ్డి. వేదవతి చిత్రీకరణలో నిపుణ. ఏదో ప్రజ్ఞా మంత్రదండముతో మాటలకు ఊపిరి పోస్తుంది. రమ్యతతో, మాటలను పాటల మాదిరిగ నాట్యము చేయిస్తుంది. అదృష్టహస్తలాఘవము ఆమెకు కైవశమైనది. సహృదయముతో దర్శించినవారికి గోచరిస్తుంది ఆమె మాంత్రిక చతురత! స్మృతులు కావ్యసంపదయైనవి, కవితామంజరులైనవి. వై. బి. రెడ్డి దారా వియోగ మార్గములో ఏకాకి కాడు. ఈ శతాబ్దపు అగ్రశ్రేణి నాయకులంతా సహయాత్రికులే! గాంధీజీ, రవీంద్రనాథటాగూర్, అరవిందు, నెహ్రూ,

రాజాజి, రాధాకృష్ణన్, పరిశీలించితే — ఈ వరుసలో నడచినవారే। వారి దృష్టాంతము వేగుచుక్కవలె దారిని చూపేదే। మరణమే లేకుంటే, జీవితములో ఆనందమేమిటన్న గాలిబ్ నిత్య సత్యాన్ని, జీవితములో మృత్యు మాధుర్యమును కలసినదన్న రవీంద్రుని స్మరణ కవితను — చింతన చేయుట వియోగార్తులకు పరమ ఔషధమువలె పనిచేస్తుంది.

కవితాసుందరికి 'స్మృతిగీత' మకుటమై శోభిస్తుంది.

ఈ నాలుగు మాటలు వ్రాసే అవకాశమిచ్చిన శ్రీ వేదవతికి కృతజ్ఞతలు. ఈ కావ్యకిరణాలు మకరసంక్రాంతి వలె కొంత వెచ్చదనము ఇవ్వగలదని ఆశించుచున్నాము.

శాంతి నికేతన్ 12–1–1990

నెల్లూరు

# స్మృతి మాధురి

ఆచార్య సి. నారాయణరెడ్డి
ఎం ఎ., పిహెచ్ డి , డి లిట్
ఉపాధ్యక్షులు
తెలుగు విశ్వవిద్యాలయం

కళ్లు తెరిచినప్పుడు కనిపించేది దృశ్యం.

కళ్లు మూసుకుంటే కనిపించినట్టు అనిపించేది ఆ దృశ్యం తాలూకు స్మృతి చిత్రం.

నిజానికి మనిషికి మధురస్మృతి ఓ వరం. వికలస్మృతి ఓ శాపం.

మధురస్మృతుల పల్లకీల మీద ఊరేగుతూ మానవుడు వరుడవుతాడు.

స్వప్న విపంచికలు మ్రోగించే గంధర్వ వరుడవుతాడు.

మరి శిధిల స్మృతులేమో తెగిన ముత్యాల సరాలు. వాటిని ఏరుకోవాలని చేతులు సాచితే కొసవేళ్ళకు తగిలేది కన్నీటి తడి మాత్రమే. శ్రీమతి వేదవతి ఆలపించిన ఈ 'స్మృతిగీత' ఒక వియోగస్వామి ధర్మదాంపత్య భావ పునీత.

ఆ స్వామి ఎవరో కాదు. నిత్య సాహితీవ్రతులు, వదాన్యమతులు శ్రీ వై. బి. రెడ్డిగారు.

రెడ్డిగారి ధర్మపత్ని, అంతరంగనాయిక శ్రీమతి రంగనాయకి. శ్రీమతి పరమపదించిన క్షణం నుంచి బాలకృష్ణారెడ్డిగారి గుండెనిండా తరలిపోయిన విరహ సమీరాలు, స్మరణ పరిమళాలు; శ్రీమతి వేదవతి రసతుందిలమానసంలో అలలు అలలుగా కదిలిపోయాయి. వాటి అక్షరాకృతి ఈ "స్మృతి గీత". ఎందరెందరి పద్యపంక్తులు, పాటల చరణాలు ఈ కృతిలో చోటు చేసుకున్నాయో! ఎన్నెన్ని సుతిమెత్తని భావాలు ఈ రచనలో శ్రుతి చేసుకున్నాయో! మనసున్న వారికే తెలుస్తుంది.

శ్రీమతి వేదవతి వచనాన్ని ఎన్నెన్ని తేనెపోతలుగా, పైడిపూతలుగా అందిస్తుందో లోగడ ఆవిడ రచించిన "ముంగిటి ముత్యం" చెబుతుంది. హృదయాన్ని రంగరించి అక్షరాల గుళికలుగా అందిస్తే ఎలా వుంటుందో ఈ "స్మృతిగీత" చెబుతుంది. తీయంగా, వేదవతీయంగా సాగిన ఈ స్మృతి మాధురి సహృదయ పాఠకులు నిరంతరం మననం చేసుకునే కృతిలహరి. అందుకు శ్రీమతి వేదవతికి, ఈ రచనకు కారకులైన బాలకృష్ణారెడ్డిగారికి, శ్రీమతి వేదవతితో పాటు ఈ నాలుగు మాటలు నాచేత పలికించిన రెడ్డిగారి మనుమరాలు, నా శిష్యురాలు డా॥ సుమతీ నరేంద్రకు శుభాకాంక్షలు.

హైదరాబాదు

5-2-1990

# వియోగగీత

డాక్టర్ పి. సుమతీ నరేంద్ర
రీడర్, తెలుగు శాఖ
ఉస్మానియా విశ్వవిద్యాలయం
హైదరాబాదు - 500 007

వాగర్థా వివసంపృక్తౌ వాగర్థ ప్రతిపత్తయే
జగతః పితరౌ వందే పార్వతీ పరమేశ్వరౌ.

కాళిదాసు పార్వతీ పరమేశ్వరులను వాగర్థాలన్నాడు. వాక్కుకీ అర్థానికీ వియోగ మన్నది లేదు. అలాగే ఆ ఆదిదంపతులకు కూడా! అర్ధనారీశ్వరుడనటం లోని అంతర్యం ఇదేకాబోలు! ఆ ఆదిదంపతులవంటి వారే మా అమ్మమ్మ, తాత - మా పాలిటి ప్రత్యక్ష దైవాలు.

"ఇయం గేహే లక్ష్మీ ఇయమమృత వర్తిర్నయనయోః" - అంటాడు శ్రీరాముడు జానకిని గూర్చి. ఆమె వియోగం తప్ప ఆమెకు సంబంధించిన వన్నీ తనకు అత్యంత ప్రియమని భావిస్తాడు. భవభూతి ఉత్తర రామచరిత నాటకంలో లోకోత్తరమైన సీతారాముల దాంపత్యాన్ని, వియోగాన్ని ఉదాత్తంగా కరుణ రసోద్వేగంగా చిత్రించాడు. దివ్యులకు, దివ్యాదివ్యులకు సంబంధించిన దాంపత్యం కాళిదాసు, భవభూతి - వంటి మహాకవుల అసాధారణ ప్రతిభా పాటవం చేత శాశ్వత సత్యమైంది.

ఆ దేవతా స్వరూపంతో పోల్చవచ్చునో లేదో నాకు తెలియదు కాని, మా అమ్మమ్మ తాతగార్ల దాంపత్యం మాత్రం మా కందరికీ ఒక అద్భుతమైన, అనుపమానమైన అనుభవం! అది ఒక జన్మాంతర బంధంలాగా భాసించేది. వారి దాంపత్య సౌమనస్యం లోక సామాన్యమైన బాధలకు, ఒత్తిడులకు అతీతమైనది కనుక ఈ రోజు ఈ రూపాన్ని సంతరించుకొని శాశ్వతమై నిలిచిపోతున్నది.

ఊహ తెలిసిన నాటినుంచీ చుట్టూ ఉన్న వాళ్ళను చూస్తూనే ఉన్నాం. దంపతులమధ్య బరువులు, బాధ్యతలు, కష్టాలు, కలహాలు, కలతలు, కన్నీళ్ళు తప్ప మరేమీ కనిపించవు. ఎక్కడా లేని, ఎవరిలోనూ కనిపించని ఆ

సుఖదుఃఖాద్వైతం వారిలో కనిపించేది. ఒకరిని ఒకరు మన్నించుకొనే ఆ సంస్కారం, కష్ట సుఖాలను కలసి పంచుకొనే ఆ చెలిమి, ఏకైక పుత్రికా వియోగాన్ని తట్టుకొని నిలబడే ఆ స్థైర్యం, ఒడిదుడుకులను తడబడకుండా ఎదుర్కొనే ఆ సమన్వయం, మనుమల బాధ్యతను మనస్ఫూర్తిగా స్వీకరించి తుదిదాకా నిర్వహించే ఆ సామర్థ్యం, మంచి చెడులను చక్కగా అంచనావేసే ఆ విచక్షణ - తులలేనివి. అందుకే వారు తమవారినే కాక పెరవారిని కూడా ప్రభావితులను చేసేవారు. భార్యాభర్తలు - అంటే అలా ఉండాలి - అని బంధువులు, తెలిసినవాళ్ళు - అనుకొంటుంటే, వినడం మాకు పరిపాటి అయిపోయింది

అలాంటి మా అమ్మమ్మ చనిపోయినప్పుడు, మా తాతగారు ఎలా తట్టుకోగలరు అని భయపడ్డాం. గరళాన్ని శివుడు గళంలోనే నిలుపుకొన్నట్లు వియోగ దుఃఖాన్ని మధురస్మృతులతో మరుగుపరచుకొన్నారు మా తాతగారు. సీతా వియోగాన్ని అనుభవించే శ్రీరామచంద్రునివలె నేటికీ ఆ దుఃఖాన్ని అనుభవిస్తూనే ఉన్నారు - అంతరాంతరాలలో. వేదవతిగారు వారి దాంపత్య సౌమనస్యానికి ముచ్చటపడిన వారిలో ఒకరు.. దానికి గ్రంథరూపాన్ని సంతరించాలనుకొని ఈ విలువైన 'స్మృతిగీత'ను మనకందించారు. వారికి నా ప్రత్యేకమైన కృతజ్ఞతలు.

వేదవతిగారికి రంగనాయకమ్మతో ప్రత్యక్షపరిచయం లేనే లేదు. అయితే, మా తాతగారి అంతరంగంలో శాశ్వతంగా నిలచి ఉన్న ఆమెను ప్రజ్ఞా చక్షువుతో చూడగలిగారు. ఒక సందర్భంలో ఏవైనా విశేషాలు చెప్పవలసిందని నన్ను అడిగారు కాని, ఏంచెప్పను, ఎలాచెప్పను, ఎన్నని చెప్పను - అని అడిగాను దుఃఖోద్విగ్నతతో. మొత్తానికి ఏమీ చెప్పకుండానే అన్నీ గ్రహించారు. స్వానుభవం లేనిదే విషయం రక్తి కట్టదు అనే వాదాన్ని రచయిత్రి పరాస్తం చేశారు. రంగనాయకమ్మతో ప్రత్యక్ష పరిచయం ఉన్నవారికంటె చక్కగా ఆమెను చిత్రించింది, ఆమె స్వభావాన్ని లోతుగా అర్థం చేసుకొన్నది శ్రీమతి వేదవతి. ఇదెలా సాధ్యం అంటే - 'రవి గాంచనిచో కవి కాంచును కదా' !

Tell me your friends, I will tell about you - అన్నట్లు, ఆమెతో పరిచయమున్నవారిని చూచి, ఆమె వ్యక్తిత్వానికి ఈ రచనలో పట్టం కట్టింది రచయిత్రి. దుర్భర వియోగదుఃఖాన్ని మధురజ్ఞాపకంగా మలచు

కొంటున్న మా తాతగారి అంతరంగానికి అద్దం పట్టింది. వేదవతిగారి దర్శనం ప్రతిభామూలకమైనది కనుకనే - పరమాహ్లాదకరంగా ఈ రచన రూపు దిద్దుకొన్నది.

శ్రీ వై బి రెడ్డి దంపతుల 54 ఏండ్ల దాంపత్యానికి సంకేతాలుగా 54 లేఖలను రూపొందించారు రచయిత్రి. లేఖా సాహిత్యం తెలుగువారికి క్రొత్త కాదుకాని, ఒక వ్యక్తి మధురమైన జ్ఞాపకాలను ఇలా లేఖలరూపంలో వ్యక్తం చేయవచ్చనే ప్రణాళిక వినూత్నంగా ఉంది. రంగనాయకమ్మ జీవించి ఉన్నంత కాలం వియోగం అనేది ఎరుగరు మా తాతగారు. వాగర్థాల వలె జీవించారు. ఇక ఇప్పుడు మిగిలింది శాశ్వత వియోగం, భరించలేనంత విషాదం, అంతరంగ జీవనంలో అంతులేని ఒంటరితనం! కానీ ఆయన మనసులో రంగనాయకమ్మ ఎప్పుడూ ఉంది. వారికి వియోగం లేదు. ఆ భావనే వారికి జీవించే శక్తినిస్తుంది.

శ్రీమతి వేదవతిగారి రచనలను నేను చదివాను, ఆదినుంచీ నేను గమనించిన విషయం - వారి శైలికి సంబంధించినది. వారి తెలుగు వచనం సహజసుందరంగా ఉంటుంది. ఇదీ అని చెప్పలేని ఒక పొందిక అందులో ఉంది. అది మనస్సును ఆకట్టుకొని ముందుకు తీసుకొని వెళుతుంది. విషయాన్ని కూర్చడంలో నేర్పు, దాన్ని ప్రకటించడంలో ప్రతిభ, పఠనీయశైలి, ఆమె రచనలకు పెట్టని సొమ్ములు. అవే ఈ రచనలోనూ కనిపిస్తాయి. పరమాహ్లాదకరంగా కూర్చబడిన ఈ లేఖలనే ఆణిముత్యాలను బంధించిన అంతస్సూత్రం వియోగమే! కరుణ రసప్లావితంగా రచన భాసిస్తుంది - వై. బి. రెడ్డిగారిని ఎరిగిన వారికి! ఇతరులకు ఒక ప్రణయగీతగా పరిమళాలు పంచుతుంది ఈ "స్మృతిగీత"!

1-1-1990

డాక్టర్ రావూరి భరద్వాజ

# అమృతగీత

ఇదో పాత కథ :

కథానాయకుని పేరు దేవయ్య. కథానాయిక పేరు దేవమ్మ.

" ఈ ప్రపంచమున ఒక దినము నవ వధూ వేషమున వచ్చి నీవు నా ప్రక్కన నిలచితివి - ఉంచితివి నా హస్తమున కంపించు నీ హస్తమును. అది కేవలము ఒక ముహూర్తమున సంభవింపలేదు " — అనుకొన్నాడు దేవయ్య.

ఆమె తన జీవితంలో ప్రవేశించడం " ఒక సౌందర్యమయమైన సన్నివేశ"మనుకొన్నాడు. " నిత్యనూతనంగా, అగుపించే ప్రొద్దుపొడుపులాగా కల్పనామూర్తిలాగా కనిపించావ"న్నాడు. ఆమెను చూడంగానే - " మన్మహో విహగ మపుడె పల్లటిలి వాలె నీ పాదపద్మ యుగళి " అనుకొన్నాడు. "ప్రేమ, ప్రణయం, అనురాగం, స్నేహం లాంటివేమీ తనకు అంతగా తెలియ"వన్నాడు. "ఇవన్నీ కలిపి మూటకట్టిన అద్భుత ప్రపంచమేదో ప్రత్యక్షమైనట్లనిపించింది తనకు " - దేవమ్మను తొలిసారిగా చూచినప్పుడు. ఆ అద్భుత ప్రపంచంలోంచి లజ్జా దరహాస రేఖలను దోసిలినిండా నింపుకొన్నాడు తృషామూర్తి అయి. అంతులేని ఆమె ముగ్ధత్వం, అతని గుండెలోతులను తాకి పరవశుణ్ణి చేసింది. ఆ పరవశతలో -

" ఎవరు నీవు ? " - అని ప్రశ్నించాడు.

" నన్ను ఉద్ధరించటం కోసం ఏ దివ్యలోకాలనుండో దిగివచ్చిన దేవతవా !" అన్నాడు.

"నీవు ఎవరవూ కావు. నా ఆత్మవు నా ప్రాణశక్తివి " అని తనే సమాధానం చెప్పుకొన్నాడు.

ఆ సమాధానం విని ఆమె ఏమనుకొన్నదోనన్న అనుమానం వచ్చింది దేవయ్యకు. వచ్చాక, బితుకు బితుగ్గా, ఆమెకేసి చూశాడు. ఆమె కపోలాలను స్పృశిస్తున్న కెంపుల రంగులను చూసి, "హమ్మయ్య" అనుకొన్నాడు.

అలాంటివి విన్నప్పుడు దేవమ్మ చెక్కిళ్ళు కెంపులవటమే కాదు - ఆమె కనులు చెమ్మగిలుతాయి. ఏ ఆత్మీయులు గుర్తుకొచ్చి ఈ పిచ్చితల్లి ఇలాగ అయిపోయిందోనన్న బెంగ పట్టుకొంది దేవయ్యకు.

"నీ కన్నవారికి వలెనె – గారాబంతో, అనురాగంతో కాపాడుకొనగల వాడను, నీ వాడను" అన్నాడు.

ఈ మాటలతో దేవమ్మ నయనాలు నదులయినాయి.

"ఈ ఒంటరి బ్రతుకులోకి, నాకు తోడునీడగా ఉండటానికి వచ్చిన నా పాలిటి దేవతవు. నీవు నాకు సహధర్మచారిణివి మాత్రమే కాదు. నా స్వామినివి. నేను నీ భర్తనే కాదు, తల్లినీ, తండ్రినీ, తోడపుట్టువునూ కూడా! అన్నిటినీ మించి ఆత్మీయుడైన స్నేహితుణ్ణి! నడిమింటిలో నీవు నడయాడుచుండగా, వెండి దివ్వెలు కొన్ని వెలిగినటులుంటుంది నాకు. నీవు మునుసిగ్గు దొంతరుల దొరసానివి. నాకును నీకు నెన్ని జననమ్ముల సౌహార్దమో, పరస్పరాలోకనమందె, నా బ్రతుకులో నొక తీయని స్వప్న మేదియో పైకొనినట్టులయింది" అన్నాడు.

అప్పుడామె కన్నీరు, పెన్నెలనీరుగా మారి, చెక్కిళ్ళమీది అరుణిమను ధవళ ధవళంగా మార్చింది. లోనుంచి పొంగుకొస్తున్న సిగ్గును, నవ్వును, పెదవులు వారించలేకపోయాయి. గిరుక్కున లోపలికి వెళ్ళింది దేవమ్మ.

ఎలాగైనా అతన్ని తప్పుకొని తిరగాలని దేవమ్మ యత్నం. అతని చూపులు మాత్రం – అనుక్షణం ఆమె కోసం గాలిస్తూ ఉండేవి క్రొత్త గనక!

అతనికెపుడేం కావాలో తెలీదు. ఏం తినాలో, ఎంత తినాలో, ఎప్పుడు ఏ దుస్తులు వేసుకోవాలో కూడా మన దేవయ్యకు తెలీదు. తెలీదన్న సంగతి – ఆ యింట కాలు పెడుతూనే దేవమ్మ తెలుసుకొన్నది. తెలుసుకుని, అతని అవసరాలన్నీ ఆమెగారే చూడసాగింది. అంచేత - చాలా పనులకు ఆమెమీద ఆధారపడడం దేవయ్యకు అలవాటయిపోయింది.

పనుల తొందరలో దేవయ్య పరాకు చిత్తగించినప్పుడు, ఆమెగారు వెనుకనే ఉండి అన్నీ సర్దుబాట్లు చేస్తూ ఉండేది.

దేవయ్యకు కొన్నికొన్ని విషయాలు అసలే పట్టవు. ముఖ్యంగా తన విషయం. కానీ - అతనికీ కొన్ని సరదాలు ఉండేవి! అందులో ముఖ్యంగా చెప్పుకోదగ్గది - ఆమె చేత, జుత్తుకు నూనె రాయించుకోవడం! చిత్రమేమి

టంటే అలా రాయడం దేవమ్మకూ సరదాగానే ఉండేది. అయితే - దేవయ్య బయటపడ్డాడు కానీ, ఆ మహాతల్లి ఎప్పుడూ బయటపడలేదు.

ఒకసారి దేవమ్మ - ఎందుకో పుట్టింటికెళ్ళవలసివచ్చింది. అలా వెళ్ళడం దేవమ్మ కిష్టంలేదు. దేవయ్య కెలాగూ ఇష్టంలేదు. కానీ వెళ్ళక తప్పలేదు వారి ఇష్టానిష్టాలతో సంబంధం లేకుండానే, వారికీ ఎడబాటు సంభవించింది. అంతకుపూర్వ మెపుడూ వారికిలాంటి సంకటస్థితి ఎదురు కాలేదు.

"నానుండి నన్నే ఎవరు వేరు చేశారు!".... అని మధనపడ్డాడు దేవయ్య.

"ఆ కనుపట్టు క్షేత్రమున కావలి గట్టున పంటచేను, నాజూకుగ గాలిసోకి, తన చూపులతో ప్రణమిల్లిన" ప్రతిసారీ, అతనికి దేవమ్మ గుర్తుకొచ్చి - తహ తహలాడిపోయాడు. తన చుట్టూ పరచుకొన్న ప్రకృతి సౌందర్యరేఖలలో ఆమె దాగి ఉన్నదని తనను వోదార్చుకొన్నాడు. అలా వంటింటిలోకి తొంగి చూస్తే, నడుము చుట్టూ చీర కొంగును చుట్టి, చిట్టివంటకత్తెలాగా, అటూ ఇటూ మసలే దేవమ్మకు బదులు ఇంకెవరో కనిపించి, ఉసూరుమన్నాడు దేవయ్య. ఆమె జ్ఞాపకం వచ్చిన ప్రతిసారీ, "ఏవో ఉత్తమ లోకాల ద్వారాలు తెరుచుకొన్నట్లు"నిపించేదతనికి.

"అంతా అందమే, ఆనందమే అయితే, అది జీవితం ఎట్లా అవుతుంది అన్నగారూ!" అన్నదొకసారి దేవమ్మ ఏ సాహితీమూర్తితోనో!

ఆనందపు సాంద్రత, ఔన్నత్యమూ తెలియాలంటే - విషాదాన్ని కూడా చవిచూడాలనుకొన్నదేమో, దేవమ్మ - దాన్ని భర్తకు అనుభవనీయం చేయాలనుకొని ఉంటుంది, వెళ్ళిపోయింది!

"అయ్యోడలందు గంటకితమై చనుద్రోవల గాళ్ళక్రింద నా పయ్యెద నొద్దెదన్ బెడగ వచ్చిన ముండ్లను గ్రుచ్చుకొన్న నేకయ్యెల కాలు జారినను, కన్నుల వెచ్చని నీళ్ళనద్దు" తానన్న సీతాదేవి గుర్తుకొచ్చింది దేవయ్యకు. తన సర్వభారాన్ని ఆమెపైన వేయడం న్యాయమనే అనుకొన్నాడు - ఆమెలో అనేక మార్లు దైవాంశను చూసుకొన్నాడు గనక!

"తొలకరి చినుకు వంటి చిరునవ్వు కనిపించినా, సజ్జనుడి స్వాంతమల్లే స్వచ్ఛంగా మెరుస్తూన్న చందమామ కన్పించినా," అతని కంటికి కునుకు పట్టేది కాదు!

" నీ చేతిలో చేయివేసుకొని ఉన్నట్లయితే, కొండంత నిశ్చింతగా నిద్రపోయేవాణ్ని " అనుకొన్నాడు.

తల్లితనాన్ని ఆమెలో దర్శించుకొన్న దివ్యఘడియలన్నీ గుర్తుకొచ్చాయి. రాగానుబంధాలను అధిగమించిన ఆ మాతృకాస్వరూపం గుర్తుకొచ్చిందతనికి. తను శిశువుగా మారిన సన్నివేశాలూ గుర్తుకొచ్చాయి.

" దేవీ! ఉన్నతమైన నీ వ్యక్తిత్వం ముందు నేను శిశువును, వినమ్రుణ్ణి అయి, నీకు నమస్కరిస్తున్నాను" అన్నాడు.

ఆమెను తలచుకొన్న ప్రతిసారీ, జన్మజన్మల నుండీ తెలిసినవారిని తలచుకొన్నట్లుగానే ఉన్నది దేవయ్యకు. ఆమెలో ఈశ్వరత్వాన్నీ, ఈశ్వరునిలో ఆమెనూ చూశాడు దేవయ్య.

" నీవు నా చెంత లేనిదెప్పుడు? అహర్నిశలూ నీ సన్నిధి నన్ను తేజస్వంతుని చేస్తూనే ఉన్నది. నేను నీలోకి, లోలోనికి, అంతర్ముఖుడనై ఉన్నప్పుడు, సత్య శివ సుందర మూర్తివై, నా మనోనేత్రం ముందు సాక్షాత్కరిస్తావు " ! అన్నాడు దేవయ్య.

" నేను నీ అడుగుజాడలలో నడిచే భక్తపరాయణుడిని " అన్నాడు వినయంగా.

" ఒక దేవతకు కొడుకుగా జన్మించినందుకూ, మరొక దేవతను సహచరిగా పొందినందుకూ," సర్వేశ్వరునికి వందనాలు సమర్పించుకొన్నాడు దేవయ్య.

* *

ఈ సజీవ కథా రూపకంలోని పాత్రల పేర్లు దేవయ్య, దేవమ్మ. పాత్రధారుల పేర్లు - బాలకృష్ణారెడ్డిగారు, రంగనాయకమ్మగారు. నటీనటులిద్దరూ ఈ జీవ నాటకాన్ని 54 సంవత్సరాలపాటు అద్భుతంగా ప్రదర్శించారు. ఈ ప్రదర్శనాన్ని దర్శించినవారందరూ " అద్భుతం, అనన్యం " అన్నారు. అందరూ సుఖాంతమవుతుందనుకొన్నారు, కానీ, దర్శకుడు విషాదాంతం చేశాడు, నాయికను తెర వెనుకకు పిలిపించుకొని !

జీవితమంటే ఒక నిరీక్షణ !

జీవితమంతా ఒక నిరీక్షణ ! !

జన్మకోసం నిరీక్షణ, ఉనికికోసం నిరీక్షణ, మనికికోసం నిరీక్షణ, మనసు కోసం నిరీక్షణ, ముక్తికోసం నిరీక్షణ !

ఈ నిరీక్షణలన్నీ బాహిరమైనవీ, అంతరికమైనవీ కూడా! కొన్ని అందరికీ తెలుస్తాయి, ఇంకొన్ని కొందరికే తెలుస్తాయి.

ఈ బహిరంతర రంగాల వెనుక గల అంతరాంతరాంత రంగంలోని జీవుడు, మరొక నిరీక్షణలో నిమగ్నమై ఉన్నాడు. అదే అసలైన నిరీక్షణ – నిరీక్షణావశ్యకత లేని నిరీక్షణ – దివ్యస్థితికోసం నిరీక్షణ ! ఆ దివ్యస్థితికి మనుషులు పెట్టుకొన్న పేరు "మృత్యువు".

జీవితం వేరూ మృత్యువు వేరూ కాదు. జీవితంలోని ఒక భాగమే మృత్యువు. జీవరేఖ, మృత్యురేఖ, జమిలిగానే ప్రయాణం చేస్తూ ఉంటాయి. తొలిరేఖ ఒక స్థితిలో ఆగిపోతుంది. మలిరేఖ గమ్యస్థానం చేరుకొంటుంది.

" ఈ చరాచర జగత్తులో ఏదీ శాశ్వతం కాదు. ఏదీ నిత్యంకాదు. ప్రతిదీ ఏదో ఒకనాటికి నశించవలసిందే ! రూపుమాసి పోవలసిందే! ఇలా పోవడాన్నే " మృతిచెందడం " అంటున్నారు. జీవించే అర్హత ఉన్నవారికే మరణించే అర్హత కూడా ఉంటుంది. సర్వోత్తములైన వారిని, మృత్యువు ఎత్తి చూపుతుంది. మరణం ఒక నికషోపలం వంటిది. మంచి చెడ్డల తారతమ్యాన్ని మరణం ఇట్టే తేల్చి పారేస్తుంది .... ఎందరెందరో బంధువులు, మిత్రులు, హితులు, నీ ఇంటికొచ్చినప్పుడు సంతోషంతో స్వాగతం చెబుతావు. అలాగే మృత్యువును కూడా, నీ మిత్రునిలాగా ఎందుకు చూడలేకపోతున్నావు ? ఎందుకు స్వాగతం చెప్పలేకపోతున్నావు ! ఏదో ఒక నిర్దేశిత క్షణాన, మిత్రుని లాగానో, హితునిలాగానో, బంధువులాగానో, అతిథిలాగానో, ఆఖరుకు నీ శత్రువు లాగానో, మృత్యువు నీ ఇంటికి రాక తప్పదు. మృత్యువు ఏ రూపంలో నీ ఇంటికి రావడమనేది – మృత్యువు పట్ల నీ వవలంబించే ధృక్పథం మీద ఆధారపడి ఉంటుంది. మృత్యువు నీకు బంధువు ! నీకు హితవరి, నీకు స్నేహితుడు .... మరణం తుది నిద్ర కాదు. అది తొట్టతొలి మేలుకొలుపు. "

( సశేషం పుస్తకం నుండి, పుటలు 107, 108 )

*                    *

నిజమేగానీ మనం తరం మనీషులం కాము. మామూలు మనుషులం. మామూలు మనుషులకున్న సుఖదుఃఖాలన్నీ మనకూ ఉన్నాయి. కాకపోతే కొంచెం తేడాతో.

ఒక మంచి జరిగినప్పుడు "అహా" అనుకోవడం, ఒక చెడు జరిగినప్పుడు "అయ్యో!" అనుకోవడం సహజం. అతీత సహజమేమిటంటే - ఈ అహా, అయ్యోలను అదుపులో ఉంచుకోవడం.

*     *

దేవయ్య దేవమ్మల కథను, మనం హఠాత్తుగా ఆపివేశాం. దర్శకుడూ రూపకాన్ని విషాదాంతం చేశాడనుకొన్నాం.

ఈ రూపకంలోని పాత్రలూ, పాత్రధారులూ, దాదాపుగా వొక్కరే! యాభయ్ నాలుగేళ్ళపాటు, అసామాన్య సాంసారిక జీవితానుభవానంతరం, రంగానాయకిగారు, రంగంనుండి నిష్క్రమించారు. ఈ మహాప్రస్థానం జరిగి కూడా, దాదాపు ఒక దశాబ్దం కావస్తోంది. ఈ దశాబ్దకాలంలోనూ, ఒక్కొక్షణం ఎంత నిడివిగా సాగిఉంటుందో రెడ్డిగారి నడగాలి, రెడ్డిగారే చెప్పాలి.

ఈ రెండు క్రియల్లోనూ, వొకటి జరుగుతుంది - అది మనం అడగడం. రెండవది జరగదు - అది రెడ్డిగారు చెప్పడం!

చెప్పడానికి చాలా మార్గాలున్నాయి. రేఖలు, రంగులు, ఆలాపనలు, సౌంజ్ఞలు, మాటలు, మొదలైనవి. చాలా అనుభవాలు ఈ అభివ్యక్తికి లోబడే ఉంటాయి. కానీ, కొన్నికొన్ని అనుభవాలు, అనుభూతులు, ఈ ప్రతీకల నన్నింటినీ ముంచివేసి, వరదలాగా పొంగులెగసి, నభోమండలాన్ని తాకుతూ ఉంటాయి. అప్పుడు మౌనం తప్ప, కన్నీరు తప్ప, ఇంకే ప్రతీకా కనబడదు.

భార్యా వియోగాన్ని ఈ రెండు ప్రతీకలద్వారానే బాలకృష్ణారెడ్డిగారు చెప్పారు, చెబుతున్నారు.

అందుకొన్నవారు - నిస్సందేహంగా చాలా కొద్దిమందే అయిఉండాలి!

ఆ కొద్దిమందిలోనూ శ్రీమతి వేదవతిగారొకరు.

వేదవతిగారు నాకెంతగా తెలుసునంటే - అంకెల్లోనూ, అక్షరాల్లోనూ, అయితే - సుమారుగా ఏడెనిమిదేళ్ళుగా. ఈ రెంటినీ అసింటాగా ఉంచితే - "చాలా" కాలంగా.

ఇప్పుడీమె, నాకు అక్కయ్య !

ఈ అక్కగారు రాసిన పుస్తకాలన్నీ చదివాను, అన్నీ బాగున్నాయి. "ముంగిటి ముత్యం" మరీబావుంది. ఆ పుస్తకం చదువుతున్నంత సేపూ, నాకు "అమ్మ" కనిపించింది. అప్పటికే ఆమె అక్కగారయిపోయిందికానీ, లేకపోతే - "అమ్మా" అని పిలిచి ఉందును.

ఈ అక్కగారు, బాలకృష్ణారెడ్డిగారి మౌనం విన్నారు. కన్నీరు కన్నారు. తను విన్నదానికీ కన్నదానికీ అక్షర రూప మిచ్చారు. ఆ రూప చిత్రణం - ఇదిగో - ఈ "స్మృతిగీత"గా మన ముందున్నది.

తెలుగులో స్మృతి రచనలున్నాయికానీ వాటిసంఖ్య చాలా స్వల్పం. అవన్నీ కవితలుగా, కావ్యాలుగా, వచన గ్రంథాలుగా ఉన్నాయి. లేఖారూపంలో ఉన్నాయా ? నాకు తెలిసినంతలో లేవు. ఆ తరహా రీతికి, మా అక్కగారే శ్రీకారం చుట్టారన్నమాట !

ఈ కోవకు చెందిన రచనలు చేయడంలో ఉన్న క్లిష్టత, అనుభవించిన వారికి గానీ తెలియదు.

ఇందులో 54 లేఖలున్నాయి - 54 సంవత్సరాల దాంపత్య జీవితానికి గుర్తుగా. ఈ లేఖలన్నీ, బాలకృష్ణారెడ్డిగారు, తన అర్ధాంగికి రాసినట్లుగా ఉన్నాయి.

అంటే, ఇవి రాస్తున్నప్పుడు - వేదవతి వేదవతి కాదు. బాలకృష్ణారెడ్డి గారయిపోయింది. మా అక్కగారికి పరకాయ ప్రవేశ విద్య తెలుసునన్న అనుమానం "ముంగిటిముత్యం" చూసిన నాడే కలిగింది. అది అనుమానం కాదనీ, సత్యమేననీ, ఈ 'స్మృతిగీత' రుజువు చేసింది !

ఈ "గీత"ను నేను త డి క ళ్ళ తో నే చదివాను. తడిగుండెతోనే అనుభవించాను, ఇందులోని అన్ని సన్నివేశాలూ, నా అనుభవంలోనివే ! బాలకృష్ణారెడ్డిగారిలాగే, నేనూ నా దేవమ్మను పోగొట్టుకొన్నాను - 34 ఏళ్ళ ప్రమోదతప్త జీవితానంతరం. ఈ దేవమ్మ పాత్రధారిణి అసలు పేరు "కాంతం" - నాకు "కాంతంమ" !

అర్ధాంగిలో అమ్మను చూడడం గొప్ప అదృష్టం ! బాలకృష్ణారెడ్డిగారు అక్షరాలా అలాంటి అదృష్టవంతులే ! ఈ "అమ్మతనం" తననిండా పండించుకొన్న భాగ్యశాలిని రంగనాయకిగారు. అమ్మతనంలో అనురాగం, ఆప్యాయత, ఆర్ద్రతలు అగ్గలంగా ఉంటాయి. అవి - అడుగడుగునా, ఆచరణలో కనబడుతూనూ ఉంటాయి.

ఏకాభిప్రాయాలున్నవారి మధ్య స్నేహం కుదరడం సులభం. ఆ మిత్రత్వం కలకాలం ఉండడమూ సులభమే !

అక్కడెక్కడో, మనకు తెలీని ఏ దివ్యలోకంలోనో ఉన్న రంగనాయకి గారూ, కాంతమ్మగారూ ఈ సరికే స్నేహం కలుపుకొని ఉంటారు తమ తమ మధురానుభవాలను కలబోసుకొంటూనూ ఉంటారు.

విషయమేమో వియోగమేగానీ – ఎక్కడా విషాదం ధ్వనించకపోవడం నాకు ఆశ్చర్యంగానే ఉంది !

ఏమయి ఉంటుంది ?

బహుశా ఇలా అయిఉండాలి !

తన దుఃఖాన్నంతా, ఈ లేఖల మూలంగా – రంగనాయకిగారికి గుర్తు చేయడంద్వారా, ఆ తల్లి మనస్సును కష్టపెట్టటం వై. బి. రెడ్డిగారికి ఇష్టం ఉండదన్న సత్యాన్ని వేదవతిగారు గ్రహించి ఉండాలి. తను లేకున్నా, తన జ్ఞాపకాలతోనే, తన కన్నయ్య కుదురుగా ఉన్నాడని, రంగనాయకిగారను కోవడమే శ్రీ వై. బి. రెడ్డిగారి ఉద్దేశమూ అయి ఉండాలి

శిలాసదృశమైన నిశ్శబ్దంలోకి, ఓ చిన్న శిల్పశబ్దం అడుగు మోపి,

అతి గాఢమైన అంధకారంలోకి, ఓ చిన్న మిణుగురు చొచ్చుకొచ్చి,

సాంద్రాంధకారాన్ని దీప్తిమంతం చేసి సజీవశిల్పాన్ని దర్శనీయం చేసినట్టు – నాకనిపించింది !

ఒక్కొక్క లేఖ – ఒక్కో జలతారు దీపం !

కాంతాలయ
హైదరాబాదు – 500457 26–1–1990

# ఇదీస్పందన

స్పందన సాహితీ సమాఖ్య 70వ ప్రచురణ యిది.

21వ యేటలో అడుగుపెట్టిన స్పందన తనదంటూ ఒక ఒరవడిని సృష్టించుకుని, ఎన్నో ఒడిదుడుకులు అధిగమించి సాగిపోతోంది. తానెన్నుకున్న బాట గ్రంథ ప్రచురణం.

వి. వేదవతిగారు ఆంధ్ర పాఠకలోకానికి చిరపరిచితులు. సామాన్యమైన కథ, నవలా రచన జోలికి పోకుండా, ఒక ప్రత్యేకమైన శైలిని తనదాన్నిగా చేసుకుని ఇప్పటికే ఈ రంగంలో ఒక విశిష్ఠ స్థానాన్ని పొందారు. వీరి రచనలు "తెలుగు వెలుగు", "సామెత", "ముంగిటి ముత్యం", "సరళి" గతంలో మా ప్రచురణలుగా వెలువడి పఠితల, విమర్శకుల, పత్రికల ప్రశంసలు పొందాయి.

ఇప్పుడు వెలువడుతున్న స్మృతిగీత గూడ తెలుగు సాహిత్యంలో ఒక ఆణిముత్యంగా వెలుగొందగలదని ఆకాంక్షిస్తూ .... మాకీ అవకాశమిచ్చిన శ్రీమతి వేదవతిగారికి కృతజ్ఞత లర్పిస్తున్నాము.

ప్రధాన కార్యదర్శి
స్పందన సాహితీ సమాఖ్య

# అందరికీ అభివందనాలు

జీవన్మరణాలను రమ్యమైన వింతలుగా దర్శించి ఈ "స్మృతిగీత"కు ఒక తాత్త్వికనేపథ్యాన్ని - "జీవనగీత"గా అందించిన వివేచనాపరులు - సుహృద్వరులు డా॥ బెజవాడ గోపాలరెడ్డిగారు -

నాపైన ఆదరంతో "స్మృతిమాధురి"ని అందించినవారు- పలికినదంతా కవిత్వం అయితే, అసలు కవితే తనకు చిరునామా అయితే - ఆ నిలువెత్తు కవితామూర్తి - ఆచార్య సి. నారాయణరెడ్డిగారు -

అమ్మమ్మ, తాతగారల మధ్య ఉండే ఆత్మీయరాగాలను - స్వయంగా ఎరిగిన స్వర్శానుభూతితో - 'స్మృతిగీత'ను 'వియోగగీత'గా పరామర్శించిన విదుషి డా॥ సుమతీ నరేంద్రగారు -

జీవరేఖలోనూ, మృత్యురేఖలోనూ అనురాగదీపమే వెలిగించుకొంటూ 'స్మృతిగీత'ను ఆర్ద్రంగా చదివి - "అమృతగీత"ను ఆలపించిన మనస్వి డా॥ రావూరి భరద్వాజగారు -

కలాన్నీ, కుంచెనూ శబ్దార్థాలవలె మేళవించగలిగిన ప్రతిభాశాలి - "స్మృతిగీత"కు ముఖపత్రరచన చేసిన శ్రీ శీలా వీర్రాజుగారు -

జీవితంతోపాటు - నా సాహిత్య జీవితాన్ని, పుస్తక ప్రచురణ వ్యయప్రయాసల భారాన్నీ కూడా పంచు కొంటున్న బ్రతుకుతోడు శ్రీ సి. కృష్ణరావుగారు -

ఒక మంచి పుస్తకం అచ్చువేయడం అంటే అక్షరసరస్వతిని అర్చించడమే - అన్న నమ్మకంతో ముందుకు సాగుతున్న స్పందన సాహితీ సమాఖ్య సారథి, నా రచనలను అభిమానంతో అచ్చువేస్తున్న మిత్రుడు శ్రీ గుత్తికొండ సుబ్బారావుగారు -

ఈ రచనలో, నా ఆలోచనలకు భాష్యం చెప్పినట్లుగా అనిపించి - మధ్య మధ్య నేను వాడుకొన్న శ్లోకాలు, పద్యాలు, పదాలను రచించిన-గీర్వాణాంధ్ర మహాకవులు- అజ్ఞాత జానపద గేయకర్తలు -

పుస్తకాన్ని ముచ్చటగా ముద్రణ చేసి ఇచ్చిన స్పందన ప్రింటర్స్ వారు -

అందరికీ కృతజ్ఞతాభివందనాలు

సి. వేదవతి

ఈ ప్రపంచమున ఒక దినము నవ వధూ వేషమున
వచ్చి నీవు నా ప్రక్కన నిలచితివి—
ఉంచితివి నా హస్తమున కంపించు నీ హస్తమును
అది కేవలము ఒక్క ముహూర్తమున సంభవింపలేదు !
అనాది కాలముగ దాని ఏర్పాట్లు జరుగుచుండెను
ఇద్దరి సమ్మేళనమున మన మిద్దరము సంపూర్ణుల మగుదుము
ఈ ఆశను వహించియే బహు యుగములుగ వచ్చితిమి—

నీవు నా జీవితంలోకి ప్రవేశించటం ఒక సౌందర్యమయమైన సన్నివేశం ! ఎన్నాళ్ళకైనా, ఎన్నేళ్ళకైనా, తలచినంతనే నన్ను వివశుణ్ణి చేసే సన్నివేశం !

నిన్ను గురించిన స్మరణ సుగంధాలు జన్మాంతర పరిమళాలను పొదువుకొన్నట్టివి — మాటి మాటికీ నన్ను స్పృశిస్తూ — మనస్సుకు చందనపు పూతలు అలదుతూ !

చల్లనైయున్న నా హృదబ్జమ్మునుండి
తలవని తలంపుగా నొక్క లలితగీతి
జాలువారి యీ మంజులోషస్సువేళ
విరిసికొన్నది మంచు తుంపురులయందు !

నీవు నా బ్రతుకు జోడువైన దివ్యక్షణంనుండీ ఎన్నెన్ని పరిమళాలు ఈ జీవితంలో ! నిత్య నూతనంగా అగుపించే ప్రొద్దు పొడుపులాగు, నిన్న మొన్నటి రాగ మాధుర్యాల కలకంఠ కుహూలలాగు-నన్ను తరుముకు వస్తున్నవి- స్మృతిరేఖలు ఎన్నో ! మరెన్నో !

ఆనాటి తొలి చూపు తొలకరింతలు, తలచినంత మాత్రంచేతనే చేరవచ్చి నన్ను పులకాంకితుని చేస్తున్నవి. నా అంతరాంతర సీమలనుండి ప్రభవించి వచ్చిన కల్పనామూర్తివలె కనుపించావు నీవు — ఆ తొలి దర్శనపు వేళ ! పచ్చని కొబ్బరాకులు చుట్టిన మంగళ వివాహ మంటపంలో — తెరకు అవలగా నీవు !

తెమ్మెర తెర ఒకటి వీచి ఈ తెర ఒకింత తొలగరాదో ! - అనుకొంటున్న నా మదిలో ఏదో ఒక మధురాలాపన ! వ్యక్తత తెలిసి, ఇంతవరకూ నా ఎరుకకు రాని ఒక ప్రియ భావన !

అంతలో, మంత్ర ఘోషల మధ్య, మంగళ వాయిద్యాల మధ్య— నీ మృదుల హస్త స్పర్శ—నా నడినెత్తిపైన—నా చేయి నీ శిరస్సుపైన ! అది ముహూర్తవేళ ! నా జన్మను తరింపచేసిన దివ్య సుముహూర్తవేళ ! ఒక్క ముహూర్తకాలం మేను పులకలెత్తి గొంగరుచి అయిన వేళ !

ఆ ముహూర్తమునం దద్భుతావహముగ
నీ కటాక్షేక్షణావళీ నిశిత విశిఖ
వితతి తాకగ మన్మనో విహగ మపుడె
పల్లటిలి వాలె నీ పాద పద్మ యుగళి !

మన ఇద్దరిమధ్యా తెరను ఎత్తివేసి, మనకు నవజీవన భవన ద్వారం తెరిచిన వేళ—ఓరగా తల ఎత్తి నన్ను నీవు చూచిన వేళ !

ఆ క్షణం తాలూకు అద్భుతానుభవం—ఇంతకాలంగా నా హృదయాన్ని పొదువుకునే వుండిపోయింది, మరపు తెరల మాటుకు పోని ఆ మధురాతి మధురస్మృతి మనసు పొరలమాటున పదిలంగా నిలిచిపోయింది !

నా తపః ఫలము నా పుణ్యముల పంట
మూర్తి కట్టిన యట్టుల నిను కాంచినాను !
అలనాటి ఆ చూపు అలరింపులే
వెన్నడి వెన్నాడి మురిపించు నన్ను !

ఇట్టి దట్టి దనరాని ఆత్మీయతా ముద్ర ఏదో ఆ క్షణాన నాటుకొన్నది నా హృదయాన ! ఇన్ని సంవత్సరాల అనంతరం—ఇప్పటికీ తలచి నప్పుడల్లా, నిత్యనూతనానుభవమై నన్ను పరవశుణ్ణి చేస్తున్నది !

# 2

నిన్ను అట్లా చూచిన తొలి క్షణం తాలూకు పరిమళం నన్ను ఈ జన్మ పర్యంతమూ వెన్నాడుతూనే ఉన్నదని అన్నానా ? ఆ దివ్యముహూర్తకాలంలో నాలో చెలరేగి వచ్చినవి ఎన్నో అపురూప భావనలు :

అమృత వర్షిణివి నీవు ఆనంద
రస నిర్ఝరిణివి నిజము !
దివ్యలోకములన్ని దాటుకొని వచ్చి
నా జన్మ తరియింప నరుదెంచినావు !

ఇంతటి పవిత్ర భావం అంకురించింది నా హృదయాంతరంలో ! ఇట్లా అనిపించడం నాకేనా? అనాదిగా అర్ష ధర్మాను బంధ బద్ధులైన వధూవరులందరికీనా! ఇదేమిటి ఈ విచిత్ర అనుబంధ స్ఫురణ ! కొందరు కవులు వర్ణించినట్లు ఇది తొలి చూపులోనే అంకురించే ప్రణయ భావమా ! లేక, ఇక్కడ - ఇప్పుడు - మన ఇద్దరినీ దంపతులు కమ్మని అనుసంధానం చేస్తున్న పురోహితుల ఆశీర్వచన ప్రభావమా !

ప్రియాతు సీతా రామస్య దారాః పితృకృతా ఇతి
గుణై రూప గుణై శ్చాపి ప్రీతిర్భూయో వ్యవర్ధత.

మొదట రామునికి సీత నాయనగారు కూర్చిన భార్య అని ప్రియురాలు అయినది. అట్టి ప్రేమాంకురాన్ని ఆమె తన సౌశీల్యాది గుణముల చేతను, సౌందర్యాతిశయం చేతను వర్ధిల్ల చేసినదని భవభూతి దంపతి ప్రేమను గురించి సుమనోహరంగా వర్ణిస్తాడు !

అట్లే - సీతకు రాముడున్నూ ప్రాణముల కన్న ప్రియుడైనాడట ! ఆ విధంగా ఒకరి మీద మరొకరికి పెనవేసుకొన్న ప్రీతియోగం ఆ ఇరువురి మనస్సులకే ఎరుక అయినది. అది ఇట్టి దట్టి దనరాని అనురక్తి విశేషం !

ప్రేమా, ప్రణయం, అనురాగం, స్నేహం - ఈ అన్నిటికీ ఏవో ఏవో అర్థాలూ, నిర్వచనాలూ చెపుతారు. అవన్నీ నాకు అంతగా తెలియవు. వాటిని గురించి నేను అంతగా ఆలోచించనూ లేదు. కానీ, ఇవన్నీ కలిపి మూట కట్టిన అద్భుత ప్రపంచమేదో ప్రత్యక్షమైనట్లైనది - నిన్ను తొలిసారి చూచుకొన్న క్షణాన !

ఇది నిజంగా సంభవమేనా ! ఆ క్షణం వరకూ నిన్ను ఎరుగని నేను, నే నెవరినో ఎరుగని నీవు ! ఒకరినొకరం చూచుకొన్న క్షణంలో అంతటి ఆత్మానుసంధానం కలగటం ఎంత గొప్ప సంఘటన !

మన ఇద్దరకూ వివాహం నిశ్చయమైన నాటి నుంచీ నా మనస్సులో ఎన్నో మధురోహాలు ముసురుకొన్న మాట నిజమే ! నిన్ను గురించి ఎన్ని ఊహా పోహాలు చేసుకొన్నాను !

నీవు ఎట్లా ఉంటావు ! పసిమి చాయలోనా ! శ్యామ వర్ణంలోనా ? నీ రూపురేఖలు, ఆలోచనలు, అభిరుచులు — ఎటువంటివో ! నేను ఎరుగకనే, నా జీవన సహచరిగా ఎన్నిక కాబడిన నిన్ను గురించి నా మనసునిండా తేనె సోనల వంటి ఊహల ఊటలు !

ఇవన్నీ, మన తరం నాటి వ్యవస్థనుంచి మనకు అంది వచ్చిన అనుభవాలు! ఇటువంటి అనిర్వచనీయమైన అనుభూతిని ఈ తరంలోని యువతీ యువకులు ఊహించనైనా లేరు ! ఒకరి నొకరు చూచుకొనీ, కలసి మెలసి తిరిగీ, ఒకరంటే ఒకరు ఇష్టపడీ, మోజుపడీ — ఆ తరువాతనే దంపతులు అవుతున్న ఈ కాలానికీ, మన కాలానికీ ఎంతటి వ్యత్యాసం !

వీళ్లతో పోల్చుకొంటే మనం ఎంతటి ప్రాచీనులం ! — అనిపిస్తుంది ! అయినా, ఆ తరతరాల ప్రాచీనత నుంచే పుట్టుకువస్తున్నది ఈ అనుభూతి తరంగం !

ఈ మహాద్వైత భావ మింతగా కుదిరినది హృదిని !

ప్రియతమా !  **3**

నీవు తొలినాడు నా మనో నిభృత వీథి
జన్మ జన్మాంతర పునీత సంస్క్రియా ప్ర
ణీత మానంద శకలము నీ మనోజ
తేజ సంస్పర్శ కలిమి వెల్గించినావు !

ఒక అమృత క్షణాన నిన్ను అట్లా ఆత్మీయంగా సాక్షాత్కరింప చేసుకొన్నాను. ఆ నవ వధువు వేషంలో నీవు అప్పుడే విరిసిన నందివర్ధన కుసుమంవలె నాకు దర్శనమిచ్చావు. కించిదవనత వదనంతో వాలుచూపులు చూస్తూ వుంటివి ! సిగ్గుతెరలు ముసురుకుని వచ్చి నీ చెంపలకు గులాబీ పూతలు అద్దుతున్న భ్రమ కలిగింది నాకు. ఇది ఎంతటి రస నిర్భరమైన సన్నివేశం ! నీ వదనంలో చివురించిన లజ్జా దరహాస రేఖలను దోసిలి నిండుగా నింపుకొన్నాను తృషామూర్తినై !

అంతులేని నీ ముగ్ధత్వం గుండె లోతులను తాకి పరవశుణ్ణి చేసింది నన్ను. నీ వదనంలో ఉట్టిపడే లాలిత్యం నన్ను నిలువునా కదిలించి వేసింది ! అదుగో ! ఆ క్షణంలోనే—ఎన్నో ఎన్నో సుకుమారమైన ఊహలు చుట్టుముట్టి నన్ను ఆర్ద్రితామూర్తిని చేసివేశాయి !

ఎవరవు నీవు ! నన్ను ఉద్ధరించటంకోసం ఏ దివ్య లోకాలనుండో దిగివచ్చిన దేవతవా నీవు !

చిత్రమైన ఊహల మాలికలు ! నీవు ఎవరవూ కావు ! నీవు నా ఆత్మవు ! ప్రాణశక్తివి ! జన్మ జన్మాల తపఃఫలంగా నా ముందు ఇట్లా సాక్షాత్కరించావు !

నిన్ను ఏ సుకుమార కుసుమ సౌరభాలతో పూజించుకోను ! మనోవాక్కాయ కర్మలన్నిటితోనూ నిన్ను ఎంత శ్రద్ధంగా కాపాడుకోను !

తత పురాకృత కర్మానుగతి మదీయ
భాగ్యము వినిర్ణయము చేయు బ్రహ్మనుదల
ననుసరించిరి నాదు పిత్రాదు లగ్ని
సాక్షికంబుగ నిన్ను నా దాన చేసి !

బ్రహ్మ మన బ్రతుకు ముడులు రచిస్తున్న వేళ-నా గుండెలో ఇన్నిన్ని ఊహల పోహళింపులు !

ఒక్క ముహూర్తకాలం—నీవు కనురెప్పలు ఎత్తి చూచీ చూడనట్లు నన్ను చూచావు. ఆ అరక్షణంలో—నీ అరవింద నయనాలకు నా రూపు చిక్కి వుంటుందా !

సిగ్గుతో, సంకోచంతో—నీవు నన్ను తేరిపార చూడకనేపోతివి ! చూడకపోయినా, నన్ను గురించి నీవు ఏమని అనుకుంటున్నావో ! మాటి మాటికీ నీ కపోలాలను స్పృశిస్తున్న ఆ కెంపుల రంగులను అడగనా ?

నాలో సందడిస్తున్న ఈ తలపులన్నీ నీకు అవగతమయ్యేనా ? నా పట్ల నీకున్నూ ఇంతటి ఆత్మీయ భావం కలిగేనా ? నా గుండెలలో పొంగుకు వచ్చిన ఈ అద్భుతమైన రాగ తరంగిణి నిన్ను చేరి స్పృశించేనా ?

పెళ్ళిపీటలమీద కూర్చున్న నీవు నన్ను గురించి ఏమేమి తలిచావో తెలియదుకాని, నీవు మాత్రం నాకు ఆ క్షణంలో—

ఇద మిత్థమని నిర్ణయింపగా రాని దే
కోర్కియో రూపు గైకొన్న యట్లు
జన్మ జన్మాంతర సంగతమ్మైన యా
శా బలం బవధికే సోకినట్లు—

నా మనస్సున ముద్రపడటం మాత్రం నిజం ! ఆ ముద్ర—అర్థ శతాబ్ది తరువాత—ఇప్పుడు కూడా నా గుండెలో సుస్థిరంగా నిలచి వుండటం కూడా అంతే నిజం ! తదాదిగా, నా హృదయం క్షీరసాగరం కావడం కూడా నిజం !

ప్రియతమా !　　**4**

ఏకాంత వేళల ఎన్నో పురాస్మృతులు పాత చుట్టాలవలె చేర వస్తాయి. ఒక్క నిముషంపాటు కనులు మూసి కూర్చున్నానా — ఆ నాటి జ్ఞాపకాలు అంచెలంచెలుగా వచ్చి చేరి అక్షరాలై ప్రవహిస్తాయి.

కర్పూర పరాగాలు ! మన చుట్టూ అగరొత్తుల పరిమళాలు ఆ కళ్యాణ వేదికపైన ! పురోహితులు మన చేత ఏవో విధులు ఆచరింప చేస్తున్నారు, మంత్రాలు ఉచ్చరిస్తూ ఏదో పరమ పవిత్రమైన బంధాన్ని మనకు అనుసంధింప చేస్తున్నారు.

నా చేతిలో నీ చేయి మృదువుగా ! నీ చేతిని అందుకొంటున్నప్పుడు - సీతారాముల పురాణ దాంపత్యదివ్యాంశ విశేషమేదో మన ఇద్దరనూ పొదువు కొన్నట్లయినది

ఇక మీదట నీవు నాకు సహధర్మచారిణివి ! నాకు తోడు నీడవు ! కష్ట సుఖాలలో నన్ను సదా అంటిపెట్టుకొనే స్నేహితురాలవు !

నీ చేతిని నా చేతిలో పెట్టి —

ఇయం.... మమ సుతా సహధర్మచరీ తవ

ప్రతీచ్ఛ చైనాం భద్రంతే పాణిం గృహ్ణీష్వ పాణినా !

అని నిన్ను కన్నవారు నా చెవిలో ఊదినట్లైనది !

" సఖాయా సప్తపదా బభూవ "

" సాప్త పదీనం సఖ్యం "

మన ఇద్దరి చేతా ఏడడుగులు కలిపి నడిపించారు ! ఎప్పటికీ విడిపడనీయని స్నేహాన్ని మనకు సిద్ధింప చేశారు !

అంతేకాదు —

" పరస్పరాశ్రయేన దీప్యమానా "

పరస్పరాశ్రయం చేత మన ఇద్దరకూ శోభ కలగాలి ! ఒకరి వల్ల మరొకరికి దీప్తి సిద్ధించాలి ! ఈ అలంబన బలం — మన బ్రతుకు బాసటగా సాగిపోవాలి. ఇంతటి దివ్యమైనది కావాలి ఈ మన స్నేహం - అంటూ ఆశీర్వదించారు.

నీ చీర చెరగునూ నా ఉత్తరీయపు అంచునూ కలిపి బ్రహ్మముడి వేశారు.

పగడపు మోవి కెంపులకు బైపయి
దాగుడుమూతలాడు లే నగవు గులాబి పూ
సరమునన్ విరి మల్లెలు దాపినట్లు దోపగ,
బతి యుత్తరీయ మధుపర్కము గేల గ్రహించి,
వెంట జంటగ జను నమ్రభావము లనారతమున్ —

నా మనస్సును అలరిస్తూ, మధుర స్పందనలను కలిగిస్తూ ఉన్నవి. పులకిత హృదయంతో నాలోన నేను పాడుకొన్నాను.

ఏ మంచి వేళలో పౌరోహిత స్వామి
ముడివేసెనో మధుపర్క చేలముల చేర్చి
బ్రహ్మయువో నీ బ్రహ్మముడి కనుచు
ఆ దివ్య క్షణములో గాఢానురాగాలు
అల్లుకొనెనటే అపురూప బంధాలు !

ఆ నాడు నా ఎదలో పొంగులెత్తి - ఇప్పటికీ సరిక్రొత్తగా అనిపిస్తున్న ఈ దివ్యానుభూతి - నవ దంపతులందరికీ అనుభవంలోనికి వచ్చే విషయమేనా ?

ఇదంతా, మనదైన ఆర్ష సంప్రదాయానికి నిదర్శనంగా నిలుస్తున్న ధార్మిక దర్శనమా ? మంత్ర బద్ధమైన ఈ వైవాహిక విధుల్లో ఇంతటి మహత్వ పూర్ణమైన ప్రభావం ఉన్నదా ?

మంత్రఘోషకు వైవాహ వేళలందు
అంత శక్తి సమకూరునా యనుచు
తర్కించుకొనుదు నాలోన నేనె !
ఋషిప్రోక్తములు వైవాహ విధులు
ఆత్మ సంస్కారమున కాదిభూతములు
అట్టి సంస్కార బంధ మేదియో వచ్చి
పొదువుకొనె నటే నిన్ను నన్ను !

ప్రియతమా !

# 5

ఊపి ఊపి మనసు నొక్కొక్క వేదన
కావ్యమౌను మరియు గానమౌను !

హృద్గత గానంగా, అప్రయత్నంగా ఉబికి వస్తున్నది ఈ ఆలోచనాధార ; గుండె లోతున ఉద్భవించిన ఈ మౌన గానాన్ని ఎంత దూరంలో ఉన్నా, నీవు వింటూనే ఉంటావని తెలుసు. వింటూ వింటూ, నీ కన్నులు చెమ్మగిల్లుతున్నాయనీ నాకు తెలుసు.

నీ కన్నులలో రవ్వంత తడిని చూచినా, ఎంతకంత విచలితుడను అవుతానో నాకే తెలియదు ; నీకు ఈ సంఘటన గుర్తు ఉండి ఉంటుంది — నీ చేతిని నా చేతిలో ఉంచి అప్పగిస్తున్నారు మీ వాళ్లు. అప్పుడు నాకు ఏమనిపించిందనీ ;

చిన్న పూవును తెచ్చి చేత
పెట్టి నటులాయె నీ మృదుల స్పర్శ !
కరగ్రహణ మాత్రమున నే నొక్క
మంత్ర సిద్ధిని పొందినటుల
మహనీయ భావనలు ముసిరినవి మదిని !

అనురాగ రక్తిమతో నీ వంకకు చూచాను. ఇక ముందు నీవు త్రికరణ శుద్ధిగా నా దానవు ;

వాల్చిన నీ కన్నులలో అర్ధ్రపు తళుకులను చూస్తూ విచలితుడను అయినాను. ఎవరో ఎత్తుకొన్నారు పాటను - దయనీయంగా సాగదీస్తూ —

తల్లి చేతులలోను తండ్రి చేతులనూ
అల్లిబిల్లిగ పెరిగెనమ్మా యీ బిడ్డ
మీ పట్టి గాని మా పట్టి గాదు !

నిన్ను అల్లారుముద్దుగా కని పెంచిన నీ కన్నవారి గుండెలలో దూసిరి వచ్చిన జాలి పాట అది ;

పోయి రా ముద్దులా మల్లె మా తల్లీ
పోయి రావే చిలుక మురిపెంపు మొలక !

ఇన్నాళ్లుగా, కంటి పాపగా కాచి కాపాడుకొన్న తమ బిడ్డను ఒక అయ్య చేత బెట్టి అత్తింటివారికి ఒప్పగిస్తున్న వేళ - కడుపు చుమ్మలు చుట్టగా, తర తరాల తల్లితనం పాడుకొన్న అజ్ఞాత జానపద గీతిక ! ఎంత కరుణామయం ఈ సన్నివేశం !

నీ కన్నులలోని తడిని చూచి నేను నిలువలేకపోయినాను. ఎంతో మృదులంగా, మధురంగా - నిన్ను ఓదార్చుకోవాలని తపన పడినాను. నీ కన్న వారికి వలెనే — గారాబంతో, అనురాగంతో, కాపాడుకొన గలవాడను నీ వాడనని, నీ తోడు నీడను నేనని, నీ చెవిలో గుసగుసగా చెప్పుకోవలెననీ అనిపించింది - ఆ క్షణాన !

ఇప్పుడు, ఇన్ని వత్సరాల అనంతరం — ఏ జంటల పెళ్లి వేడుకను చూస్తున్నా, అలనాటి ఆ అనుభూతి స్పందన గుండెను తాకుతుంది ! నవ జీవన వసంతానికై ఉత్కంఠతో కూడిన నిరీక్షణ ఒక ప్రైపున, వదలి వెళ్లవలసిన చిరంతన బంధనాలు ఒక ప్రైపున — చిత్రమైన మనఃస్థితి కదా ఇది !

కన్నవారికి వీడ్కోలు చెప్పవలసిన వేళ - రాచకన్యకలకైనా, కావ్య నాయికలకైనా — ఈ బెంబేలుతనం తప్పలేదు ! కణ్వాశ్రమంలోని పువ్వులూ, లతలూ, పక్షులూ, వృక్షాలూ, లేళ్లూ .... నెమళ్లూ కూడా - దిగులుపడినాయట శకుంతల వదలి వెళ్లేటప్పుడు ! పరమ కరుణార్ద్రంగా వర్ణిస్తాడు కదా - పెంపుడు తండ్రి కణ్వుని మనఃస్థితినీ !

వలచి, వలపింప చేసుకొని, అంతులేని విరహ వేదన అనుభవించిన కావ్య నాయికకు కూడా అత్తవారి ఇంటికి వెళ్లేటప్పుడు అంతటి అశ్రుధారలు ఎందుకో !

తమ్ముల బంపుదునమ్మ! శీతమ్ముల బంపుదు, రాజహంస పో
తమ్ముల బంపుదున్, బరిచి తమ్ముల గానన దేవతాలి జా
తమ్ముల బంపుదున్, ద్రుతగతమ్ముల నేనును సారణి ప్రపా
తమ్ముల వత్తు, విశ్వవిదితా, ముదితా ! మది తాపమేటికిన్ !

అంటూ తల్లి సముదాయించితేనే కాని ఊరడిల్లదు గిరిక !

నన్ను గన్నమ్మ నా నాటెంపు సొమ్మా
చిన్న మాణిక్యమ్మ చింతించకమ్మా !

నీ కమ్మల విలచిన అశ్రుకణం ఆ జాలి పాటకు చటుక్కున రాలింది ! నా గుండెను కరుణతో నింపింది !

ఈ సాయంత్రం ఒక్కడనే వచ్చి ఏటి ఒడ్డున కూర్చున్నాను. సహృదయుని మైత్రి వలె స్వచ్ఛంగా, నిర్మలంగా సాగి పారే నీళ్ల వంక చూస్తూ కూర్చున్నాను.

ఈ వారి శ్రీ మహాదేవ జాటాటవి
చిగురు చీల్చుక వచ్చు మొగలి రేకు
ఈ జల మ్మెమ్మెత్తో భూజానుల యశః ప్ర
కాశ పాథస్తటాకంబు కయ్యొ
ఈ వారి రత్నాకరేంద్ర హేలాధృతి
వ్యాలంబి యుత్తరీయంబు చుంగు
ఈ జలమ్ము మహాను క్రాంతిన కృతి చిరం
తన మహా సుకృతంపు తరువు వేరు -

ఏటి నీటిని చూస్తే ఏదో సాహిత్య రాగం బయలుదేరుతుంది మనస్సులో. శ్రీరామునికి దర్శన మిచ్చిన గాంగ వారిని ఇంత హృద్యంగా వర్ణిస్తాడు విశ్వనాథ ! ఈ ఏటి నీటిని చూస్తుంటే - తరుముకు వచ్చే తీయని జ్ఞాపకాలు ఎన్నెన్నో ! నీటి తరగలన్నా, పొంగులన్నా, నీకు ఎంతో ఇష్టం !

కథలు కథలుగా తరుముకు వచ్చే జ్ఞాపకాల స్మృతి పేటికను విప్పుకొని నీ ముందు పరచుకోవటంలోనే ఒక ఆత్మానుసంధాన స్థితిని పొందగలుగుతున్నాను. ఇదుగో, ఇప్పుడు మళ్లీ ఆ నాటి నీ నవ వధువు రూపం ముగ్ధమోహనంగా నా కనుల ముందు దృశ్యమానం అవుతున్నది.

చిరు సిగ్గు మొలకల చిన్న వధువుగ నీవు
గేహమున అడుగిడిన యపుడె
నా హృదయ గేహమునకు
సామ్రాజ్ఞి వైతి వపుడె దేవి !

నా అడుగులకు జోడు కలుపుతూ నీవు నా ఇంటి గడపను దాటి వచ్చావు. సరిగ్గా అప్పుడే నా హృదయ సీమనూ అధిష్ఠించావు. ఈ ఒంటరి బ్రతుకులోకి నాకు తోడు నీడగా ఉండటానికి వచ్చిన నా పాలిటి దేవతవు నీవే.

అర్థ బిందువు బ్రతు కింత దనుక
అర్ధాంగముగ నీవు చేర వచ్చి
పూర్ణత్వమును కూర్చినావనుచు
మనసులో చెలరేగు నవురూప భావనలు !

వినయ శీలివై, కించిదవనత వదనంతో, నా ప్రక్కగా నడుస్తున్న నిన్ను ఓరకంటితో చూచాను. ఒక సుప్రసన్నతాదీప్తి నీ ముఖాన్ని వెలిగించి వేస్తున్నది !

నీవు నీ లోలోపల ఇలా అనుకొంటూ ఉండి ఉంటావని ఊహించుకొన్నాను. " జంటగా అడుగు పెడుతున్నాను గృహస్థ జీవితంలోకి. ఇక ముందు ఈ ఇల్లు మా ఇద్దరిదీ. అన్యోన్యానురక్తులమై, మేము కష్టసుఖాలలో కలిసి జీవించాలి, బ్రతుకు పండించుకోవాలి "

నీవు అట్లా అనుకొన్నావన్నమాట అక్షరాల నిజమేనని ఆ తర్వాత ఒప్పుకొన్నావు. ఈ విషయాన్ని నేను ఎట్లా ఊహించగలిగానో అని ఆశ్చర్య పడినావు కూడా ? అది ఎట్లా సాధ్యమైనదో చెప్పనా !

నన్ను నే నెరిగినట్లు నిన్ను చూచిన క్షణమే నిన్ను ఎరిగిన వాడినైతినని అన్నాను కాదా ! అప్పుడు -

జన్మాంతరములుగా నిన్ను
నే నెరుగుదు నన్న తలపు
చిత్రముగ తాకినది హృదిని !

అత్యంతమైన అనురాగ బంధమేదో మన ఇద్దరినీ కలిపి కట్టివేసి నట్లయినది ! అప్పుడు నేను ఏమి చేశానో తెలుసునా ? మనకు జోడు కలిపిన ఈశ్వర శక్తికి వినయంతో విన్నవించుకొన్నాను ఇలా -

ప్రభూ ! దయతో నీవు నాకు ఈ బ్రతుకు జోడును ప్రసాదించావు. ఈమెను ప్రేమానురాగాలతో అభిషేకిస్తూ, కంటికి రెప్పవలె కాచుకోగలిగిన శక్తిని కూడా నాకు ప్రసాదించు. ధర్మ మార్గంలో ఇద్దరమూ కలిసి ఈ జీవనయాత్రను సాగించ గలిగిన నేర్పును కూడా అనుగ్రహించు "

ఈ ప్రార్థనను ప్రభువు అంగీకరించిన కారణంగానే - అప్పటికీ ఇప్పటికీ-

అపరిమేయానురాగ తోయమ్ము తోడ
నీకు నిత్యాభిషేకంబు నెరపు చుందు
మధుర భావ పరంపరా మాల్యములను
నీ మనోహర గళమున నిలుపు చుందు !

ప్రియతమా !

# 7

తొలి ఉషస్సు తాలూకు లేలేత వెలుగు రేక వలె నీవు నా ఇంట అడుగు పెట్టావు. లేత తమలపాకు వలె పరమ సుకుమారంగా ఉండి బెదురు కళ్ల తో మసలుతూ వుండిన నిన్ను చూచినప్పుడు అంతులేని కారుణ్య భావమేదో నా అంతరంగాన్ని కలచివేసేది.

ఇప్పటి వరకూ తల్లి దండ్రుల చాటు కూనవు. మాతా పితరులు నీ చుట్టూ అల్లుకొన్న అనురాగపు ముడుల నుండి విడివడి ఈ క్రొత్త పరిసరాలకు వచ్చావు. నీకు ఈ ఇల్లూ, ఇంటిలోని వారూ క్రొత్త. నీ వారినీ, నీ స్నేహితులనూ వదలి నా ఇంటికి - నా బ్రతుకు పంచుకోవటానికి వచ్చావు. ప్రేమతో కూడిన అనుకంప తోనూ, అంతులేని కృతజ్ఞతా భావంతోనూ నిన్ను నా గుండెలో పొదువుకోవాలని అనిపిస్తూ ఉండేది !

'గృహాన్ గచ్ఛ గృహపత్నీ యథాసః'

నీవు నాకు సహధర్మచారిణివి మాత్రమే కాదు ! నా స్వామినివి ! నా గృహానికి అధిపతివి ! నవ వధువుగా నీవు తొలిసారి నా ఇంట అడుగు పెట్టి నప్పుడు - నా సర్వస్వానికీ అధిపతిగా ఆహ్వానించుకొన్నాను.

ఇరుగు పొరుగు వారు, బంధు మిత్రులు - క్రొత్త కోడలివి నిన్ను చూడటానికి వచ్చి పోతూ ఉండేవారు. వరుసయినవాళ్ళు నీతో పరియాచకాలు ఆడుతూ. నవ్వుతూ నవ్విస్తూ ఉండేవారు.

ఆ గడసరి మాటలకు - అప్పటికింకా పసితనం పూర్తిగా వదలని నీవు తెల్లబోయినట్లు కనుపించేదానవు. ఒక్కొక్కసారి నీవూ, ఆ హాస్యాలు అర్థం చేసుకొన్నట్లు విడీ విడనట్లు చిరునవ్వు దొంతరలు చిందించేదానవు. మరొక చమత్కారపు వాగ్బాణంతో - వారిని ఎదుర్కొనడం నీకు చేతనయ్యేది కాదు.

అప్పటి నీ ముద్దరాలితనం చూచి నేను నిలువునా కరిగిపోయే వాడను ! నిన్ను చుట్టుముట్టిన వారి హాస్యవలయాల నుండి నిన్ను ఎత్తుకుపోయి ఒక సురక్షిత ప్రదేశంలో దాచుకోవాలని అనిపించేది !

చిరు గాలి తరగకే చివురాకు వణుకు
మాటి మాటికీ నీవు ఉలికిపడగా చూచి
నా లోన చెలరేగు నపురూప భావనలు !

పుట్టి పెరిగిన సీమ విడచి వచ్చిన వేళ
క్రొత్త గడ్డని చూచి బెదురుకొన్నానో !
కన్నవారిని వదలి కదలి వచ్చెను తాను
క్రొత్తవారల నడుమ మసలు నెటులు !
ఎరిగి పెరిగిన పరిసరమ్ములె వేరు
బుద్ధి ఎరిగినదాది గురుతులవియే వేరు
బెంగటిల్లునో తాను అని తలచి నేను
కలతపడినానటు కొన్ని నాళ్లు !

ఆ నాడే నా మనస్సున ఒక సంకల్పం నాటుకొన్నది నీకు నేను భర్తనే కాదు - తల్లినీ, తండ్రినీ, తోడ పుట్టువునూ కావాలి అన్నిటినీ మించి ఆత్మీయుడైన స్నేహితుడిని కావాలి. ఆ ఆత్మీయత ఎంతటిదై ఉండాలంటే - నీ మనసులోని మాట ఎటువంటిదయినా, అరమరిక లేక నాతో చెప్పుకోగలిగినంత గాఢమైనదై ఉండాలి।

ఇప్పుడు - ఇంత కాలం అయిన తరువాత అల్లనాటి అపురూపపు అనుభూతులను నెమరువేసుకొంటూ ఉంటే — నాకు అనిపిస్తున్నది — నేను సంకల్పసిద్ధుడనే అయినానని। నాటి నుంచీ మన మధ్య నెలకొన్న ఆ సుస్థిర స్నేహబంధం కారణంగానే -

వెలుగులో, యమృతాలో, తావులో, మరేవో
కురియుచు జడులు జడులు గాగ, పొరలి పారు
కాలువలు గాగ, పూర్ణకలోలములుగ
కలదు నా లోన క్షీర సాగరము నేడు !

ప్రియతమా !

# 8

ప్రతి సాయంత్రమూ చేని గట్టుకో ఏటి ఒడ్డుకో వెళ్ళి నడక సాగించే అలవాటు నాకు ఎప్పటినుంచి అయిందో ఇప్పుడు చెప్పలేను సాంధ్యవేళ అంటే నాకు అంత ఇష్టం ఎందుకో కూడ చెప్పలేను. పశ్చిమ దిశనుండీ సన్న సన్నగా, కొంచెం కుంకుమ కలిపిన బంగారు రంగుతో ప్రపంచంమీదకు ప్రాకుతూ వచ్చే సాంధ్య కిరణాలను కన్నులలో నిలుపుకొంటూ నడక సాగించడం ఇప్పటికీ నన్ను వదలని అలవాటు.

నడుస్తూనే వున్నాను ఒంటరిగా. ఏటి నీళ్ళు జేగురు రంగు పులుముకుని మిలమిలలాడుతున్నాయి. చిత్రం—ఆ జేగురు రంగు నా అంతరంగానికి ప్రాకివచ్చిసట్లై రాగ రంజిత మనస్కుని చేసింది—నన్ను.

మన తొలినాటి కాపురపు మురిపాలు నిన్న మొన్నటి ముచ్చట్లలాగు నా మనోనేత్రం ముందు బొమ్మ కడుతూ వున్నవి.

నేను పుట్టిన నేల ఇది. ఊహ తెలిసీ తెలియకముందునుంచీ— ఈ ఇల్లూ పరిసరాలతో నాకు జత కుదిరిపోయింది. ఈ గాలి, ఈ నీరు— నాకు ఊపిరిని పోశాయి. ఈ మట్టిలోని ప్రతి అణువుతోనూ నాకు సంబంధం వుంది. ఈ తోట, ఈ చేనిగట్లు, ఈ ఏటి ఒడ్డు, వీటన్నిటితోపాటు నేను పెరిగాను, ఎదిగాను.

అదుగో ! అటువైపుగావున్న గది—అమ్మ నన్ను పొత్తిళ్ళ కెత్తుకొన్న పురిటి గది అక్కడే నన్ను ఉయ్యాలలో వేసి జోల పాడింది. ఈ ఇంటిలోనే దోగాడి దోగాడి చిడిబుడి అడుగులు నేర్చుకొన్నాను. గంటల తరబడి ఈ ఇంటి ముంగిట్లో ఆడుకొంటూ క్రిందా మీదా పడి తగిలించుకొన్న దెబ్బల తాలూకు గుర్తులు ఇంకా నా శరీరంపైన నిలిచే వున్నాయి. ఈ ద్వార బంధాలు-గోడలలో పగుళ్ళు, నాపరాళ్ళ గతుకులు-ఇవన్నీ-నేను కనులు మూసుకొన్నా గుర్తించ గలిగిన గుర్తులు !

అసలు చిత్రమేమిటంటే—అంత బాగా నేను ఎరిగిన ఇల్లు—నీవు వచ్చి రావటంతోటే—ఏదో కొత్త రూపంతో నాకు సాక్షాత్కరించటం ! ఏదో స్వర్గధామంలాగా నాకు తోచటం ! ఏదో అయస్కాంత శక్తిలాగా నన్ను ఆకర్షిస్తూ వుండటం !

నడిమింటిలో నీవు నడయాడగా చూడ
వెండి దివ్వెలు కొన్ని వెలిగినటులాయె !
నీవు మెట్టిన ఇంట మెరుపు జాడలు తోచె
తాత తండ్రులనాటి వాటియే కాని
దివ్య సదనమై దీపించె నిపుడు !
స్వర్గసీమగ భాసించె నీ పల్లె ఇల్లు
మింటిలోనిది ఒక చుక్క చక్కన వచ్చి
ఇంటి దీపముగాను వెలిగె ననుకొంటి !

క్రొత్త కోడలివి నీవు—మెల్లగా మసలుతూ వుంటావు. నేను ఏ పని చేస్తున్నా, ఎవరితో మాట్లాడుతున్నా, నీ మెత్తని అడుగుల సవ్వడిని గుర్తుపట్టగలిగే వాడను. నీ కాలి మట్టెల సన్నని మ్రోత, గాజుల గలగల—వినిపించినప్పుడల్లా నా గుండెలు ఝల్లుమనేవి నీవు ఏ మూల వున్నావోనని నా కన్నులు నీ కోసం వెతుకులాట ప్రారంభించేవి.

నునుసిగ్గు దొంతరుల దొరసాని నీవు
అభ్యంతరము నందల్లనల్లన నడవగా
చూచి చూడని యట్టుల ఓరకంటను నిను
తనివారగా చూచి తనియింతు దేవి !

అందరూ నవ్వులు పట్టించారు—"ఇల్లు వదలదేమిటి క్రొత్త పెళ్ళికొడుకు ! " - అంటూ ! నిజమే – భోజనానికీ నిద్రకూ తప్ప ఇల్లు గుర్తుకు వచ్చేది కాదు ఇదివరకు ! స్నేహితులు వచ్చి పిలిచినా వాహ్యాళికైనా వెళ్ళబుద్ధి కాదాయె నిపుడు !

మిత్రులు పిలిచినప్పుడు ఏదో సాకు చెప్పి తప్పించుకొంటున్నాను. ఆ సాకులోని నిజం ఏమిటో వాళ్ళకూ తెలుసు. నన్ను పరియాచకాలతో కాసేపు కవ్వించి - నవ్వుకొంటూ వెళ్ళిపోయేవాళ్ళు !

కంటి కింపుగ నీవు ఇంట మసలిన వేళ
కమ్మదనముల కొమ్మ కదలివచ్చిన యట్లు
కమ్ముకొన్నది నన్ను కమ్మ పరిమళమ్ము !
చిరునగవు లొలికించు చిన్ని కన్నియ నీవు
తరలివచ్చిన వేళ - నాదు తపము పండిన వేళ !

# 9

ఈ ప్రపంచము నంతను నెర్రని జిగి
పూసి, పూరించి, తన లేత పొద్దుపొడుపు
సొగసు చూపించ వలెనన్న, సూర్యుడు మును
తనదు బింబంబు సర్వస్వమును జిగిర్చి
వెలయగా వలె; లేకున్న కలియదు జిగి !

ప్రొద్దుపొడుపుకు రవ్వంత ముందుగానే - తూర్పున దిగంతరేఖలో కించిదరుణం కలిసిన సౌవర్ణరేఖలు ప్రాకి వస్తున్నాయి. బంగారంలో సరికి సరిగా రాగి కలిగిన వర్ణంలో పొడుచుకు వస్తున్న బాలార్కకిరణాలను చూచినప్పుడల్లా నాకు ఒక్కటే విషయం గుర్తుకు వస్తుంది. అది ఏమిటో నీకు చెప్పితీరాలి !

మళ్ళీ మొదటికి వస్తున్నాను. నీవు నా జీవన సహచరిగా, మన ఇంట అడుగు పెట్టిన తొలి రోజులు అవి. అప్పట్లో నేను అతి ముగ్ధుడనై చూస్తూ ఉండేవాడను- మాటి మాటికీ నీ చెంపల మీదకు కెంపురంగులు ప్రాకి రావటాన్ని! ఆ రంగు అచ్చంగా ఇట్లాగే ఉండేది - ఇదుగో - ఈ ప్రొద్దుపొడుపు కాంతికి మల్లేనే !

అంతటి ముద్దరాలిని నిన్ను చూచి అర్ద్రచిత్తంతో కరిగిపోతూ నాలో నేను తర్కించుకొంటూ ఉండేవాడను - ఇలా !

ఆడి పాడెడి సఖుల వదలి వచ్చెను తాను
క్రొత్త చెలుములు చేయ జాలునో లేదో !
తల్లిచాటున తాను గారాబు పోవునో
మెట్టినింటను మాలిమై మసలు నెపుడు !

ఆ వితర్కం అలా ఉండగానే, నా మనస్సులో ఒక పరమాప్త భావం ఉదయించేది !

ఇన్నిటిని వదలి నా కొరకుగా నీవు
ఈ ఇంట పాదమిడినావటంచు
గర్వమొకటి ఇంత గుండెలో తాకు !

అయితే, ఎక్కువకాలం జరుగక ముందే - నా భయాలన్నీ ఇట్టే మటు మాయం అయేట్లు చేశావు నీవు! క్రొత్త తీరి, ఇంట్లో అందరితోనూ కలివిడిగా మాట్లాడటం నేర్చుకొన్నావు. నాకు మరీ ఆశ్చర్యంగా అనిపించేది ఏమంటే - సమ వయస్కులతో ఎంత తృళ్లింతలాడుతూ కబుర్లు చెప్పేదానవో — పెద్దవాళ్ళ ఎదుట అంత అణకువగానూ మసలుకొంటూ ఉండేదానవు. ఇంతటి వివేక వంతమైన జీవన కళ నీకు ఆ వయస్సుకే ఎట్లా అలవడిందో - నాకు అప్పటికీ ఇప్పటికీ దురూహ్యమే సుమా!

ఈ మన గడ్డపైన పుట్టి పెరిగే ఆడపిల్లలు జన్మతః వెంట తెచ్చుకొనే హృదయ సంస్కారపు తీరుతెన్నులు ఇట్టిది కాబోలు - అనిపిస్తూ ఉండేది నాకు!

ఆడపిల్లలు తమ కన్నవారిని మమతా మందాకినిలో ఓలలాడిస్తూ పెరుగుతారు. మనులేత రెమ్మల మాటున ఒదిగిన మొగ్గ — అప్పుడే కళ్ళు తెరిచి — చూచి, పూచి, పరిమళించి — చెట్టునుండి విడివడి - ఏ ఎరుగని ప్రదేశాలకో వెళ్లి చేరినట్లు ఈ ఆడపిల్లలు పెళ్ళిళ్ళు కాగానే - ఎక్కడెక్కడికో వెళ్ళిపోతారు! క్రొత్తలో కొంత కొందల పడినా, బెంగతో ఉట్టిట్టయినా, క్రమంగా క్రొత్త బంధనాలకు అల్లుకుపోతారు!

" కోడలు కలివిడి కలిగిన పిల్ల! అందరితోనూ కలిసిపోయింది! .... " అని అందరూ అనుకొంటూ ఉంటే - నాకు ఒంటినిండా చలువపూతలు పూసినంత ఆనందంగా ఉండేది.

మొత్తానికి ఏదో ఆత్మీయమైన అనురాగ స్ఫూర్తి ఆవహించడం వల్ల నీ పసి మనస్సులోని బెంగ తీరిపోయింది! దానితోపాటు - నిన్ను గురించిన నా బెంగ కూడా దూరమైపోయింది!

బెదురు తీరినట్లున్న నీ కనులలోని తరళకాంతిని చూచినప్పుడు నా మనస్సు ఆనంద ప్రపూర్ణం అయింది.

పరమార్థ మేదియో సాధించి నటుల
పరమ హర్షము పొందినా నప్పుడు!

నా ఊపిరిలో ఊపిరైనది కాబోలు - ఆ తొలినాళ్ల మన దాంపత్య సౌరభం వీచి — తలచినంతనే చేరవచ్చి నన్ను చుట్టిముట్టి వివశుణ్ణి చేస్తున్నది.

అప్పటికింకా నేను నీకు క్రొత్త ! నీవు నాకూ అంతే ! బెరుకుగా. భయంగా, ప్రియంగా, ఒకరితో మరొకరం సంచరిస్తూ ఉండేవాళ్లం. నీ ఇష్టాలు ఏమిటో, అభిరుచులు ఏమిటో — తెలుసుకోవాలని తపన పడుతూ ఉండేవాడిని.

నీ మాట తీరులోనూ, నడకలోనూ, నవ్వులోనూ ఏవో అర్థాలు వెతుక్కొంటూ ఉండేవాడను. సున్నితమైన నీ మాట పొందికలో, పని తీరులో- ఒక సంస్కారరేఖ ఏదో భాసిస్తూ ఉండేది. అంత లేత వయస్సులోనే - నీ మనో వాక్కాయ కర్మలతో నీ జన్మ సంస్కారమంతా వ్యక్తమవుతూ ఉండేది.

ఇంతకు ముందు నేను పొరపడి అనుకొని ఉంటాను - నీవు నీ స్నేహితు లందరనూ నీ కన్నవారి ఊరిలోనే వదలి వచ్చినందున ఒంటరితనం అనుభవిస్తూ ఉండి ఉంటావని ! నీవు వెంట తెచ్చుకొన్న చందుగు పెట్టెను చూచినప్పుడు కాని, నీకు కావలసిన స్నేహ సంపదను భద్రంగా తోడు తెచ్చుకొన్న విషయం నాకు తెలిసిరాలేదు !

నీకు పట్టింటివారు ఇచ్చి పంపిన నగలూ నాణ్యాలూ, ఎట్లా ఎక్కడ దాచుకొన్నావో నాకు తెలియదు కాని - ఆ చందుగు పెట్టె నిండుకూ నీవు ప్రాణాధికంగా పదిలపరచుకొని తెచ్చుకొన్న అమూల్య సంపదను చూచి - నేను చకితుణ్ణే అయినాను

సాలంకృత అయిన సరస్వతీదేవి నీకు మనసిచ్చిన స్నేహితురాలని నాకు ఇదివరలో తెలియలేదు సుమా ! ప్రాచీన ఆధునిక కావ్య సంపదనూ, జగత్కల్యాణ కారకమైన అపూర్వమైన సాహిత్య రత్నరాశినీ నీ వెంట తెచ్చుకొన్న భాగ్యశాలినివి !

మన ఇద్దరకూ పరిచయాలు అవుతున్న ఆ తొలి రోజుల్లోనే, అడిగాను ఒకసారి -

" ఈ గ్రంథాలన్నీ నీవు చదువుకొన్నవేనా ? ఇంతటి సాహిత్యాభిరుచి నీకు ఎట్లా కలిగింది ? " - అని.

అడపిల్లలకు అమరం చెప్పించడమూ, సంస్కృతాంధ్ర సాహిత్యాలలో పరిచయం కలిగించడంకోసం కావ్యాలను చదివించడమూ మీ కుటుంబంలోని సంప్రదాయ సంస్కృతి అని - ఆ తరువాతనే తెలిసింది నాకు. చిన్నతనంనుంచే ఏర్పడిన సాహిత్య ప్రియత చేత - నిరంతర అధ్యయన ప్రవృత్తి నీకు అలవాటుగా మారినదన్న విషయం విని ఆనందమే కలిగింది నాకు.

చిత్రమేమిటంటే, మన ఇద్దరి ప్రవృత్తులూ ఇంతటి సారూప్యతను కలిగి ఉండటం ! చదువుకొనే రోజుల నుండీ — సంస్కృతాంధ్ర భాషల పట్ల అత్యంతమైన అభిమానం పెంచుకొన్నవాడను నేను. కావ్య రసాస్వాదనతో నిద్రాహారాలు కూడా మైమరుస్తూ ఉండేవాడను.

ఇద్దరి అభిరుచీ ఒక్కటే! ఇంతకంటే దాంపత్య జీవన సౌభాగ్యానికి హేతువు ఏముంటుంది కనుక ! మన ఇద్దరనూ ఇద్దరికి చేర్చిన సంధాన సౌభాగ్య ప్రదాత - సర్వ సృష్టికర్తకు వినమ్రుడనై నమస్కరించి నా కృతజ్ఞతలు తెలుపుకొన్నాను.

అప్పుడు నిన్ను గురించి ఇలా అనుకొన్నాను -

ఆమె నవనీత హృదయ; నా అంతరంగ
శాంతి దేవత, ఆశా పథాంతరాళ
పారిజాతమ్ము, ప్రేమ జీవన విభాత
కైశికీ గీతి; నా తపః కల్పవల్లి !

ఇక మీదట వాగర్థముల లాగు మనం సంచరించాలి. సాహిత్య సమారాధనలో మన జీవిత కావ్యాన్ని రస నిర్భరంగా రచించుకోవాలి - అవన్నీ అనాడే నిర్ణయించుకొన్నాము.

అప్పటి నుండీ, జంటగా సాగిన మన బ్రతుకు బాటలో అడుగడుగునా అక్షరార్చనలే !

వాగర్థముల రీతి పూవు తావుల భాతి
పరస్పరాలంబనతో మన రీతి !
నీవు నే నొక్కటే యన్న భ్రాంతి
నన్ను తనియించు మధుర స్ఫూర్తి !

## 11

నాకును నీకు నెన్ని జననమ్ముల సౌహృదమో
పరస్పరాలోకనమందె నా బ్రతుకులో
నొక తీయని స్వప్నమేదియో
పైకొనినట్టులయ్యె ....

నీ సన్నిధి నాకు పెన్నిధిగా తోచటానికి కారణం అప్పటి మన కోడె వయస్సు కోరికల ఆకర్షణలు మాత్రమే కావు ! అంతకు మించినదేదో - ఆత్మగతమైనదేదో - అపురూపమైన చిత్తవృత్తి అందుకు కారణం !

మెల్లగా మెల్లగా, మనోహరంగా, నీవు మెట్టిన ఇంటిలో పాదుకొన్నావు. తెల్లవారిన దగ్గర నుంచీ, ప్రొద్దుపోయేటంత వరకూ, వరుసగా జరుగ వలసిన గృహ సంబంధమైన పనులన్నిటిలోనూ పాలుపంచుకోవటం ప్రారంభించావు.

ఇక్కడ నీకు అంతా క్రొత్తగామా బెరుకుగానూ ఉన్నా, అత్తింటి అలవాట్లను నీవు ఎంత నిబ్బరంగా అలవడ జేసుకొన్నావు ! నీవు అలవాటు లేని చేతులతో కూరలు తరగబోవడం చూచి నా ప్రాణం విలవిలలాడి పోయేది. మనం ఏకాంతంలో ఉన్నప్పుడు - నీ అరచేతులను నా చేతులలో ఉంచుకొని తేరిపార చూచేవాడను. పొరపాటున కత్తి గీసుకొన్న గాయమేదైనా కనుపించి నపుడు నా మనస్సు ద్రవించిపోయేది.

ఆ తీరున నీరైన నన్ను చూచి —

" ఏమిటి మీ పిచ్చి ! " .... అనేదానవు అర్ధ్రంగా !

నీవు నా దానవు కావ, నిన్ను కంటికి రెప్ప వలె కాచుకోవలసిన బాధ్యత నాదన్న భావన మనసున నాటుకొన్న కారణాన - నీవు ఏపాటి శ్రమ పడటం కూడా సహించలేకపోయేవాడను !

ఒక అపురూప ఆత్మీయతా బంధమ్ము
నీ తోడి మైత్రి సిద్ధించినది మొదలుగా
అంతరంగ మది యంత అమృతమయము
నీ పైన ఈగ వాలునన్న అంతె భయము !

ఆ తొలి నాళ్ల అనుభవాల తియ్యదనాలు ఎన్నని !

అలసిపోయి – ఒకనాటి మధ్యాహ్నవేళ నీవు నిదురిస్తూ ఉంటివి. నేను పనులమీద బయటకు పోయి, ఆ ఎండవేళ ఇంటికి తిరిగి వస్తిని.

అప్పుడు నిదురిస్తున్న నీ సుప్రసన్న వదనాన్ని చూచాను. నీ నుదుటి పైన, కపోలముల పైన – చిరుచెమ్మటలు క్రమ్ముకొని ఉన్నవి. ప్రక్కనే ఉన్న వీవన అందిపుచ్చుకొని, మెల్లగా నీకు గాలి వీచడం ప్రారంభించాను.

ఎండలో నడచి వచ్చిన అప్పటి నా స్థితి ఏమాత్రమూ నా గమనానికి రాలేదు. త్రికరణ శుద్ధిగా చెపుతున్నాను – నాలుక పిడచకట్టుకు పోయి, శిరోభాగం వేడెక్కిపోయి, ఒళ్లంతా స్వేదంతో నిండిపోయి ఉన్నానప్పుడు! అది ఏది మనసుకు పట్టక – నీ అసౌకర్యమే ముఖ్యమైనదిగా తోచటం అదేమి చిత్రమో! అదేమి ఆరాధనా భావ మహిమమో!

సరిగ్గా అదే సమయంలో ఎవరో లోనికి తొంగి చూడటమూ, పెదవుల పైకి పొంగి వస్తున్న నవ్వు దొంతరలను అపుకొంటూ వెనకడుగు వేయటమూ జరిగిపోయింది! వారెవరో గాని, ఆ తరువాత కరువుతీరా నిన్ను పరిహాసమాడి కాని వదల లేదట!

నిద్రలో ఉన్న నీవు ఇదంతా ఎరుగవు – ఆ తొంగి చూచిన వారు తరువాత ఎప్పుడో నీతో పరియాచకాలు ఆడినదాకా!

" మా వాడిని అంత మాలిమి చేసుకొన్నావా అప్పుడే! పరిచర్యలు కూడా చేయించుకొంటున్నావా మగనితో! అప్పుడెవడో ధూర్త గోపాలుడు తాళ వృంత మొకటి చేత పట్టి భామినికి ' మందాలన లీలమై ' విసరినాడని విన్నాము కాని – ఇప్పుడా చిత్తరువును కన్నులార చూచే భాగ్యం కలిగించినారులే మీ ఇరువురూ! "

అని మేల మాడినారట ఆ చూచిన వారు.

ఆ తరువాత ఎప్పుడో నీవు సిగ్గుతో ఈ పైనమంతా చెప్పినప్పటి నీ చెక్కిళ్ల ఎర్రదనాలు – ఇప్పుడు కదలాడుతున్నవి నా మనో నేత్రం ముందు!

ప్రియతమా!

## 12

పరంపరగా నా అంతరంగాన తరుముకు వస్తున్నవి — ఆ మన కాపురపు తొలి దశ నాటి సుమనోజ్జ్వల సన్నివేశ స్ఫురణలు! మన ఇద్దరమూ కలిసి మళ్లీ జంటగా బ్రతుకు బాటకు మొదటి మెట్టును ఎక్కుతున్నట్లు చిత్రమైన భ్రాంతి!

నిన్ను మొదటిసారి పీటలపైన కూర్చొన్న సిగ్గుల పెళ్లికూతురిగా చూచాను. నా చిటికెన వ్రేలందుకొని, తడబడుతూ, అడుగడుగున సంకోచ పడుతూ — నా గృహంలోనికి నడచి వస్తున్న నవ వధువుగా చూచాను. అంతు లేని ముగ్ధత మూర్తీకట్టినట్లుండే బిత్తరిని నిన్ను — ఈ ఇంటి కోడలిని మురిపెంగా చూచాను.

ఈ అనుభవమంతా, ఒక అనిర్వచనీయమైన అనుభూతిమయ స్థితి! నీ దైన ఒక అయాచిత వీక్షణరేఖ — నవ్వీ నవ్వనట్లుండే పెదవి వొంపు — తగిలీ తగలనట్లుండే మృదుల హస్త స్పర్శ — అడుగడుగునా నా గుండెను ఝల్లుమనిపిస్తూ ఉండేవి — ఎంత దూరంలో ఉన్నా, ఊపిరి బిగపట్టి వింటూ ఉండేవాడిని — నీ కర కంకణ నిక్వాణాన్నీ, నీ కాలి అడుగుల సన్నని సవ్వడినీ!

అప్పట్లో నీవు సిగ్గుల మొగ్గవుగా — సంచరిస్తూ ఉండేదానవు. అత్తగారి చాటునో, అడపడుచుల మాటునో కాలం గడుపుతూ ఉండేదానవు ఇంకా క్రొత్త తీరని ఆ ప్రథమ పరిచయావస్థలో నన్ను తప్పుకొని తిరగాలని నీవు ఎంత ప్రయత్నించినా, నా దృష్టి ఎప్పుడూ నీ కోసమై గాలిస్తూ ఉండేది!

ఏదో పని ఉన్నట్లు నీవు ఉన్నచోటుకి వచ్చేవాడను నేను. నీతో ఏదో మాట్లాడవలెనని అలవి మాలిన కోరిక ఉండేది నాకు. క్రొత్త బెరుకుతో ముక్తసరిగా మాట్లాడేదానవు నీవు. అప్పటి మన స్థితి — మాటలతో చెప్పరాని ఒక రమ్య భావనామయ స్థితి.

కాలం అలా కమనీయంగా నడుస్తూ ఉండగా—
సహజీవనమున చనవు పెరిగినది కాన
క్రొత్తదనములు కొంత వెనుకపట్టి
రామ వైతివి స్నేహాభిరామవైతి వపుడు!

నింపాదిగా - నీవు నాకు చేరువైనావు. నా పైన నీవు నిలుపుకొన్న ప్రీతికి సాక్ష్యం ఏమిటో చెప్పనా ? నన్ను చూడగానే నీ కన్నులలో మెరిసే మెరుపుల తళుకులు !

నేను ఎప్పుడైనా పనుల మీద బయటకు వెళ్లేటప్పుడు నీ కనులు మౌనంగా ప్రశ్నించేవి — "తిరిగి రాక ఎప్పుడు ?" - అని ! నేను బయట నా పనులేవో చక్కబెట్టుకొంటున్నంత సేపూ — మన ఇద్దరకూ మాత్రమే తెలిసిన ఆ బాసాడుతున్న నీ కనులే నన్ను వెన్నాడుతున్నట్లు అనిపిస్తూ ఉండేది. నేను తిరిగి వచ్చి - ఇంటి గడప దాటుతూ ఉండగానే ప్రఫుల్లమై — నీ వదనం వెలుగులు చిమ్ముతుండేది. నీ సంభ్రమమే చెపుతూ ఉండేది నా రాక నీకు కలిగించిన హర్షాతిరేకాన్ని !

నీకు నా మీది నవనవోన్మేషరక్తి
జెప్పకయె చెప్పుచుండె నో స్నిగ్ధ హృదయ
ఆననమ్మున విద్యోతి మాన దీప్తి
తరళ నయనోచ్చల త్సముత్కంఠ దృష్టి !

నీవు ఇంత సొగసుగా, నిశ్శబ్దంగా, నిసర్గ సుందరంగా — నీ మనస్సున నింపుకొన్న అనురాగాన్ని అభివ్యక్తం చేసేదానవు. అట్టి సమయాలలో నా మనస్సు నిండా వెన్నెల సోనలు పరుచుకున్నట్లుండేవి. అప్పుడల్లా నాకు అనిపిస్తూ ఉండేది - ఈ జన్మకు ఈ సాఫల్యం చాలునని !

ఆయు వెంత దనుక మనకు అవని యందు
అంతవరకీ అనురాగ బాంధవ్య మిటులె
విరిసి వర్ధిల్ల వలెను గాకనుచు నేను
కాంక్షించు కొనుచు నా లోన నేనె -

ఒక అపూర్వమైన హృదయ రాసిక్యాన్ని అనుభవిస్తూ ఉండేవాడను.

ఆ రాసిక్యమే నా తనువు మనములను పండించి ఇప్పటికీ నాలో క్రొత్త ఊపిరు లూది జీవం పోస్తున్నది.

ప్రియతమా !

# 13

ఈ మసక వెన్నెల వేళ మన ఇంటి ముందున్న చిన్న పువ్వుల తోటలో తిన్నె పైన కూర్చున్నాను. నా చుట్టూ కొమ్మలూ, రెమ్మలూ, లతలూ, చిరుగాలికి ఊగుతూ, నా చెవులలో ఏదో ఊదుతున్నట్లయినది. పూచిన నందివర్ధనాలు తెల్లగా, స్వచ్ఛంగా, నీ పెదవుల పైన విరిసే మందహాసం వలె నాకు భ్రాంతిని కలిగిస్తున్నవి. ఈ పువ్వుల మొక్కలకూ నీకూ మధ్య ఎంతటి అవినాభావ అనుబంధం ఉండేదో నేను ఎరుగుదును !

నీవు ఈ ఇంటికి అధిపతివై వచ్చిన కొద్ది దినాలకే నీకు పువ్వుల పైన కల ప్రీతిని కనుగొన్నాను. వాకిలి ముందున్న నాలుగయిదు మొక్కలతోనూ అత్యంత సహజంగా స్నేహం కలుపుకుని — వాటికి పాదులు చేసి, నీళ్లు పోస్తూ తీగలు సవరిస్తూ ఉండేదానవు.

మొక్కలకూ తెలుసు - వాటి స్నేహితులు ఎవరో ! నీ స్నేహ స్పర్శకు అవి అపూర్వ స్పందనను పొందినట్లు మొగ్గలు తొడిగి పువ్వులు పూచేవి. మొగ్గ తొడిగిన మొక్కను అపురూపంగా చూచుకొనేదానవు. పుట్టిన పువ్వునల్లా చూచుకొని, పరామర్శించుకొని - నీవు సంబరపడుతున్నప్పుడు నాకు ఏమనిపించేదో తెలుసునా ? అప్పుడే పుట్టిన పసికందును చూచుకొని పరవశమవుతున్న పచ్చి బాలెంతవై నావేమోనని ! అటువంటి సమయాలలో —

పూలతో వియ్యాలు
పూలల్లో కయ్యాలు
మానల్లె నన్నుంచి
తానై పూవౌనేమో !

అన్న భావం తటాలున మెదిలి రవంత భయం కూడా వేసేది !

అయితే, అందరు ఆడవాళ్లకుమల్లే నీవు ఆ పువ్వులను కోసి జడలో తురుముకొనేదానవు కాదు ! ఎప్పుడైనా ఒకటో రెండో పువ్వులను కోసినా, వాటిని దేవతాపీఠం ముందు ఉంచేదానవు. ఇంత సున్నితంగా నిరాడంబరంగా, ఉండే నీ స్వభావవైశిష్ట్యమే నీ పైన నాకు గొప్ప గౌరవభావాన్ని కలుగచేసింది.

ఆ తరువాత నీవు చాలా క్రొత్త మొక్కలు తెప్పించి తోటలో నాటించి పెంచావు. ఇప్పుడు నా చుట్టూ చేరి తలలు ఊపుతూ – నన్ను పలుకరిస్తున్నట్లు ఉన్న ఈ తోటలోని మొక్కలన్నీ – నీవు ప్రేమతో ప్రోదిచేసుకొని పెంచుకొన్న కన్నబిడ్డలే! అందుకే – నాకు ఈ రెమ్మలూ పువ్వులూ అంటే – అంతటి ఆత్మానురక్తి!

అల పెరుంగక తావకాల వాలములకు
నెమ్మితో నిరవొంద నీరు వోసి
క్రమ వృద్ధి బొందు మార్గంబులారసి వచ్చి
పూట పూటకు జాల ప్రోది చేసి
ప్రేమాతిరేక ప్రియమండనమునకు
జిగురాకు గొన గోర జదుము వెరచి
పరిపాటి నల్లన ప్రసవోద్గమంబైన
సఖులు దానును మహోత్సవమొనర్చి –

తల్లియై లతల ప్రోచిన శకుంతల నీ రూపు ఎత్తినదా యేమి? .... అని నవ్వుతూ అనేవాడను – వనదేవతవలె పూలమొక్కల మధ్య మసలుతూ ఉండే నిన్ను చూచి!

ఆ తొలి నాళ్ళలో, తోటలో తొంగలించిన వసంతమే – మన జీవితాల లోకి తొంగి చూచింది. తోట ఊసులూ, పూల బాసలూ ఎరిగినదానవు నీవు! పువ్వువలె నీ మనస్సు మెత్తన. నీవు ఈ ఇంటికి వచ్చిన దగ్గర మంచి పూల తావులేవో చేరవచ్చి సుకుమారంగా నా చుట్టూ తిరుగాడుతున్న అనుభూతి కలుగుతూ ఉండేది.

చూచితి నిన్ని నాళ్ళుగ చూతమది
కొసరి పూచిన తీరు వాసంతి వేళలందు!
వత్సరమ్మున కొక్క వాసంతమను మాట
వాస్తవమ్మున కొక్క ఋతు ధర్మమే కాని
చిగురు కొన్నవి నాదు తెనువు మనములు కూడ
దిన దినము దివ్య వాసంత శోభగా
సుకుమార మూర్తివై నీవు మసలు నపుడు!

నీవు నా జీవితంలోనికి ప్రవేశించినప్పుడే – ఆమని మునివాకిట తొంగి చూచింది.

## ప్రియతమా ! 14

వరప్రసాదిని వలె వచ్చావు నీవు - నా జీవితంలోకి ! ఆ జంటతనం అడుగడుగునా గుండెను అలరింపచేస్తూ - ఏదో నిండుదనం వచ్చి చేరినట్లు అనిపించేది !

ఇయం గేహే లక్ష్మీరియ మమృత వర్తిర్నయ నయో
రసా వస్యా స్పర్శో వపుషి బహుళశ్చన్దన రసః !

భవభూతి దర్శించిన ఈ దివ్య భావనామయ స్థితి నాకు అనుభవం లోనికి వస్తుండేది నిన్ను చూస్తూ ఉన్నప్పుడు !

అసలు చిత్రమేమిటంటే - అప్పటికి నిన్ను నేను ఎరిగి కొద్ది కాలమే అయినా, యుగాలుగా మనం కలిసి జీవిస్తున్నామన్న భావన కలగటం ! తత్కారణంగా నీవు లేని జీవితం ఊహకు కూడా అందకపోవడం !

నా అవసరాలన్నీ తీర్చే భారం నీవు ఎప్పుడు పైన వేసుకొన్నావో తెలియదు కాని, చాలా పనులకు నీ పైన ఆధారపడటం నాకు అలవాటుగా మారింది ! నా సదుపాయాలన్నీ చూడటం నీ కర్తవ్యంగా భావించుకొన్నావు కాబోలు - నింపాదిగా, నిబ్బరంగా - నా లాలనా, పాలనా చూసుకొంటూ ఉండేదానవు

నా రుచులు, అభిరుచులు - నీవు ఎట్లా గ్రహించావో కాని, నాకు ప్రియమైన విధంగానే అన్నీ సమకూర్చి పెడుతూ ఉండేదానవు పనుల తొందరలో నేను పరాకు పడినా, నా వెనకనే ఉండి అన్నీ సర్దుబాటు చేస్తూ ఉండేదానవు. ఒక్క మాటలో చెప్పాలంటే - నీవు నా జీవన సహచరివైన కొద్ది రోజులకే- నాకు ఆప్తురాలివీ, అంతరంగిక కార్యదర్శివీ అయినావు.

ఈ మధ్య నేను తరచుగా వింటూ, చదువుతూ ఉన్నాను - కొన్ని ఆధునిక భావ ధోరణులను దంపతులైన స్త్రీ పురుషులు ఒకరి పైన ఒకరు ఆధారపడటం స్త్రీ స్వేచ్ఛకు భంగం కలిగిస్తుందని వీరు అంటారు. ఒకరి అవసరాలను మరొకరు గుర్తించి తదనుగుణంగా వర్తించటం బానిసత్వ లక్షణం అని కూడా అంటారు. ఇంటి పనులు చేయడం, భర్తనూ, పిల్లలనూ కనిపెట్టి చూచి, వారి అవసరాలకు ఆదుకోవడం - ఇదంతా స్త్రీని నాలుగు గోడల మధ్య ఇరికించి వేయడానికి పురుషులు ఏనాడో పన్నిన పన్నాగమేననీ అంటారు.

ఇదంతా నాకు అర్థం కాని విషయం ! నాకు తెలిసినదంతా, పతీపతు లిద్దరూ సమాన ప్రతిపత్తితో గృహస్థాశ్రమ ధర్మాన్ని నిర్వహించవలసిన వారని: పరస్పరానందమే పరమావధిగా జీవించవలసిన వారని ! ఒకరి కోసం మరొకరు శ్రమించటంలో – వారి మధ్య వర్థిల్లిన అనురాగ బంధమే కారణం కాని, అధికార అనధికార భావం కాదని ! ఇది నాకు అర్థమైన, ఇష్టమైన, నేను దివ్యంగా భావించే వ్యవస్థ తాలూకు లక్షణం !

నీవు అలా నా అవసరాలను తీర్చే భారం పైన వేసుకోవడం – అందు చేతనే నాకు ప్రీతికరమైనది. నాకు నేనై చేసుకోగలిగిన చిన్న చిన్న పనులకు కూడా నిన్ను రమ్మని పిలుస్తూఉండేవాడను. అలా పిలవడంలో – నిన్ను అధిక శ్రమకు గురిచేస్తున్నానన్న భావం చిత్రంగా నాకూ నీకూ కూడా కలిగేది కాదు !

నీ చేత తలకు నూనె రాయించుకోవడం, తల దువ్వించుకోవడం, నాకు ఇష్టమని నీకు తెలుసు ! అది నీవు ఇష్టంతో చేసే పని అని నాకు తెలుసు ! పరస్పర సాన్నిహిత్యంలోని సంతోషమూ, పరస్పరాలంబనతలోని సంతృప్తి – ఈ విధంగా మనకు అనుభవంలోనికి వస్తూ ఉండేది !

ఇంతటి అద్వైత స్థితిని పొందిన అదృష్టవంతుడను కనుకనే – మనో వాక్కాయ కర్మలలోనూ నిన్ను నిలుపుకోగలిగిన వాడనయినాను. ఇప్పుడు ఆ కారణంగానే – నీవు నా సన్నిధిలో లేవన్న వెలితిని పూరించుకో గలుగు తున్నాను. నీవు నా ఆంతరిక జగత్తులో సుస్థిరంగా నిలచి ఉన్నావు. తలచి నంత మాత్రాన నీవు స్నేహ సౌందర్యమూర్తివై నా కనులముందు సాక్షాత్కరిస్తావు !

గాఢ తాపార్తమైన నా గాత్రమునకు
సాంద్ర పరిమళ చందన చర్చ నీవ ;
ఆధి భరమున నిస్సారమైన హృదికి
చారు శీతల ఘన సుధా సారమీవ !

## 15

ఇంకా సూర్యోదయం కాక పూర్వమే - నీవు పెంచిన మన చిన్న తోట లోనికి వచ్చాను. చిరు వెలుతురులో ప్రకృతి స్తబ్ధంగానే ఉన్నది. రాత్రి కురిసిన మంచుకు తార్కాణంగా — ఆకుల మీద, మొగ్గల మీద - నీటి బొట్లు నిలిచి ఉన్నాయి. వాటిని చూస్తూ ఉంటే - మేఘ సందేశ శ్లోక మొకటి మనసులో నిలిచింది.

మామాకాశే ప్రణిహిత భుజం నిర్దయాశ్లేష హేతో
లబ్ధాయాస్తే కథ మపి మయా స్వప్న సందర్శనేషు
పశ్యన్తీ నాం న ఖలు బహుశో నస్థలీ దేవతానాం
ముక్తా స్థూలా స్తరు కిసలయే ష్వశ్రు లేశాః పతన్తి-

వియోగ దుఃఖం చేత అతనికి ఒక పట్టాన నిదుర పట్టనే పట్టదు ! బహు ప్రయత్నం మీద ఏ అర్ధరాత్రి వేళో కలత నిదుర పడుతుంది. ఆ నిదురలో కల ! కలలో ప్రియకాంత కనిపించింది. ఆమెను గాఢంగా హృదయానికి హత్తుకోవాలని అతడి కాంక్ష ! ముందుకు చాచిన చేతులకు అందినది శూన్యమే ! అప్పటి అతని దీనావస్థను చూచి వనదేవతలు సానుభూతిచేత దుఃఖాశ్రువులు రాల్చినారు. పెద్ద ముత్యములంత బాష్పములవి ! చెట్ల చిగుళ్ళపై రాలినవి. ఆ చిగురుటాకులపై నిలచిన అశ్రుమౌక్తికాలను చూచి మరింత విరహార్తిని అనుభవిస్తున్నాడు అతడు.

విరహమంటే నాకు కొంత భయం ! కొంత ఇష్టం ! విరహమెప్పుడూ సంవేదనతో కూడి ఉంటుంది. ఆ సంవేదనలో ఒకింత మాధుర్యమూ ఉండి ఉంటుంది !

ప్రియులైన వారితో ఎడబాటు వేదనామయంగా ఉంటుంది. ఎడబాటు తీరితే సంయోగం సిద్ధిస్తుంది. విరహానంతరం కలిగే సంయోగం మరింత ప్రీతికరంగా ఉంటుంది.

నీకు జ్ఞాపకం ఉండి ఉంటుంది - మన మధ్య సంభవించిన ఆ తొలి విరహ దశ గురించి ! మనం ఒకరికొకరమై కలిసి జీవితం ప్రారంభించిన క్రొత్తలో నీవు ఎందుకో మీ పుట్టినింటికి వెళ్ళవలసి వచ్చింది. మన యిష్టా యిష్టాలతో నిమిత్తం లేకనే ఆ ఎడబాటు తటస్థించింది.

నాకు ఏదో స్వప్న భంగమయినట్లు తోచింది ; ఊహకు అందని అప్రియ మేదో జరిగినట్లూ అనిపించింది ఇంతకు పూర్వమెపుడూ ఇటువంటి స్థితిని నేను ఎరిగినవాడను కాదు ; నా నుండి నన్నే ఎవరో వేరు చేసినారన్నంతగా మనసున మథన ప్రారంభమైనది.

నిన్ను చూచిన క్షణం నుంచీ - నీవూ నేనూ ఒక్కటే నన్న భావం, అతి సహజంగా నాటుకొన్న కారణాన - మన మధ్య ఎప్పుడైనా ఎడబాటు కలుగ వచ్చునన్న ఊహ కూడా నా దరికి చేరలేకపోయింది.

ఇంతకూ - అప్పుడు నీవు వెళ్ళింది నీ కన్నవారి ఇంటికి ; ఈ మన వియోగం కొద్ది రోజులకు మాత్రమే పరిమితమైనది. అయినా, అన్నీ ఎరిగిన నేను, ఏమీ ఎరుగని వాడనైనాను - ఆ కొన్ని దినాల వియోగ స్థితిలోనే ;

ఏమీ తోచని శూన్య స్థితిలో కొట్టుమిట్టాడుతూ - అనుక్షణమూ నీ స్మరణ తోనే గడుపుతూ ఉండినాను. నీవు ఇంత నిర్దయగా నన్ను వదలి ఎట్లా వెళ్ళ గలిగావు ; నేను నీ కోసం తపిస్తున్నంతగా నీకూ నా ఎడబాటు దుస్సహంగా ఉంది ఉంటుందా ; ఆలోచనలతో పిచ్చినైనాను ;

మానవమాత్రు లెవరికీ చెప్పుకోలేని అప్పటి నా స్థితి ; అసలు అంతటి విరహార్తిని అర్థి తీర్చగలిగిన ఆశ్రిత ప్రకృతికి కాక మరెవరికి ఉంటుంది కనుక ;

ప్రణయపు మలయానిలోర్మికా పటలి నూగు
సౌరభము, గానమూ ! నింపె శాంతి నిండు !
ప్రాణములకును ప్రాణమౌ ప్రాణకాంత
యూర్పు తరగల నోలాడి యున్నవారె !
ప్రియ నీరజ మధుర సౌరభము గ్రోలు
హిమకణమ ; తేనె చినుక, మీరింపు శాంతి !
ప్రాణములకును ప్రాణమౌ ప్రాణకాంత
యెడద శోధించి యశ్రులై పడిరె యిచట !

ప్రకృతి కరుణామయి. యుగయుగాల నుంచీ - విరహార్తులకూ కవులకూ - నోటి మాట చెప్పుకోవటానికి ఆలంబనగా నిలిచిన ప్రకృతి - నాకున్నూ శరణ్యమైనది - నీవు మీ పుట్టి నింటి నుండి మరలి వచ్చి నా మనస్సును చలువ చేసేటంత వరకూ ;

# 16

దిన దినమూ ప్రాగ్దిశలో ప్రొద్దు పొడుస్తూనే ఉంటుంది. ఆ ప్రాతః కాంతి జీవ కోటికి ప్రాణం పోస్తూనూ ఉంటుంది. అది ఏనాటి కానాడు నిత్య నూతనంగా భాసిస్తూనూ ఉంటుంది.

దిన దిన ప్రవర్ధమానంగా ఎదిగిన మన అనుభవ విశేషమూ అంతే ! కథలుగా నా మనోనేత్రం ముందు కదలుతున్న ఆ దివ్య స్ఫురణలన్నిటినీ ఇప్పుడు ఏర్చి కూర్చుకొంటున్నాను. లేఖా మాలికలు రచించి నా ప్రియతమపైన నీకు పంపుకొంటున్నాను.

ఇంత ప్రాణప్రదంగా వ్రాసుకొంటున్న ఈ ఉత్తరాలను నీవు ఎక్కడ ఉన్నావని పంపను ! వీటిని భద్రంగా నీకు చేర్చే కపోతాల కోసం ఎక్కడని వెతకను ! — అన్న విచికిత్స లేదు నాకు ! నీవు ఎక్కడో నాకు అందనంత దూరాన ఉన్నావని అనుకోను — సదా నా హృదయస్థితవై ఉన్నావు కనుక !

మరి వియోగమే లేని మన మధ్య ఈ ఉత్తరాల పూల వంతెన లేమిటి ! ఇది విప్పి చెప్పరాని చిత్రాతి చిత్రమైన మానసిక స్థితి ! సంయోగంలో వియోగాన్నీ, వియోగంలో సంయోగాన్నీ అనుభవించకలిగిన వారికి మాత్రమే అర్థమయే స్థితి !

ఒక్కొక్కప్పుడు నీ సన్నిధిలోనూ విరహార్తుడివలె ఉండేవాడను. దానిని సమ్ముఖ విరహం అనవచ్చునేమో ! ఇట్టి స్థితిలో మన మధ్య సంభాషణలు కూడా సాగేది కాదు ! మాటలకు అందని తీవ్ర భావ సంచలనమేదో నన్ను ఊపివేసేది ! అదుగో — అటువంటి సమయాలలో — నా మనోగత భావాలను కొన్నిటిని లిఖిత రూపంలో నీకు అందించేవాడను !

నీవు ఎర్రవారిన ముఖంతో — అందుకొని ఏకాంతంలో చదువుకొనేదానవు ! ఆర్ద్రంగా, పరమ కరుణార్ద్రంగా — చూచిన నీ చూపులోనే — నేను ఆశించిన ప్రత్యుత్తరాలను చదువుకొనేవాడను.

" వినిశ్చేతుం శక్యో న సుఖమితి వా దుఃఖమితి వా "

ఇది సుఖమనీ, ఇది దుఃఖమనీ నిర్ణయించటానికి వీలుకానట్టి ఇట్టి స్థితిని — భవభూతి ఊహించాడు. సీతా సన్నిధానంలోనే రాముడు ఇట్టి భావ స్థితిని పొందటాన్ని అపూర్వంగా చిత్రించాడు.

నీ సన్నిధిలో ఉండి కూడా, ఏవో గాఢమైన ప్రకంపనలను అనుభవిస్తున్నప్పుడు – నాలో నేను అనుకొనేవాడను – ఇది ఏదో లౌకిక సంబంధమైన విరహ భావం కాదని ; ఇది జీవాత్మ పరమాత్మల మధ్య మాత్రమే సంభవం కాగలిగిన సంయోగ మయ సంవేదన – అనిపించేది ; ఇట్టి అలౌకిక స్ఫురణ కలిగినప్పుడల్లా – భవద్విరహం భగవద్విరహంగానూ తోచేది ; తత్కారణంగానే –

ఈశ్వరార్చన వేళ స్వామి
కడగంటి చూపులో కనుగొంటి నిన్ను
నా పరమ సౌభాగ్య స్వామిని గను!

అప్పుడంతా నీ సన్నిధిలో ఉండగానే – ఏదో అంతర్గత వేదనను పొందేవాడను. ఇప్పుడు – నీవు నా సన్నిధిలో లేకపోయినా, సంయోగ స్థితిని పొందుతున్నాను. తదనుభూతి మాధుర్యం చేత – స్మృతి సౌరభాలెన్నో నన్ను కమ్మివేస్తున్నవి. వాటిని ఈ ఉత్తరాలుగా అక్షర మాలికలల్లి నీకు అంపుకొంటున్నాను.

అప్పట్లో – నీకు ఏదో చెప్పాలని తపనపడి, మాటలలో చెప్పలేక – ఉత్తరాలను వ్రాసి నీకు అందించేవాడను. నా ఆత్మను రంగరించుకొన్న ఆ ఉత్తరాలను చదివి – మళ్లీ చదివి – నన్ను ఒక్కసారి చల్లగా చూచేదానవు.

అప్పుడూ, ఇప్పుడూ నేను వ్రాసే ఉత్తరాలకు తపాలా ముద్రలు అక్కరలేదు – వీటికి ఎప్పుడో హృదయ ముద్రలు పడినవి కనుక ; వీటిని పోస్టు చేయవలసిన అవసరం లేదని కూడా తెలుసును నాకు – ఇవి రెక్కలు కట్టుకొని ఎగిరి గాలిలో తేలుతూ – నీవు ఉన్న చిరునామాకు చేరి – నీ ఒడిలో వాలి తీరుతవని ఎరుగుదును కనుక ;

లలిత శృంగార మధుమాస లక్ష్మివైన
నీ విలాసైక పాద చిహ్నితము సుమ్ము
నా యెడద పూవు తోట యనంతకోటి
కౌసుమ పరిమళముల శ్లాఘ్యత వహించు !

## 17

అమ్మా ! మన్ను దినంగ నే శిశువునో యాకొంటినో వెఱ్ఱినో
నమ్మం జూడకు వీరి మాటలు మదిన్ నన్నీవు కొట్టంగ వీ
రిమ్మార్గమ్ము ఘటించి చెప్పెదరు కాదేనిన్ మదీయాస్య గం
ధమ్మాఘ్రాణము సేసి నా వచనముల్ దప్పైన దండింపవే !

సుందరంగా, సుమధురంగా, సుస్పష్టంగా – లోపల నుంచి వినవస్తున్న స్వరం వీనులకు విందులు చేస్తుండగా – వీధి గుమ్మంలోనే నిలిచిపోయాను.

వచ్చీరాని ఏడుపును నటిస్తూ తల్లి ముందు చిందులు వేసే బుడుతడిని, ఈహానా గోపాలుడిని – అద్భుతంగా కిమ్మలకు కట్టించిన పద్యం పోతన్నగారి సృష్టి. శ్రవణ సుభగంగా, అర్థయుక్తంగా – పద్యం చదువుతున్న వారికోసం లోపలకు తొంగిచూచాను.

కనుల ముందు మనసును మంజులం చేసే దృశ్యం అప్పటికి రెండు రోజులనుంచీ నలతగా ఉన్న అమ్మ పడుకుని వింటున్నది. ప్రక్కనే కనులు మూసుకొని వింటున్న నాయనగారు ! ఇటు వైపున భాగవతాన్ని చదువుతూ నీవు ! తెలుగు పద్యాన్ని ఎంత సొగసుగా చదవవచ్చునో బాగా ఎరిగిన నీవు !

అప్పుడే లోపలకు తొంగి చూచిన నన్ను నీవు చూడకపోవడం నా అదృష్టం ! లేకపోతే –

కలయో వైష్ణవమాయయో యితర సంకల్పార్థమో సత్యమో
తలపన్నేరక యున్నదాననొ యశోదాదేవిగానో పర
స్థలమో బాలకుడెంత యీతని ముఖస్థంబై యజాండంబు ప్ర
జ్వలమై యుండుట కేమి హేతువొ మహాశ్చర్యంబు చింతింపగన్ !

అన్న ఆ తల్లి సంభ్రమాన్ని నీ నోట వినగలిగి ఉండేవాడను కాదు! నన్ను చూచిన మరుక్షణం నీవు సిగ్గున దిగ్గున లేచావు ! అత్తమామల వద్ద లేని సిగ్గూ సంకోచమూ నా దగ్గర ఎందుకో అప్పట్లో అర్థమయ్యేది కాదు గానీ – నీవు అలా సిగ్గును అభినయిస్తూ ఉండటం నాకు ఒక మనోహరమైన అనుభూతిని కలిగిస్తూ ఉండేది !

అలా - నీవు మీ అత్తగారికి కూరిమి కూర్చిన కోడలివే అయినావు - ఆమెకు అనుకూలంగా వర్తిస్తూ - భాగవతాన్ని భగవత్కథలనూ చదివి వినిపిస్తూ.

అమ్మకు కూడా నీవంటే చాలా ఇష్టంగా ఉండేది. నీకు స్వయంగా తాను తల దువ్వి జడ అల్లుతూ - ఎంతో గారాబంగా చూచుకొనేది. ఆ దృశ్యాన్ని చూచినప్పుడు నాకు ఉత్తర రామచరితంలోని ఈ శ్లోకం జ్ఞాపకం వచ్చేది.

ప్రతను విరళైః ప్రాంతోన్మీలన్మనోహర కుంతలమ్
దశన ముకుళై ర్ముగ్ధాలోకం శిశుర్దధతీ ముఖమ్
లలిత లలితై ర్జ్యోత్స్నా ప్రాయై రకృత్రిమ విభ్రమై
రకృత మధురై రమ్బానాం మే కుతూహల మంగకైః

కోమలమైన తనూవిలాసం చేతనూ, అంతులేని ముగ్ధత్వం చేతనూ - క్రొత్త కోడలు - పసిదైన సీత - అత్తగారలను అలరింపచేస్తూ ఉండేదట! వారికి ఆ కోడలిని చూచుకొన్నప్పుడు చెప్పరాని సంతోషం కలుగుతూ ఉండేదట!

ఆ త్రింటికి వస్తూ వస్తూనే, నీవు ఇంతటి చిక్కనైన బాంధవ్యాన్ని అల్లుకొన్నావు. అత్తా కోడళ్ళ మధ్య అంతటి సరాగం సాధ్యమా అని అందరూ విస్తుపోయేటట్లుగా ఉండేది మీ ఇద్దరి మధ్యా మైత్రి!

చిద్విలాసముగ తోట చివురింపగా చూచి
రెమ్మ కొక సుమముగా రంగు మీరగ చూచి
పరిమళము లెగబోయు పూల ముగ్ధల చూచి
నిలిచి పోవుదు మున్ను నిశ్చలమూర్తి నగుచు!
కూర్మి కూర్చిన మీ మిన్న కపురను చూచి
పులకరించిన మనసు పరవశత్వము నంది
అత్త ఒడి బిడ్డ వెట్టులైతి వని తలచి
సందడించును మనసు సుమధుర మగును!

అమ్మకు చేరువగా, సహాయకారిగా నీవు - నీకు తల్లిగా, అప్తురాలుగా అమ్మ - ఈ మీ ఇద్దరి సౌందర్యమయమైన స్నేహదీప్తి - ఇంటి నిండుగా వెన్నెలలు అరబోసినట్లుగా ఉండేది! - అప్పటి నా మనస్సు -

అమిత తృష్ణాలసం బంతకంత భూమి
మీది నుండి స్వర్గానికే మెట్లు కట్టు!

## ప్రియతమా !　　18

క్రూరమైన వికటాట్టహాసాన్ని ఉన్నట్లుండి ఏదో సౌజన్యరేఖ విరిసి అదుపుచేసినట్లు అయింది ! ఇప్పటివరకూ - చండ ప్రచండమైన అగ్నికిరణం వంటి సూర్య తేజం ప్రపంచాన్ని మండించివేస్తున్నది. ఇంతలో - కరుణార్ద్రంగా కదలి వచ్చిన మేఘమాలిక ఆ దుర్నిరీక్ష్య తేజాన్ని క్రమ్ముకొని చలువ చేసింది. ప్రాణం తేరుకొన్నట్లై, నా గది కిటికీ తెరిచి ఆకాశం పైపుకు చూచాను.

ఆషాఢస్య ప్రథమ దివసే మేఘ మాశ్లిష్ట సానుం
వప్రక్రీడా పరిణత గజప్రేక్షణీయం దదర్శ !

అప్రయత్నంగా నా నోట పలికిన కాళిదాస కవిత -

విరహార్తుడైన యక్షునికి మేఘసందర్శనం అపూర్వమైన స్పందనను కలుగచేసింది. వియోగ తాపంతో వేగిపోతున్న వాడికి మేఘుడు పరమాప్తుడి వలె తోచినాడు. దూరాన ఉన్న తన ప్రియతమకు తన సందేశాన్ని చేరవేయ గలిగిన స్నేహితుడిగానూ దర్శనమిచ్చినాడు !

ఎన్ని మారులు చూచినా మేఘాన్ని - నాకు ఎందుకనో తనివితీరినట్లు ఉండదు ! ప్రచండ గ్రీష్మ తాపాన్ని ఉపశమింపచేసే మేఘమంటే ఎవరికి ఇష్టం ఉండదు ! ఆకాశవీధిలో నీల జలదం తారటాడితే - పుడమితల్లికి పులకరింత ! ఆ దృశ్యావలోకనంతో మనస్సుకు తొలకరింత !

నీకు జ్ఞాపకం ఉండి ఉంటుంది - తొలకరి రోజులు వచ్చినప్పుడల్లా నేను త్రుళ్లింతలాడేవాడను ! కర్షకుడను కనుక, బీటలు వడ్డ భూమితల్లి దాహం తీర్చటానికి దయతో వచ్చిన మబ్బు తునకలను చూచి నా దాహం తీరినట్లే సంతృప్తి పొందేవాడను. సాహిత్య రస పిపాసువును కూడా కనుక - సాహిత్య వినువీధుల్లో విహరించే మేఘమాలికను సందర్శిస్తూ - తన్మయతను పొందే వాడను.

కారు మేఘమా రావే రావే
పువ్వుల మబ్బా దిగవే దిగవే !
పింజమేఘమా ! ధూళి మేఘమా !
చెమటను ఊడ్చి దిమ్మరింపవే !
కొంచెము నీళ్లను విడిచిపెట్టవే !

చిన్నప్పుడు పాడుకొన్న ఈ పల్లె పదం – తొలకరి మబ్బును చూచిన ప్రతిసారీ – నా నోట పలుకుతూ ఉండేది. అలా పాడుతున్నప్పుడు మరీ చిన్న పిల్లవాడినయినట్లున్న నన్ను నవ్వుతూ చూచేదానవు। కొంతకాలానికి ఒకింత జాణతనం అరువు తెచ్చుకొని – నీవూ చిరుపాటలేవో కట్టి నా పాటకు ప్రతిగా పాడుతూ ఉండేదానవు।

కృష్ణ మేఘమా రావే రావే
జలద మేఘమా జల జల రావే
పడమటి మబ్బా పరుగున రావే
పలుచని చినుకులు చిలకరించవే !

నెత్తి పైన మబ్బు తునకను చూచినప్పుడల్లా, ఇన్నిన్ని అందమైన జ్ఞాపకాలు। జన్మ జన్మల వియోగార్తులు పాడుకొన్న స్మరణ గీతికలు।

తొలకరి ఒక మబ్బు తొంగి చూచింది
మబ్బులో ఒక మెరుపు మెరిసిపోయింది
పెరటిలో ఒక జల్లు కురిసి వెలిసింది
జల్లులో నా మనసు జారిపోయింది !
ఏరువాక నాటి కేడాది దాటింది
ఎదురు చూచిన గుండె చెదిరిపోయింది !

ఏడాదిపాటు గుండె చిక్కబట్టుకుని ఎదురు చూచిన మనసు తొలకరి మబ్బును చూచి ఘోషిస్తున్నది. ఆ ఘోషను చూచి, ద్రవించి ద్రవించి నీరైనది మబ్బు తునక। జల్లు జల్లుగా కురిసి కరిగిపోయింది।

అందుకే – అంతటి ఆర్ద్రమూర్తిని మేఘుడిని తనకు దూతవు కమ్మని అర్థించుకొన్నాడు ఆ విరహార్తుడు –

"సంతప్తానాం త్వమసి శరణమ్"

అని స్నేహమూర్తిగానూ సంభావించుకొన్నాడు। నా భావ వాహినికి [illegible]ం – నీల జలదం – చిన్నగా, ముత్యాల జల్లుగా, భువికి దిగుతున్నది।

# 19

ఈ రాత్రివేళ నిద్ర పట్టక బయటకు వచ్చి మొక్కల మధ్య తిన్నె మీద కూర్చున్నాను. నవమినాటి వెన్నెల – సజ్జనుని సౌజన్యంలాగు భూమి మీదకు కరుణను వెలార్చిపోస్తున్నది !

కారుణ్య మనేది ఎంత గొప్ప మానవీయమైన గుణం ! మనం ఇద్దరమూ కలసి సహజీవనం ప్రారంభించిననాటి నుంచీ నీవు కారుణ్యమూర్తిగానే దర్శన మిస్తూ వచ్చావు. నీ మాటలోనూ చేతలోనూ కరుణ ఉట్టిపడుతూ ఉండేది. నీ కన్నులలో తొణికిసలాడే కారుణ్యరేఖ నన్ను నిలువునా తాకి పులకితుణ్ణి చేస్తుండేది !

ఏ కారణం చేతనయినా ఇతరులు కష్టపడుతూ ఉంటే స్వయంగా ఆ బాధను నీవే అనుభవిస్తున్నట్లు కట కట పడేదానవు. వారికి చేతనైన సహాయం చేయటం నీ ధర్మంగా భావించేదానవు ! ఎన్ని మారులో నిన్ను కరుణార్ద్రమూర్తిగా, ఆపద్బాంధవిగా – చూచాను ! అది ఒక అద్భుతమైన అనుభవం ! నీ దాక్షిణ్యాన్ని చూచినప్పుడంతా –

నాకు దోచుచు నుండును నకుమ నకుమ
నాలో కల్లోలనీ సుఖ స్నాతుడనయి
నందనారామ వీధుల యాడు నేను
అమృత కలశమ్ముతో నడయాడునట్లు !

నడుము వంగిపోయిన ముదుసలి యొకర్తె, కర్రపోటు వేసుకొంటూ – ప్రతి రోజూ ఇంటింటికీ తిరిగి అన్నం అడుక్కోవటం నేను చాలా రోజుల నుంచీ ఎరుగుదును. నరాల బలహీనత చేతనో యేమో – ఆ బడుగు దేహం మీద నిలువలేనన్నట్లు తల ఎప్పుడూ ఊగుతుండేది. ఆ యమ్మ సత్తు గిన్నె ఒకటి చేత పట్టుకొని వాకిట్లోకి వచ్చి వాణికే గొంతుతో పిలవడం మామూలు విషయమైపోయింది. ఈ ముసలి అవ్వ రోజూ అడుక్కోవటానికి రావటం – రోజూ ప్రొద్దున్నే తూర్పు దిక్కున సూర్యుడు పొడిచినంత సహజంగా అనిపిస్తూ ఉండేది.

అవ్వ వచ్చి వీధి వాకిలి ముందు కూర్చునేది. ఇంట్లో అన్నం మిగిలి నప్పుడు ఒక ముద్ద వేసేవాళ్లు. లేనప్పుడు పొమ్మనేవాళ్ళు ఒక్కొక్కసారి ఎంతకూ కదలకపోతే – ఆమెను కసురుకొనేవాళ్ళు

అవ్వ ఒక పట్టాన కదిలేది కాదు. ఎవరు ఎంత కోప్పడినా, కసురుకొన్నా - అవేమీ తనను కాదన్నట్లు నిర్లిప్తంగా కూర్చునేది. ఆమెకు బాగా తెలుసు — మరొక వాకిలి ముందుకు వెళ్లినా - ఈ కసుర్లు తన మీద రాలక తప్పనివేనని; ఇవన్నీ పట్టించుకుంటూ పోతే - తనకు ఆ పూటకు కడుపు నిండటానికి పట్టెడు మెతుకులు దొరకవని ;

ఈ సమాచారమంతా నీవు ఎప్పుడు సేకరించావో కాని, ఒకనాడు నీవు కరిగే కళ్లతో ఆ అవ్వను గురించి చెప్పావు. కొడుకూ, కోడలూ మనుమలూ ఉన్నా, ఆ ముసలికి ఇంట్లో ఇంత అన్నం కూడా పెట్టరట. ఓపిక ఉన్నన్ని నాళ్లూ ఆ పనీ ఈ పనీ చేసి కడుపు నింపుకొనేది. ఇప్పుడిక ఇల్లిల్లూ తిరిగి అడుక్కొని తింటున్నది. ఇంత ముసలితనం మీదపడి, రేపోమాపో అంటున్న అవ్వను గురించి శ్రద్ధతో అన్ని వివరాలూ తెలుసుకొన్నావు. జాలితో కరిగి పోయావు

అప్పటి నుంచీ రోజూ అన్నం వండబోయేటప్పుడు విధిగా రెండు గుప్పెళ్ళ బియ్యం అదనంగా వేసేదానవు. అవ్వ వాకిటి ముందుకు వచ్చి కూర్చోగానే — ఎంత పనిలో ఉన్నా, ఇంత అన్నమూ కూరా తెచ్చి సత్తుగిన్నెలో పెట్టి, నీళ్ళు అందించి చల్లగా పలుకరించేదానివి.

గడప వారగా కూర్చుని ఆ బడుగు అవ్వ అమృతం తింటున్నట్లు ఆ అన్నపు ముద్దలు ఆబగా తినేది. నీ ఆప్యాయతతో కూడిన పలకరింపులకు ఆ ముడుతలు పడ్డ ముఖంలో ఒక కాంతిరేఖ మెరిసిపడేది. ఆ తరువాత ఎప్పుడూ నేను చూచిన జ్ఞాపకం లేదు — ఆ అవ్వ ఇంకొంటికి తిరిగి అడుక్కోవటం ;

ఇదీ మొట్టమొదటిసారి - నీలో పొంగి పొరలే కారుణ్య ఝరిని నేను గుర్తించిన రీతి ; అప్పటి నుంచీ ఎన్నెన్ని మారులు ఎన్ని విధాలుగా నీ దయాంత రంగాన్ని దర్శించి కృతార్థుడనయినానో ;

భగవంతుడు కరుణామయుడు
సృష్టి కరుణామయం
జీవితం కరుణామయం
ప్రపంచం కరుణలో పుట్టి కరుణలో పెరిగి
కరుణలోనే విలీనమౌతుంది

అన్న సుకవి వాక్యాలు ప్రత్యక్షర సత్యాలుగా తోచేవి - నీలోని కారుణ్యభావాన్ని అనుభవించినప్పుడల్లా ;

## 20

ప్రియతమా !

ఈ సంధ్యవేళ ఇంటిలోపల నా గదిలో కూర్చొనిఉండాలని అనిపించలేదు. ఊరి చివరగా ఉన్న మన చేలవైపుగా నడిచాను కంటికి కనిపించినంతమేరా ఆకుపచ్చని రంగు పరుచుకుని దృశ్యనీయంగా ఉన్నది. తెరలు తెరలుగా పైర గాలి వీచి ఈపచ్ఛదనాలకు ఊపిరి పోసి చైతన్య భరితం చేస్తున్నది. సాంధ్య సూర్యుని లేత రంగులు పంటచేల పైకి ప్రాకి వస్తున్న తీరు నన్ను ఎప్పుడూ ముగ్ధుణ్ణి చేస్తూనే ఉంటుంది.

ఆ కనుపట్టు క్షేత్రమున కావలి గట్టున పంటచేను నా
జూకుగ గాలి సోకి మన చూపులకుం బ్రణమిల్లి నంతనే
రేకుల కప్పులో బొటమరించిన వెన్ను పసందు చూడరా !
నీ కవితామృతంబునకు నిగ్గట గోచరమౌను పుణ్యుడా !

అంవోకగా వీచిన నాజూకు గాలికి చేను రవంత మన వైపుకు వొరిగింది. రేకుల కప్పులో పొటమరించిన పెన్ను కూడా తల ఊపింది. ఆ సొగసును చూడమని కవిని ఉద్బోధిస్తున్నాడు - అచ్చమైన తెలుగునాటి కర్షకకవి.

ప్రకృతిలోని అందచందాలను అస్వాదించడం నీకు ప్రియంగా ఉండేది ! గడ్డిపూవునైనా గాఢతమితో అరాధించేదానవు ! ఎప్పుడైనా ఆకాశంలో ఒక మబ్బు తెర - తోచీ తోచనట్లు తారటాడినప్పుడు నీలో నీవు నవ్వుకొనేదానవు.

" ఎందుకా నవ్వు దొంతరలు ? " .... అని అడిగాను నిన్ను.

" ఆ పిట్టంత పసి మబ్బు అటూ ఇటూ ఊగులాడుతూ ఉంటే - వచ్చీ రాని అడుగులతో — ఏడాది దాటిన బాలకృష్ణుడు చిడిబుడి అడుగులు వేస్తున్నట్లు భ్రమ కలిగింది ! .... " అన్నావు నవ్వుతూనే !

నీ వింత భావుకురాలవని నాకు అప్పటివరకూ తెలియదు ! నీ ఊహలోనే జారి వచ్చినదొక పసందయిన కవితా స్ఫురణ !

బహుళ జలద చ్ఛాయా చోరం విలాస భరాల సం
మద శిఖి శిఖా లీలోత్తంసం మనోజ్ఞ ముఖాంబుజమ్ !

అంటూ తన్మయీభావంతో కనులు మూసుకొన్నావు ! నీవు ఆ క్షణంలో అనుభవించిన వాత్సల్య భక్తి రస సిద్ధి — నన్నూ తాకినట్లయింది.

వదనే నవనీత గన్ధ వాహం, వచనే తస్కర చాతురీ ధురీణమ్
నయనే కుహనాశ్రు మాశ్రితోయేధా, శ్చరణే కోమల తాణ్డవమ్
కుమారమ్ !

అన్నాను - లీలాశుకుల దివ్య భావనామయ స్థితికి అంజలి పడుతూ !

శ్రీశైలం వెళ్ళే దారిలో అడవులగుండా మన ప్రయాణం. ఎటు చూచినా, దట్టంగా ఎదిగిన తాడెత్తు చెట్లు - తీగలతో ఆకులతో - అల్లుకొన్న పొదలు - ఎప్పుడూ ఏవో సమస్యలతో చికాకు పడుతూ ఉండే ఈ మనుష్య ప్రపంచంతో మాకేమీ సంబంధం లేనట్లు నిటారుగా, గర్వంగా - నిలుచుని ఉన్న చెట్లు !

నీవు అప్రయత్నంగా పలికిన కృష్ణశాస్త్రి పదం - బస్సు రొదతో కలిసి సన్నగా వినవచ్చింది.

ఆకులో ఆకునై పూవులో పూవునై
కొమ్మలో కొమ్మనై నును లేత రెమ్మనై
ఈ యడవి దాగిపోనా !
ఎట్లైన నిచటనే యాగిపోనా !

తానే ప్రకృతిలో ఒక భాగమై పోవాలని అనుకుంటున్నాడు కృష్ణశాస్త్రి - ఓపలేని ప్రకృతి ఉపాసకుడు కనుక. ఆయనకేమి !

తెలిమబ్బు తెరచాటు తెలిచందమామ
జతగూడి దోబూచి సరసాల నాడి
దిగి రాను దిగి రాను దివి నుండి భువికి !

అనగలిగిన విశాల విహాయస విహారి ! ఆకులో ఆకుగా నైనా, పూవులో పూవుగా నయినా, మారిపోగలడు ! ' స్వేచ్ఛాకుమారుడు. ' గగన పథ విహార విహంగమ పతి ' - కదా అతడు !

మరి - నా ప్రాణంలోని ప్రాణమైన నీవు - ఆకువై, పూవువై, కొమ్మవై, రెమ్మవై - ఇక్కడే నిలిచిపోతే - నేను జీవించడం ఎలా ?

ఆకలా దాహమా చింతలా వంతలా
ఈ కరణి వెఱ్ఱినై యేకతమ తిరుగాడ
ఈ యడవి దాగి పోనా !
నీ తోడుగ నే నిలిచిపోనా !

అన్నాను నీ చేతిని నా చేతులతో పొదువుకొంటూ - అందుకే - ఎరుగుదును నేను - నా చుట్టూ పరుచుకున్న ప్రకృతి సౌందర్యరేఖలలో నీవు దాగివుండి ఈ నా మాటలన్నీ వింటూనే ఉన్నావని !

# 21

మరల నిదేల రామాయణంబన్న చో
నీ ప్రపంచకమెల్ల నెల్ల వేళ
దినుచున్న యన్నమే తినుచున్నదిన్నాళ్లు -

అవును - పుట్టిన దగ్గరనుంచీ గిట్టేటంతవరకూ, ప్రాణికి అన్నంతో అవసరం కానిదెప్పుడు ! రోజూ తినే అన్నమే అయినా - విసుగు పుట్టదు సరికదా - రవ్వంత వేళ తప్పినా ఓర్వలేని పరిస్థితి ఏర్పడుతుంది.

శ్రీనాధుడికి మల్లే నే నేనూ మొదటినుంచీ భోజన ప్రియుడను. క్రొత్త వంటకాలు, రుచులు - అంటే ఇష్టం. ఆ విషయం నీవు ఈ ఇంటికి వచ్చిన కొద్ది రోజులకే గ్రహించావు.

నవ వధువుగా వచ్చిన నీవు పాలు కాచనేరని బాలవు. నేయి కాచనేరని నెలతవు ! అయినా, నెమ్మదిగా, వంట చేయటం నేర్చుకొన్నావు. అమ్మ వంట చేస్తుండగా చూచి - ఆ మెళకువలన్నీ ఆకళింపు చేసుకొంటూ ఉండేదానవు. ఆ తొలినాళ్లలో - నడుము చుట్టూ చీర కొంగును చుట్టి, ఓట్టి వంటకత్తెలాగు అటూ ఇటూ వంటఇంటిలో మసలుతూ ఉండే నిన్ను చూస్తుంటే - నాకు నవ్వు వచ్చేది ! బహుశః ఇటువంటి రమణీయమైన దృశ్యాన్నే చూచి, స్పందించి - హాలుడు అని ఉంటాడు ఇలా !

వంట యింటి పనుల నంటిన మసి చేయి
సోకి యుండ జందురి సుందరముగ
నింపు గొలుపుచున్న యిల్లాలి మోమును
నగుచు నున్నవాడు మగడు చూచి !

రుచ్యమైన భోజ్యాలను వండివార్చటంలో - అచిరకాలంలోనే నీవు ఆరితేరావు ! నాకు ఇష్టమైన వంటకాలు చేయడం నీకు చేతనయింది. ఇదివరకు నేను తిని ఎరుగని క్రొత్త వంటకాలను కూడా నేర్చుకొని చేస్తూ ఉండేదానవు. నేను ఆ రుచులను మెచ్చుకొంటూ తింటూ ఉండేటప్పుడు - నీ కన్నులలో తరళించే మెరుపులను చూడాలని మరీ మరీ అనిపిస్తూ ఉండేది !

ఒకనాడు - ఇంట ఎవరూ లేనప్పుడు - నీవు స్వయంగా వంట చేసి వడ్డించావు. తృప్తిగా తిని లేచిన తరువాత అరటిపండును అందించావు.

ద్రాక్షా పానక ఖండ శర్కరలతో రంభా ఫల శ్రేణితో
గోక్షీరంబుల తోడ మండెగలతో క్రొన్నేతితో బప్పుతో
నక్షయ్యంబగు నేరుబ్రాలు కల మాహారంబు నిశ్శంకతం
గుక్షుల్నిండగ నారగించితిమి యక్షుద్రక్షుధా శాంతికిన్ !

అంటూ నీ వంకకు చూచాను. అప్పుడు నీవు సంతోషంతో చిందించిన చిరునవ్వుల సిరి నన్ను ఇప్పటికీ వెంటాడుతూనే ఉన్నది.

ఒకొక్కరు చేసిన వంట ఒకొక్క విధంగా ఉంటుంది. దాని రంగూ, రుచీ, వాసనా కూడా విభిన్నంగానే ఉంటుంది. దానినే హస్తవాసి అంటారేమో నాకు తెలియదు కాని, నీ చేతి వంటకు మాత్రం వాసి ఉన్నమాట నిజం !

రక రకాల వంటకాలూ చేయకపోయినా, నీవు నీ చేతితో చారూ అన్నం పెట్టినా, నాకు అమృతోపమానంగానే ఉండేది. పచ్చడి మెతుకులు పెట్టినా ప్రియంగా ఉండేది.

ప్రొద్దుటి నుంచీ ఎఱ్ఱని ఎండలో పొలం పనులు చేసి, చెమటను దిగతుడిచి పోసి - చెట్టు నీడలో కూర్చున్నాడు కర్షక శ్రామికుడు కరకరమంటూ ప్రొద్దు నడినెత్తికి వచ్చింది. కడుపులోనూ కరకరమంటూ క్షుదార్తి చెలరేగింది.

తలపై నన్నపు దుత్త నిల్పికొని సంతాపంబు దీపింప నా
కలి గొన్నాడను నాత్రమూని నమవంగా జొచ్చె నిల్లాలు వా
రల చూపుల్ పది వేరలుండగ ననిర్వాచ్యమ్ములై వింత చ
ర్యల భాషించిన వట్టి ముగ్ధ మధుర వ్యాపార మెవ్వారికో !

ఆమె వచ్చింది — అతడు ఆకలితో ఉన్నాడనే ఆతృతతో ఆదరాబాదరా అన్నపు దుత్తను తెచ్చి అతనికి ఎదురుగా పెట్టింది. అది - " తింత్రిణీ పల్లవ యుక్తమైన ఉడుకు బచ్చలి శాకము జొన్నకూటిలో కలిపిన ముద్ద " అయినా సరే - అతడికి ఆమె అందించిన భోజనం అమృతోపమానంగా ఉండక తప్పదు !

నీవు నీ చేతితో పచ్చడి మెతుకులు పెట్టినా, పంచభక్ష్య పరమాన్నం వలెనే నాకు రుచిస్తుందని అన్నాను అందుకే !

ప్రియతమా !

# 22

గత రాత్రి చాలాసేపు నిదుర పట్టలేదు. బాగా ప్రొద్దుపోయేటంత వరకూ చదువుతూనే ఉన్నాను. అందుచేతనే - ఉదయం మామూలు వేళకు నిద్ర లేవలేకపోయాను.

నేను ఇంకా పడుకుని ఉండగానే - వెంకన్న వచ్చి ఒక మంచి మాటను చెవిని వేశాడు - ప్రొద్దున్నే మన ధేనుకకు కోడెగాడు పుట్టాడని ! తల్లినీ పిల్లవాడినీ పలుకరించుదామని లేచి కొట్టం వైపుకు వెళ్లాను.

ధేనుక కళ్లన్నీ బిడ్డమీద నిలుపుకుని పొంగిపోతూ నిలుచున్నది. వాడిని వల్లమాలిన మమకారంతో నాకుతూ, ముద్దులాడుతున్నది. వాడు – ఆ చిన్న కోడెగాడు - అప్పుడే ఈ ప్రపంచాన్ని చూస్తున్న ఆశ్చర్యంతో, గర్వంతో, బడాయితో - అటూ ఇటూ తల ఊపుతూ పడుకుని ఉన్నాడు.

ధేనుక వీపు మీద చేయివేసి నిమురుతూ ఉంటే - ఎన్నో స్మృతి తరంగాలు మనసులో చెలరేగినాయి. నీవు పెట్టిన పేరు - మన ఇంటి లేగ దూడలన్నీ ధేనుకలే !

గోవునీ గోవత్సాన్నీ చూచినప్పుడు నీవు ఎంత ఆర్ద్రమూర్తివి అయేదానివో నేను ఎరుగుదును ఆ ఆర్ద్రత నీ అంతఃకరణమంతా నిండి నిన్ను ఆ చిన్న వయసులోనే అమ్మను చేసింది నీలో నేను అమ్మను చూడగలిగింది అప్పటి నుంచే ! అది ఇంతై అంతై - ఆకాశమంత ఎత్తుకు ఎదిగి నిన్ను తల్లినీ, నన్ను వత్సనూ చేసింది ! అప్పటి నుంచీ, ఈ మహత్త్వపూర్ణమైన అనుబంధ స్థితి మన దాంపత్య జీవితమంతా అంతర్వాహినిగా ప్రవహిస్తూనే వచ్చింది,

ఒక నెలపొడుపు వేళ - రాత్రి ఆకాశంలో సన్నని చంద్రవంక అవతరించింది. దానిని ముగ్ధులమై ఆ రాత్రివేళ చూస్తూ ఆరుబయట కూర్చున్నాము. ఎంతో సొంపుగా, ఇంపుగా - నిర్మలంగా - ఉన్న నెలవంకను చూచి, చూచి - ఈ పద్యం చదివావు నీవు -

గగన కళ్యాణి గండ భాగమున నిడ్డ
కాలపురుషుని గురు నఖక్షతము బోలి
మంచు నవ్వుల నదె చందమామ బుడుత
జననమైనాడు పశ్చిమ శైల శిఖరి !

పద్యాన్ని చదువుతూ, రమణీయ భావనామయ భవ్య కవితా జగత్తులోకి నన్ను కూడా వెంట తీసుకు వెళ్లావు !

ఒక దృశ్యాన్ని సామాన్య మానవుడు చూచి ఆనందిస్తాడు. భేష్, బాగున్నది ! – అనుకోవటంతో అతడి అనుభూతి ముగుస్తుంది. అదే అనుభూతి తరంగం ఒక కవి హృదయాన్ని తాకినట్లయితే – అది అతడిని ఊపిరి సలుపుకో నివ్వదు తన దర్శనాన్ని ఉపమలతో, ఉత్ప్రేక్షలతో, అలంకారాలతో – తనదైన శైలితో చిత్రించి పునఃసృష్టి చేస్తే కాని అతడికి తనివి తీరదు ! ఒక మహార్ణవం కవి హృదయం. అది పొంగినప్పుడు నింగిని తాకుతుంది !

చంద్రవంకను అప్పుడే పుట్టిన పసికందుగా ఊహించి, కవి తన హృదయంలో వాత్సల్య భావాన్ని గ్రుమ్మరించి పోశాడు. నింగిలో నెలబాలుడు నక్షత్రమాలికల మధ్య ఊయెల ఊగుతున్నాడు.

ఒక కవికి నెలవంక పొత్తిళ్ళ పురిటికందు ! ఒక కవికి పున్నమినాటి జాబిల్లి వినువీధిలో షికారు చేస్తున్న రాజకుమారుడు !

ఒనర బోర్లాడించి యుయ్యాల తొట్టిలో
బండబెట్టిన పసిపాప వోలె
వీధులంబడి తిర్గి బూదియ మైజల్లు
కొని పర్వులం బెట్టు కుఱ్ఱవోలె
నన్నమ్మ దించు మోమంతయు బెరుగన్న
మును జేసికొన్నట్టి బొట్టెవోలె
జట్టి ! తెలంటి పోసెదనన్న నందక
తొలగి పర్వులు వెట్టు నులిపివోలె
వెల్ల దుస్తులు కట్టించి వీధులన్ షి
కారు పంపిన రాజకుమారువోలె
మింట నడు చక్క జాబిల్లి మేది నీకు
నేత్రములకును జలువ బండించి పోసె !

ఈ పద్యాల వల్లె వేతలో ఆ నాటి రాత్రివేళ మన మనస్సులలో ఒక దివ్య వాత్సల్య దీప్తి చెలరేగింది ! ఈ రసమయ సన్నివేశమంతా నిన్న మొన్న జరిగినట్లు స్ఫురణకు వచ్చింది – ధేనుకనూ దాని కొడుకునూ వెన్ను నిమురుతూ, చాలాసేపు అక్కడే నిలుచుండిపోయాను –

భావేన ముగ్ధ చపలేన విలోకనేన
మన్మానసే కిమపి చాపల ముద్వహన్తమ్ –

ఒకానొక బాల విలాసరూపం కనుల ముందు సాక్షాత్కరించినట్లై –

# 23

ప్రాభాత గీతివై పరమాప్త మూర్తివై
చిరునగవు సిరి యింత పెదవి మాటున దాచి
తొలి వెలుగురేకతో పాటుగా నీవు
తొంగి చూచినగాని తెల్లవారదు దేవి !

ఈ తపన ఈ నాటిది కాదు ! ప్రతి ఉదయమూ కన్నులు విప్పగానే ఎదుట నీవు సాక్షాత్కరించాలి ! ప్రసన్న సుందరమైన నీ ముఖాన్ని చూడక పోయినట్లయితే, పడకమీద నుంచీ లేవబుద్ధి అయేది కాదు ! కనులు తెరవగానే నిన్ను చూచుకొన్న సంతృప్తితో కొండంత ఆత్మబలాన్ని కూడగట్టుకొనేవాడను. ఆ విషయం నా కంటే ఎక్కువగా నీవే ఎరుగుదువు ! అందుకే, ఎంత పనిలో ఉన్నా, నేను నిదురలేచే సమయానికి ఎదురుగా వచ్చి నా కనులకు చలువచేస్తూ ఉండేదానవు.

ఏ కారణం చేతనైనా ఎప్పుడైనా ఇందుకు భిన్నంగా జరిగితే – కలవరపడి పోయేవాడను ఇది – నీకూ నాకూ మధ్యగా నిలిచిపోయిన రహస్యం !

కొన్ని కొన్ని సుందరమైన అనుభూతులను పంచుకోవటానికి ఆత్మీయులైన మిత్రులు కావాలి. హృదయాన్ని రగిలించే ఆర్తినైనా పంచుకోవటానికి ఆ మైత్రి అవసరం

అట్టి ఆత్మీయుడైన మిత్రుడొకనితో ఒకనాడు ఈ రహస్యాన్ని పంచుకొన్నాను. సంసార జీవితంలో దంపతులైన వారందరికీ ఇది అనుభవం లోకి వచ్చే విషయమేనా – అని ప్రశ్నించాను.

నేను ఏదో అసంభవమైన విషయాన్ని చెపుతున్నట్లు ఆశ్చర్యంగా విన్నాడు అతడు.

" రోజూ తెల్లవారడం సహజమైన విషయమే ! అయితే — నీకు మెలకువ వచ్చే సమయానికి ఆమె తప్పనిసరిగా నీ కళ్లముందు కనిపిస్తూ ఉండటం మాత్రం అసహజం – అసంభవమూనూ ! అసలు అది ఎట్లా సాధ్యం ! ఆమెకు వేరే పనులేమీ ఉండవా ? నీ దంతా కొత్త బిచ్చగాని సామెతగా ఉన్నట్లున్నది ! "
.... అంటూ నవ్వి – అప్పటికి ఆ విషయాన్ని తేల్చివేశాడు నా మిత్రుడు. అప్పటికి ఏమీ సమాధానం చెప్పలేకపోయాను అతడికి – నా అనుభూతి నాది కనుక ! నా వెఱ్ఱి నాది కనుక !

ఆ తరువాత చాలా కాలానికి ఆ మిత్రుడే ఒప్పుకున్నాడు మన తీరు చూచి – అది క్రొత్త బిచ్చుగాని సామెత కాదని ; ఎన్నాళ్ళకైనా, ఎన్నేళ్ళకైనా, జిగి పీడని ఆ తొలి బాంధవ్య స్పర్శ – మనను ఏ దేవతలు కరుణించి అనుగ్రహించిన ప్రసాద విశేషమో ;

నా మిత్రుడు ఆనాడు వెలుపరించిన మరొక సందేహం – నీకు నా పైన కినుకో అలకో కలుగ కూడదా అని ; అందరు స్త్రీల మాటా నేను ఎరుగను కాని– నీ విషయంలో అది దుస్సాధ్యమే అయింది ;

నేను తెలిసి ఎప్పుడైనా నీకు అప్రియం కలిగించిన జ్ఞాపకం లేదు. నిన్ను పువ్వువలె కాపాడుకోవలెననే ఆ నాటి పెళ్లి పీటల మీది నా నిర్ణయానికి వ్యతిరేకంగా ప్రవర్తించినట్లూ గుర్తు లేదు.

నాకు తెలియకనే నీకు అప్రియం కలగించిన సందర్భాలు కొన్ని ఉండినవేమో కాని,, అవి నాకు ఎరుకకు రాలేదు – నీవు ఎన్నడూ కినుక వహించని కారణాన ;

సతీ పతుల మధ్య వట్టి కలహాలూ, గట్టి జగడాలూ సంభవించడం సర్వసాధారణమే అయినా, నీవు సరదాకయినా అలిగినట్లు గుర్తు లేదు నాకు ; ఒక్కసారయినా, నీవు అలిగి పెడ ముఖం పెట్టినట్లయితే –

అమృతము గూడు కట్టిన దొరా ! యల దూరపు నీలి కొండల్లో
గోమరు మిగుల్ సితాంబుదము కోసల మూసల పోతు వెన్నెలల్
రమణి యొకింత కోపనపరాఙ్ముఖయైనది, నాకు జెప్పవో
నమరిన దూత యిప్పుడెవరంచును నీవు వినా నిశాపతీ !

అని చందమామను దూతగా చేసుకోవాలనే నా చిన్ననాటి సరదా తీరనూ లేదు ;

అన్నేళ్ళుగా – మన జంట బ్రతుకులో నేను సాగించుకొన్న ఆ అలవాటు నీ స్వంతం కూడా కాగలిగింది సాహచర్య దోషాన ; అందుకే, ఇప్పుడు ప్రతి ఉదయమూ నాకు మెలకువ వచ్చేవేళకు నీవు వచ్చి నా కనుల ముందు సాక్షాత్కరిస్తావు – గాలి తరగగా, మంచు ముత్యంలా, వెచ్చని వెలుగు ఊర్పుగా ; నిన్ను కనులార కనుగొన్నానన్న ఓదార్పుతో నిదుర మేలుకొంటాను ప్రతి ఉదయమూ ; ఇప్పుడు –

ఒక్క నేనే నీకు
పెక్కు నీవులు నాకు !

# 24

దినకరుడు శాంతుడై తోచె, దినము లింత
కురుచలయ్యెను, చలిగాలి చురుకు హెచ్చె
బాలములన్ రేల గ్రుడ్డి వెన్నెలలలోన
గుప్పలన్ నూర్చు కాపులు గొంతుయెత్తి
పదములన్ బాడ దొడంగిరి ...

పుష్యమాసంలో మన ఊరు హేమంత సీమంతిని అయింది ! అంతులేని అనుకంపతో – రాత్రి అకాశం తెల్లవారుఝా కురిసిన దయామృత రస బిందువు లల్లే చెట్ల ఆకుల చివల్లో నిలచిన మంచు బొట్లు ఉ ద య కాం తి లో తళుకిస్తున్నాయి

ఋతు చక్రభ్రమణంలో – ఎప్పటికప్పుడు ఈ ప్రకృతి వేసుకొనే ఈ క్రొత్త వేషాలను చూచి నీవు ముగ్ధురాలవయేదానవు. నీవు చూచి అనుభవించి భావన చేసిన ఆ సౌందర్యమయ ప్రపంచంలోకి నన్నూ చేయి పుచ్చుకొని నీ వెంట తీసుకువెళ్లేదానవు.

పట సిరు ను మోసుకవస్తున్నది మకర సంక్రాంతి. ప్రతి ఏటా జరుపుకొనే పండుగే అయినా, నీవు నా గృహిణివి అయిన నాటి నుంచీ, పండుగ వేళల – కొన్ని ప్రత్యేకమైన, ఉదాత్తమయిన భావరీతులను అనుభవంలోకి తెచ్చావు. ఉత్తమమైన అభిరుచులను, ఆలోచనలను – సంచితంగా వెంట తీసుకువచ్చి నీవు మెట్టిన ఇంట కుప్పలుగా పోశావు.

అంబ ! భిక్షువ్వాటంచును నరచి నిలువ
నంగణమ్మున, గృహిణి, దయార్ద్రమతిని
త్రవ్వి గోలెమ్ము నుండి న తండులముల
చేయి గలగలలాడ దోసిళ్ల పంచు !

ఇది మన సంప్రదాయం ! ముఖ్యంగా, సంక్రాంతి వేళల – వాకిటి ముందుకు వచ్చే భిక్షగాడికి పిడికెడో దోసెడో – ఓపినంత దానం చేయడం గృహస్థ ధర్మం. ఒక విధిగానో విధాయకంగానో – జోలెలో గుప్పెడు గింజలు విదిల్చి రావడం సామాన్య ధర్మం. అట్టి యాంత్రిక కర్మకు నీవు ఒక ఆత్మీయతా స్పర్శను అలదటం – సజల నయనాలతో ఎన్ని మారులు చూచాను నేను !

మన ఇంటి పనివాళ్లు, పాలేళ్ళు – అందరికీ పండుగరోజు వండిన భక్ష్య భోజ్యాలను పంచిపెట్టటమనే విషయం – ఎప్పటినుండో అలవాటుగా

జరుగుతున్నదే ! అయితే - అన్ని పనులలో అది ఒక పనిగా - ఆలోచన లేకనే ఆ పని సాగిపోతూ ఉండేది

నీవు వచ్చిన తరువాత కొంత కాలానికి — మన ఇంట క్రొత్త అలవాట్లు వచ్చి చేరినాయి. సంక్రాంతి సమయాన - మన ఇంటి పాలేళ్ళకూ, పనివాళ్ళ కుటుంబాలకూ — క్రొత్త బట్టలు కొని బహూకరించేదానవు ! పండుగవేళ వారందరికీ మన ఇంటి ముంగిటిలో విస్తళ్ళు వేసి కుడువ పెట్టేదానవు. వాళ్ళ మంచీ చెడూ, కష్టమూ సుఖమూ - విచారిస్తూ - అందరమూ ఒకే కుటుంబ సభ్యులమన్న స్పృహను కలిగిస్తూ ఉండేదానవు. వాళ్ళు కట్టిన తరువాతనే — మనం కూడా క్రొత్త బట్టలు కట్టుకోవాలని నీవు పెట్టిన నియమాన్ని ఇంటిల్లిపాదిమీ పొల్లు పోకుండా ఆచరిస్తూ ఉండేవాళ్ళం !

ఇంతటి సామ్యవాదాన్ని నీవు ఏ పాఠశాలలో నేర్చుకొన్నావు ! నాకు ఆశ్చర్యం కలుగుతూ ఉండేది — ఇతరులకు ఇవ్వటంలో నీవు పొందే ఆనందాన్ని చూస్తూ ఉంటే ! అలా నిన్ను చూస్తున్నప్పుడు - ఏవో ఉత్తమ లోకాల ద్వారాలు తెరుచుకొన్నట్లు అనిపిస్తూ ఉండేది.

నేను నిన్ను ఎప్పుడూ ప్రశ్నించలేదు - "ఇంతటి వితరణ గుణం తగునా ! " .... అని. నీవు చేసే దానధర్మాలకు ఎప్పుడు ఎంత వరకూ వ్యయం చేయవచ్చునో ఎరిగిన దానవని నాకు విశ్వాసం ఉన్నది కనుక ! అయినా ఒకసారి నీ అంతట నీవే నీ ఆంతర్యాన్ని విప్పి చెప్పావు - ఇలా !

"రాత్రనక, పగలనక, మనకోసం పాటుపడే వాళ్ళంతా మనవాళ్ళు ! ఒప్పుకొన్న ప్రతిఫలం ఇవ్వడం మామూలు విషయమే ! అప్పుడప్పుడయినా, మనం ఓపినంత ఆదరాన్ని చూపడంలో మనకు కలిగే గొప్ప ఆనందం ఎంత విలుపైనదిగా ఉంటుంది ! ఆ ఆనందం ముందు - మనం చేసే ఈ కొద్దిపాటి వ్యయం ఏ మూలకు వస్తుంది ! "

ఇవ్వటంలోని మహదానందాన్ని ఈ విధంగా నాకు చవిచూపించావు నీవు. పండుగలోని పరమార్థం — పంచుకోవటంలోనే ఉన్నదన్న ఉదాత్త భావనను కలుగజేశావు. అప్పటి నుండీ — ప్రతి దినమూ పండుగగానే తోచేది.

అప్పటి నుండీ - విశుద్ధ భావనా పూతమతిని నేను - నిన్ను తలచిన వేళల-

ఆత్మలో నది యేమొ ఆర్ద్రానుభూతి !
బహులభార్ధ సాధనా ద్యుతి విభూతి !

# 25

మల్లె పూచిన చూచి మధుమాసమే మరల
తరలి వచ్చిన జాడ నెరుగుదును కాని
మధురూపిణివి నీవు మసలి వాకిట
విరిమల్లియల వికసింప చేయగా
మధుమాస మది యెపుడు మరలి వచ్చినదనుచు
మదిలోన నదియేమొ మధురోహ నున్నా !

సదా నీ సన్నిధిని కోరుకొనే నా మనస్సు నిండా, అనుక్షణమూ ఎన్నెన్ని పూల పూతలు ! ఇదివరకు ఏటా వస్తున్నదనిపించే మధుమాసం – ఇప్పుడు ఏటి పొడుగునా తానే నిలచి సురభిళిస్తున్నదన్న భావన – మధురోహగా మొలిచింది. యదార్థమై నిలిచింది !

నీవు తల్లివి కాబోతున్నావన్న శుభ సమాచారాన్ని విన్నప్పుడు – నా మనస్సు చిగురించింది. నా మనస్సుతో పాటూ – ఈ సమస్త సృష్టి చిగురించినట్లయినది. ఏ దిక్కు చూచినా. ఏదో సరి కొత్త సౌందర్యం మోసులెత్తుతున్నట్లు అనిపించింది. మన ఇద్దరినీ కట్టివేసిన అనురాగ బంధమే నునులేత రూపంలో క్రొత్త ఊపిరి పోసుకుంటున్నదనిపించి అనిపించింది.

ఆ క్రొత్త ఊపిరికి నిర్వచనం – ఇంత హృదయంగమంగా చెబుతున్నాడు భవభూతి –

అన్తఃకరణ తత్త్వస్య దమ్పత్యోః స్నేహ సంశ్రియాత్
ఆనంద గ్రన్థి రేకోయ మపత్య మితి బధ్యతే !

భార్యాభర్తలు ఇరువురి ప్రేమకూ ఏకాశ్రయం కావటం వల్ల – వారికి కలిగిన బిడ్డ – ఆమె అంతఃకరణ పదార్థమును, అతడి అంతఃకరణ పదార్థమును– ఒక్కటి చేసి వేసిన హర్షపు ముడి ! దానికి మరి సాటి లేదు !

సర్వ సాధారణమైన భౌతిక ధర్మానికి ఇంతటి ఆత్మ స్పర్శను అద్దటం – ఋషి వంటి కవికి మాత్రమే సాధ్యం అవుతుంది !

ఏదో నిండుదనంతో, హర్ష ప్రఫుల్లమైన నీ ముఖాన్ని చూచినప్పుడు – నా మనస్సున మాతా శిశు సంబంధమైన ఒక పవిత్ర భావం ఉదయించేది. క్రొత్తగా మొగ్గ తొడుగుతున్న మందార మొక్కను చూచినా, అప్పుడే ఇగురు విడులుతున్న నవపల్లవాన్ని చూచినా, ఒక ప్రైపున దివ్యమైన మాతృత్వ సిద్ధి–

మరొక వైపున అతి ముగ్ధమైన శిశుత్వ రక్తి - తాండవిస్తున్నట్లు. చేదితో గూటిలో కూర్చున్న రెక్కలు రాని పిట్టకూనకు దాని తల్లి నోటిలో నోరు పెట్టి ఆహారం అందిస్తున్నది. తల్లి వెనుక వెనుకే రబ్బరు బంతులలాగు గునగున తిరుగుతూ ఉన్న పసిపిల్లలను కోడి తల్లి తన రెక్కల క్రింద చేర్చుకొని మాటి మాటికీ కాచుకొంటున్నది. ఇవన్నీ రోజూ చూచే విషయాలే అయినప్పటికీ, అదేమి చిత్రమో - ఇప్పుడు ఈ ప్రకృతి సమస్తమూ కమ్మని అమ్మతనంతో లాస్యం చేస్తున్నట్లు అనిపిస్తున్నది !

విన్ను గురించిన ఈ మనోహరమైన తలపోతల మధ్య - నాతో అప్పుడు ఒక ఇంత విస్పృహ కూడా ప్రారంభమైన మాట నిజం ! ఇక ముందు నీవు తల్లివి ! నీ మమకారమంతా ముద్దు కట్టుకొన్న శిశుమూర్తి నీ ఒడిలో ! పేగు బంధం కారణంగా - నీ మమతనంతా పంచుకోబోయే ఆ శిశువు - నన్ను నీకు ఏ మాత్రమైనా దూరం చేయదు కద ! తొలిసారి తండ్రులు కాబోయే వారందరికీ- ఇటువంటి నిర్వేదమేదో కలగటం సహజమేనా ? నా భయాన్ని నీకు విప్పి చెప్పలేదు కానీ -

అందెలు గజ్జెలు మ్రోయగ
చిందులు ద్రొక్కుచును వేడ్క చెలువారంగా
నందుని సతి యా గోపిక
ముందర నాడుదువు మిగుల మురియుచు కృష్ణా !

అన్న పద్యం చదివి - " మరి నందగోపయ్య ఏమయినట్లు ? అక్కడ లేడా ? ఆ ఆనందంలో అతడికి పాలుపంచుకునే భాగ్యం లేదా ? " .... అన్నాను నవ్వుతూ !

నీవు సూక్ష్మగ్రాహివి. నా చేతిని ఆప్యాయంగా స్పృశించి —

" మీకు ఇది జ్ఞాపకం లేదా ! " .... అంటూ ఈ రఘువంశ శ్లోకాన్ని చదివావు.

రథాంగ నామ్నో రివ భావ బన్ధనం
బభూవ యత్ప్రేమ పరస్పరాశ్రియమ్
విభక్త మప్యేక సుతేన తత్తయోః
పరస్పర స్యోపరి పర్యచీత !

దంపతులకు మధ్య పరస్పరం ఉన్న ప్రేమను వారి ఏకపుత్రుడు పంచుకొన్నప్పటికిని - వారి మధ్య అనురాగం ఏమాత్రమూ తరగలేదు సరికదా- మరీ పెరిగినదట !

అన్ని వేళలా మాటలు పనిచేయవు ; మాటల కందని శతకోటి భావనలు మౌనంలో రూపుదిద్దుకొంటాయి మాటలు ఎంత ఇష్టమో, మౌనమన్నా అంతే ఇష్టం నాకు. ఓ రోజు ఉదయంవేళ - శూన్యంలోకి చూస్తూ మౌనంగా కూర్చున్న నన్ను ఎవరో వచ్చి పలుకరించారు

"బాబూ! నేను కట్టుకొన్న చిన్న ఇంటికి ఇవాళ గృహప్రవేశం చేస్తున్నాను. మీరు ఒక్కసారి వచ్చి ఆశీర్వదించాలి " - మన దూరపు బంధువు ఒకరు వచ్చి అప్యాయంగా అహ్వానించాడు.

" అలాగునా ; చాలా సంతోషమయ్యా ; కాని నేను ఎక్కడకూ రాలేను. రావటం మానుకున్నాను ; " .... అని అందామనుకున్నాను. కానీ, అనలేక పోయాను - నీవు నాకు అలవాటు చేసిన ఆచరణ విధానం జ్ఞాపకం వచ్చి ;

" ఓహో ; నీవు ఒక ఇంటివాడవయినావటోయి ; చాలా సంతోషం ; సాయంత్రం అటుకేసి వచ్చి మీ ఇల్లు చూస్తాను " .... అన్నాను అతని భుజం మీద చేయి వేసి. నమస్కారం చేసి సంతోషంగా వెళ్ళాడు అతను. మళ్ళీ నా మౌన సమాధిలో అంతర్ముఖుడనైనాను నేను.

పూర్వ జన్మలలో ద్రవ్వి పోసుకొన్న
యొక మహా పుణ్యరాశి యిట్లొరగెనేమొ
తన యొడంద సర్వస్వ మంతః పవిత్ర
శుద్ధ భావనాపూతమ్ము జూర యొసగ !

అన్నట్లుగా నా బ్రతుకును తీర్చిదిద్ది పునీతం చేశావు. ఒక దశలో - నా మనస్సులోనూ చేతలలోనూ చోటుచేసుకున్న అలసత్వానికి స్వస్తి పలికించావు!

ఊరిలో తరచుగా ఎవరింటిలోనో శుభా శుభ కార్యమేదో జరుగుతూనే ఉంటుంది. అయినవారూ కానివారూ కూడా - దేనికో ఒక దానికి పిలుస్తూనే ఉంటారు, అన్నిటికీ వెళ్ళాలనుకుంటే కాలహరణ మవుతుంది. స్వంత పనులు కొన్ని మానుకోవలసి వస్తుంది - అనుకొంటూ ఎవరి ఇంటికైనా వెళ్ళటానికి బద్ధకిస్తూ ఉండేవాడను.

నీ అభిప్రాయాలు ఇందుకు వ్యతిరేకంగా ఉండేవి. తమ ఇంటికి మనం రావాలనే ఆకాంక్షతో వారు వచ్చి పిలుస్తారు. వారు రమ్మన్న సమయానికి మనమూ హాజరై, వారి సంతోషంలో పాలుపంచుకోవటం మన ధర్మం.

ఈ విధంగానయినా, ఇతరుల కష్టసుఖాలలో పాలుపంచుకునే వీలు ఏర్పడుతుంది. అది శుభకార్యమయితే, వారికి మన సంతోషం తెలియజేయటమూ – కష్ట విషయమయితే సానుభూతిని అందించడమూ - మన కనీస కర్తవ్యం " .... అని అంటూ ఉండేదానవు.

ప్రపంచ రీతి ఇలా ఉంటుందని అంటున్నాడు - జీవితాన్ని కాచి వడపోసిన కవి -

కలిగిన వాని యింట శుభకార్యము గల్గిన కీడు గల్గినన్
బిలువక మున్నె బాంధవులు పెల్లుగ బోయి తతాంగమంతయున్
దెలుపుచునుందు రాతనికి దీనుని యింట శుభంబె కల్గినన్
బలుమరు బిల్చినప్పటికి పల్కరుగా రెవరైన భైరవా !

కలవారినీ లేనివారినీ ఒకే విధంగా సమాదరించగల సహృదయురాలవు నీవు. అందుకే, అయినవారికి మాత్రమే కాక, మన పనులలోకి వచ్చే కూలి నాలి జనానికి కూడా – అంత ఆత్మీయురాలవైనావు.

ఎంతటి ఆత్మీయురాలవైనావో చెప్పనా ? మన పాలేరు సుబ్బన్నకు కొడుకు పుట్టినప్పుడు - నీవు స్వయంగా వెళ్లి, పేరు పెట్టి ఆశీర్వదించి రావలసి వచ్చింది ; మన ఇంటి పనులు చేసే నాగమ్మ ముసలి తల్లి చనిపోయినప్పుడు - వాళ్ల ఇంటికి వెళ్లి నీవు చల్లని మాటలతో ఊరడింపు పలికితేనే కాని – అది కొంత తెప్పరిల్లలేక పోయింది ; ఎవరికి ఎప్పుడు ఏ అవసరం పడినా - అరమరికలు లేకుండా అమకొనేదానవు కమక – అందరకూ నీవు ఆత్మ బంధువువు కావడంలో నాకు ఆశ్చర్యం లేదు ;

ఇలా, మంచి మనస్సుతో - నీవు సాధించిన సౌజన్య పూరితమైన మానవీయ బంధాలు – మన చుట్టూ అల్లుకుపోయి, మన జీవితాన్ని పరిమళ భరితం చేశాయి. ఇప్పుడు కూడా ఆ మంచితనం తాలూకు సుమనోహర సుగంధాలు - నన్ను చుట్టివేస్తూనే ఉన్నమాట నిజం ;

నా మనసు నే నెరుంగని నాడె నన్ను
నదునుకొని వచ్చి నా జీవితాంతమునకు
నన్ననుసరించుకొనుచు వెంటబడి వచ్చు
నీ తపోరాశి చేత బునీతుడనైతి !

ఆ తపోరాశి ఎంతటిది ; హిమగిరి శిఖరమంతటిది;

## 27

ఉదయపు నడకలో నాకు నిత్యమూ పరిచితమైన దృశ్యాలు ఎన్నో ! రోడ్డువార మూల తిరుగుడులోనే ఉన్న పెద్ద చింతచెట్టూ, మరికాస్త దూరంలో, కూడలిలో శాఖలు విస్తరించిన మర్రిచెట్టూ – దాని చుట్టూ ఎత్తైన సిమెంటు చప్టా. ఆ చప్టామీద ఊరి జనం చిన్నాపెద్దా కూర్చొని – ఊళ్ళోనివీ ఊరవతలవీ విషయాలు పిచ్చాపాటీగా మాట్లాడుకొంటూ ఉండటం అలవాటు.

ఇవాళ నేను నడక ముగించి వస్తున్నప్పుడు అక్కడే విన్నాను – కృష్ణమూర్తి ఊరు వదలి వెళుతున్న విషయం. ఇక్కడ తనకు ఉన్న పొలం పుట్రా అమ్మివేశాడట. ఇల్లు కూడా బేరం పెట్టినట్లు విన్నాను. బస్తీలో పిల్లలను చదివించుకోవాలనీ, అక్కడే ఏదైనా వ్యాపారం చేసుకోవాలనీ అనుకొంటున్నాడట.

ఈ విషయం విన్నప్పుడు నా మనస్సులో ఎక్కడో ఏదో కలుక్కు-మన్నట్లనిపించింది. ఉన్న ఊరు కన్నతల్లి వంటిది. ఒక్కసారిగా ఊరి బంధాలన్నీ వదిలించుకుని తెలియని ఏ దేశాలకో తరలి పోవటం – సామాన్య విషయం కాదు !

వృత్తం ఎంత పెద్దది అయినా, తిరిగి ప్రారంభించిన చోటుకు రాక తప్పదన్నట్లు – ఏ సన్నివేశంలోనయినా, నీ స్ఫూర్తి వచ్చి నా హృదయాన్ని స్పృశింపక తప్పదు ! నీవు నా ఇంటికి గృహలక్ష్మిగా వచ్చిన తొలి రోజుల్లోనే– నా గుండెలోని ఆలోచనలన్నిటినీ నీ ముందు పరచిపెట్టటం నా కర్తవ్యం అనుకొన్నాను.

" నేను చదువుకోసం చదువుకొన్నాను. ఏదో ఒక ఉద్యోగం చేయాలని కోరిక లేదు. తాత తండ్రుల నాటి నుండీ పరంపరగా వస్తున్న వ్యవసాయ వృత్తి ఉన్నది. మనకే కాక, మనను నమ్ముకొన్న మరికొంతమందికి కూడా తిండి పెట్టగల గడ్డ మనది. నేను కూడా కృషికుడనై ఏదో సాధించాలని ఉంది. నీకు సమ్మతమే అవునా ? " .... అని అడిగాను నిన్ను.

చిరుహాస రేఖలు మొలిచిన నీ ముగ్ధ వదనమే నేను ఆశించిన సమాధానాన్ని అందించింది. అప్పుడు నిన్ను చూస్తూ – ఇలా అనుకొన్నాను.

చూచుచుండ విలాసపు చూపులోదవె
గన్నుగవ చిట్టచివరి భాగములందు
సాంధ్య శీతలమైన యీ చల్లగాలి
ముద్దు టిల్లాలి నర్మోక్తి మురుస్సరించు !

అనుకొంటూ ఆనందపడుతూ ఉండగా — నీవు నాకు కావలసిన సమాధానాన్ని అందించావు — ఇంత ప్రియంగా - కవితాత్మకంగా చెపుతూ —

మనుజ సమాజ నిర్మితి సమంబుగ నీకొక ముఖ్యమైన వృ
త్తి నియతి, మట్టి ధార్మిక విధిం జిరకాలము గౌరవంబుతో
మనిచిరి నీ పితామహుల మాంద్య సుశీలురు సర్వవృత్తి పా
వన కృషి జీవనైక పరిపాలన లోకహితార్థ కాంక్షులై !

" మీరు మాత్రం ఆ త్రోవను నడువవద్దా ! " .... అన్నావు.

ఎంతటి ఉచితజ్ఞత ! ఎంతటి సమయజ్ఞత ! ఎంతటి రసజ్ఞత ! అన్నిటినీ మించి ఎంతటి సాహిత్య స్ఫూర్తిమత !

అప్పటి నుంచీ ఈ ఊరు మన ఇద్దరిదీ అయింది. ఇక్కడే పుట్టి పెరిగినట్లు ఈ ఊరి తోటీ, ఊరి వారందరితోటీ అనుబంధాలు పెంచుకొన్నావు నీవు !

అందుకేనేమో - ఈ ఊరివారెవరైనా ఊరు విడిచి వెళుతున్నారంటే మనస్సు చివుక్కుమంటుంది. ఒకరు కాదు — ఇద్దరు కాదు - అంతకన్నా ఎక్కువమందే - ఏదో సాకుతో పట్టణవాసానికి ఎగబడి వెళ్లిపోతున్నారు.

అలా అని పట్టణ జీవితమంటే నాకు నిరసన కూడా లేదు. గ్రామమైనా, పట్టణమైనా — దేని ప్రత్యేకత దానిదే ! దేని సొగసూ, సౌకర్యమూ దానిదే ! నేను అనుకునేది ఏమంటే - మనకు అవసరం లేని, అందుబాటులో లేని - ఆకర్షణల కోసం - స్వస్థలాన్నీ స్వధర్మాన్నీ విడిచి వెళ్లనక్కరలేదనే !

అపి స్వర్ణమయీ లంకా న మే లక్ష్మణ ! రోచతే
జననీ జన్మభూమిశ్చ స్వర్గాదపి గరీయసీ !

స్వర్ణమయమైన లంకానగరం ఎంత మెరిసిపోతున్నా, తనను ఆకర్షించడం లేదు - అంటాడు కదా రఘురాముడు - కన్నతల్లీ కన్నభూమీ స్వర్గంకంటే కూడా గొప్పవి కనుక !

ఈ గడ్డ — మనం ఇద్దరమూ కలిసి జీవించిన జన్మభూమి ! కర్మభూమి; ఇది నాకు పుణ్యభూమి !

# 28

అసలే ఆనదు చూపు !
ఆ పయి ఈ కన్నీరు !

ఎవరా వస్తున్నది - ఉండి ఉండీ ఒళ్ళు ఊగి పోతున్నది-కదలలేని వెర్రి శబరికి ! తాను ఎక్కువకాలం ఎదురుచూడలేదని దయ తలచి - తన కోసమె తన కోసమె - తనకన్నా నిరుపేద—తన మహారాజు—అదుగో - ఆ రామయ్యే-నడచి, నడచి, వస్తున్నాడు ! తీరా దయచేసిన స్వామి రూపం నీరు నిండిన-కళ్లకు సరిగా గోచరం కాదే! అయినా, అతడు తన రామయ్యే—అనుకొంటున్నది.

కొలను నడిగీ తేట నీరు
కొమ్మ నడిగీ పూల చేరు
చెట్టు నడిగీ పుట్టనడిగీ
పట్టుకొచ్చిన - ఫలాలు - పుట్టతేనె రసాలు
దోరవేవో - కాయలేవో -అర మగ్గినవేవో గాని
ముందుగా రవ్వంత చూసి - విందుగా అందియ్యనా !

బహుశః - వచ్చిన అతిధిని భగవత్స్వరూపునిగా భావించే సంప్రదాయం, శబరి నాటినుంచే మనకు సంక్రమించినదా - అనిపిస్తుంది !

అతిథిః కిల పూజార్హం ప్రాకృతోపి విజానతా !

అతిథి - అనాగరకుడే అయినా, జ్ఞాన సంపన్నుడే అయినా అతడు పూజార్హుడు. వచ్చినవాడు సాక్షాత్తూ రామచంద్రుడే అయితే ! ఆతిధేయ శబరి అంతటి ఆర్ద్రమూర్తే అయితే ! ఇహ — ఆతిధ్యం - ఎంతటి మహత్త్వపూర్ణమైనది అవుతుంది !

నీవు ఈ ఇంట గృహిణి స్థానాన్ని అలంకరించిన తరువాత — ఎందుకో చెప్పలేను కాని - మన ఇంటికి అతిథి అభ్యాగతుల రాకపోకలు ఎక్కువైనాయి వచ్చిన వారిలో చుట్టాలూ ఉండేవారు. కానివారూ ఉండేవారు. ఎవరు ఏ వేళ వచ్చినా, ఆదరంతో వారికి భోజనం పెట్టి, వారికి అన్ని సౌకర్యాలూ కలుగచేసే దానవు.

వండ నలయదు వేవురు వచ్చిరేని
నన్నపూర్ణకు నుద్దియౌ నతని గృహిణి
యతిథు లేతేర నడికి రేయైన బెట్టు
వలయు భోజ్యంబు లింట నవ్వారి గాగ !

అల అల్లసానివారి ప్రవరాఖ్యుని ఇల్లాలు స్ఫురణకు వస్తూ ఉండేది నిన్ను చూస్తున్నప్పుడు ! కానీ, ఈ కారణంగా – నీవు అధిక శ్రమకు లోనవుతున్నావని నాకు లోలోపల విచారంగా ఉండేది.

" వచ్చే పోయే వారికి వేళా పాళా కూడా తెలియాలి కదా ! నీకు బాగా శ్రమ అవుతున్నది ! " .... అన్నాను ఒకరోజున.

నీవు ఆ ప్పు డ న్నా వు ఒక మాట ! అది ఇప్పటికీ నా చెవులలో మారుమ్రోగుతూనే ఉన్నది.

" ఏ కారణంగా నయినా మన ఇంటికి వచ్చినవాళ్ళు మనకు పూజనీయులు, ఆదరణీయులు. " అఖిమతాశ్రమాల్లో గృహస్థాశ్రమం ఉత్తమమైనదనీ, ఆర్తునకు శయనాన్నీ, భీతునకు అభయాన్నీ, తృషితునకు జలాన్నీ, బుభుక్షితునకు అన్నాన్నీ, శ్రాంతునకు ఆసనాన్నీ-ఇవ్వడం సనాతనమైన గృహస్థధర్మం ".... అన్నది భారత సూక్తి కదా ! నేనూ నా ఆశ్రమ ధర్మాన్ని మాత్రమే నిర్వహిస్తున్నాను. శ్రమ అయినా, అది నాకు ఆనందాన్నే ఇస్తున్నది."

నీ ఆనందం నా ఆనందమే కాదా ! అందుకే, అప్పటి నుంచీ – అతిథి అభ్యాగతుల సేవను నీతోపాటు నేనూ – సే వా ధ ర్మ ం తో ఆచరించటం ప్రారంభించాను.

గగనము నీరు బుగ్గ కెనగా జడివట్టిన నాళ్ళ భార్యక
న్బ్యాగ సొరకుండ నారికెడపుం బోరియల్దవుర్లించి వండన
య్యాగ పల ముంచి పెట్టు గలమాన్నము నొల్చిన ప్రిప్పు నాలుగే
న్బ్యాగసిన కూరలు వ్వడియముల్వరుగు ల్పెరుగు న్మృతప్లుతిన్ !

విష్ణుచిత్తుల వారితో సరిపోల్చుకొనే సాహసం చేయను. కాని, ఆ మహామభావునికి వలెనే – అర్ధాంగి కష్టపడటం సహించలేని చిత్తవృత్తి నాది, అందుకే – వీలయినంతగా వంట యింట కొన్ని అదనపు సౌకర్యాలు కలుగ చేశాను – నీకు శ్రమాధిక్యతను తగ్గించడం కోసం !

కెలకుల నున్న తంగెటి జున్ను గ్రిహమేధి
యజమాను డంక సీతార ధేటి
పండిన పెరటి కల్పకము వాస్తవ్యుండు
దొడ్డి బెట్టిన వేల్పు గిడ్డి కాపు !

అంటూ – పెద్దనగారు సంసారిని గురించి ప్రశంసలు పలికారు కాని అన్నిటికీ మూలమైన అన్నపూర్ణ – అతిధేయ – ఆమె లేకపోతే – అతడు చేయగలిగినదేమి ! అవును ! నీవు లేకపోతే నేను చేయగలిగిన దేమి !

# 29

విరియ గాచిన పండ్ల బరువుచే వంగిన
సాలమ్ము వొలిచె జూలాలు వోలె
కోకిల జిగి గొంతు కోలెత్తి ప్రలపించె
నవవీధి భార్యా ప్రవాసి వోలె !

మాతృత్వ సిద్ధి కోసం నీవు మీ పుట్టినింటికి వెళ్లావు. ఈ సర్వ సృష్టి- నా కనుల ముందు ప్రసవ భర నవ వల్లరిగా కనుపిస్తూ వచ్చింది. కొమ్మ కొమ్మకూ విరియ కాచిన పండ్ల బరువుచేత వంగిన ఫల వృక్షాలను చూస్తే - నిన్ను చూచినట్లే మనసుకు తోస్తున్నది. నా ఏకాంతంలో - మాతృత్వ శోభను గురించిన ఎన్నో ఎన్నో సమార్ద్ర భావనలు !

భిన్నాతి భిన్నమైన స్త్రీ పురుష ప్రకృతులు రెండూ ఏకీకరణ సూత్రానికి కట్టుపడి ఉండడం ఎంత చిత్రమైన విషయం ! మాతృత్వ సిద్ధితో ఆ ఇద్దరి మధ్య అనుబంధం వాత్సల్యంగానూ, కరుణంగానూ, పవిత్ర రసోత్కర్షణగానూ పరిణమిస్తుంది. ఆమెలో సిద్ధించిన అమ్మతనం - అతడిని కూడా వాత్సల్య మూర్తిని చేయగలిగినంత శక్తిమంత మవుతుంది ! అప్పుడిక ఆ ఇద్దరినీ బంధించగల సూత్రం - అపరిమిత వాత్సల్యంతో కూడిన మధుర స్నేహమే !

పరమ ధర్మార్థమైన దాంపత్య భక్తి
స్తన్య మోహానమైన వాత్సల్య రక్తి
సాక్షిమాత్రి సుందరమైన సఖ్య సక్తి
పొందు నాదిమ మగు ప్రేమ మంద ముక్తి !

నీవు మీ కన్నవారి ఇంటికి వెళ్ళిన దగ్గర నుంచీ, నా మనసు నిండా నీ శరీర సౌఖ్యాన్ని గురించిన ఎన్నో ఆశంకలూ, ఆందోళనలూ ! మాతృత్వం ఎంతో కమ్మనిదే ! కాని, దుస్సహమైన శరీర బాధతో కానీ సిద్ధించనిది !

అన్ని నాళ్లూ నీ క్షేమం కోసం తపనపడుతూనే ఉన్నాను. దైవాన్ని ప్రార్థిస్తూనూ ఉన్నాను. నా అన్యమనస్కతను చూస్తూ ఉండిన స్నేహితులు పరిహాసాలు ప్రారంభించారు.

" ఈ ప్రపంచంలో తొలిసారి నీవే తండ్రివి కాబోతున్నట్లు ఏమిటా పరధ్యానం ! " .... అంటూ నన్ను ఉడికిస్తూ ఉండేవారు.

అవును ! తల్లి కావటం వలెనే, తండ్రి కావటమూ ఒక గొప్ప అనుభవం ! జన్మ సార్థకమయినట్లు అనిపించే మహత్త్వపూర్ణమైన అనుభవం !

ఇడి పొత్తుకల భార్య నడికట్టుతో వచ్చి
యందీయ బసిపాప నందుకొనగ
చిటికతో బల్కరించిన దొట్టెలో బిడ్డ
బోసినవ్వుల చిట్టి హాసు మరుగ
రా బాబు నీవిట్లు రా యని నవ్వుచు
జే సాచ మార్నవ్వు శ్రీల కుబుక
గృహము చేరిన యంతనే కాళ్లు కడ్గమ్ము
వచ్చి మోకాళ్లల బ్రాక నుబ్బ -

ఇంతటి మహదానందాన్ని మోసుకువచ్చే అనుభవ మది !

అయితే, నడికట్టుతో, పొత్తుకల పసిపాపను తెచ్చి అందించడానికి ముందు ఎంత పూర్వరంగం ఉంది ! ఇప్పటి కాలాన ఇంతటి వైద్యవిజ్ఞానం పెరిగింది. వైద్యులూ, వైద్యాలయాలూ అందుబాటులోకి వచ్చినాయి. కానీ, నీవు తల్లివి కాబోయిన నాటికి ఈ సౌకర్యాలు అంతగా లేవు.

అందుకే - నా ప్రాణసఖివి నీవు - పొత్తిళ్ల బిడ్డతో క్షేమంగా తిరిగి రావాలని అనుక్షణమూ పరమాత్ముని ప్రార్థించుకొంటూనే ఉన్నాను.

నా వినతిని ఆలించిన స్వామి కరుణించిన జాడ - ఒకనాటి శుభోదయ వేళ - నా చెవులకు అమృతపు సోనగా వచ్చి తాకింది ! నీవు తల్లివైనావట, నేను తండ్రినైనానట ! మన ఇద్దరమూ కన్నతల్లి చిట్టి శిశువై ఉదయించినదట!

ఆనందంతో కన్నులు అరమూసికొన్నాను ! అంతలో - ఆ ఆనందానికి అవతలి అంచు ఏదో నిర్వేద భరిత తాత్త్విక ప్రవృత్తి ! ఎందుకో తెలియని నైరాశ్య భావనావిష్కృతి !

జననం - మరణం ! కష్టం - సుఖం ! అన్నిటికీ స్పందిస్తూ విలవిలలాడి పోయే ఈ జీవ ప్రకృతి ! ఇంతా చేసి - ఈ యావత్తు జీవన్నాటకమూ క్షణికం ! క్షణికమంటే క్షణికం ! అమృతమూ, హాలాహలమూ ఒక్క తల్లి కడుపునే పుట్టినట్లున్న అప్పటి నా మనఃస్థితిలో పాడుకొన్నాను ఈ చిరు పాటను-

ఈ సుఖంబును గష్టంబు నెందుకొరకు !
ఈ భవంబును నాశంబు నెందుకొరకు !
ఈ జగంబున నిన్నియు నెందుకొరకు !
ప్రేమ కొరకు ప్రేమ కొరకు ప్రేమ కొరకు !

# 30

వర్షాగమనం సమస్త ప్రకృతికీ హర్ష కారణమే ! ఎటు చూచినా అకుపచ్చని మొలకలు చిగురిస్తున్నవి. నడిచే బాటల పైన కూడా గడ్డిపరకలు మొలకెత్తుతున్నవి. ఈ హరిత, పుష్పిత సౌందర్యాన్ని చూచి, వనప్రదేశం తనకు తానే హర్షించి హసిస్తున్నదా అన్నట్లు ఉన్నదని కాళిదాస కవి వర్ణన.

ముదిత ఇవ కదమ్బై ర్జాత పుష్పై స్సమన్తాత్
పవన చలిత శాఖైః శాఖిభిర్నృత్య తీవ,
హసితమివ విధత్తే సూచిభిః కేతకీనాం
నవ సలిల నిషేకా చ్ఛాన్త తాపో వనాన్తః !

చల్లని వర్షఋతువు ప్రవేశించింది. చెట్లన్నీ పుష్పించినాయి. హర్ష పులకితమై నవ్వులు విరజిమ్మినట్లు కనిపిస్తున్నది.

ఈ పచ్చదనాల మధ్యగా నడుస్తూ – ఈ ఉదయం మన చేలపైపుగా వెళ్ళాను. అక్కడ ఒక అద్భుత దృశ్యాన్ని చూచాను.

చేనిలో కలుపు మొక్కలు తీస్తున్నారు నారయ్యా అతని భార్యా. ప్రక్కనే చెట్టు క్రింద ఒత్తైన బట్టల పొత్తిలో పసిబిడ్డను పడుకోబెట్టారు. మధ్య మధ్యలో బిడ్డ పైపు చూసుకొంటూ పనిచేసుకొంటున్నది తల్లి.

అంతలో బిడ్డ లేచాడు. అటూ ఇటూ మసిలాడు. కంటికి ఎదురుగా చెట్ల ఆకులూ, నీలాకాశమూ తప్ప, వాడికి అమ్మ రూపం కనిపించలేదు. ఏది కావాలన్నా వాడికి తెలిసిన ఆయుధం ఏడుపు ! ముఖం చిట్లించి ఏడుపు సాగిస్తూ మోకాళ్లమీద, మోచేతులమీద – ప్రాకటం ప్రారంభించాడు.

" అయ్యో ! బిడ్డ మట్టిలో పొర్లాడుతున్నాడు ! " .... అంటూ తల్లి చేనిలో నుంచి పరుగు పరుగున వచ్చింది. మట్టి చేతులతోనే బిడ్డను ఎత్తుకుని గుండెకు హత్తుకుని సముదాయించింది !

ఇప్పుడు – బిడ్డ వంటినిండా నిజంగానే మట్టి ! బిడ్డకు మట్టి అంటుతున్నదని ఆరాటపడిన తల్లికి తన చేతుల మట్టిని వాడికి అంటిస్తున్నానని స్పృహ ఏమాత్రమూ లేకపోయింది !

అవధిలేని వాత్సల్య కారుణ్యాలకు మాతృక మాతృత్వమయితే, – అది దైవత్వాన్ని అందుకొన్నప్పుడు –

సిరికిం జెప్పక, శంఖ చక్ర యుగముం జేదోయి సంధింపక
ఏ పరివారంబును జీరక, అభ్రగపతిం బన్నింపక
ఆకర్ణికాంతర ధమ్మిల్లము జక్కనొత్తక
వివాద ప్రోద్ధత శ్రీకుచోపరి చేలాంచలమైన వీడక -

ప్రభువు పరుగు పరుగున వచ్చి - అపన్నుని కాచుకోవటంలో ఆశ్చర్యం ఏమి ఉంటుంది కనుక !

ఈ రోజు - ఈ హృదయంగమమైన దృశ్యాన్ని చూచినప్పుడు మన బిడ్డ యశోధరను నీవు పొత్తిళ్లలో ఉంచుకుని మన ఇంటికి మరలి వచ్చినప్పటి జ్ఞాపకాలు ముసురుకొని వస్తున్నవి.

క్రొత్తగా తల్లివి అయిన[illegible]కళ నీలో ఉట్టిపడుతూ ఉండేది. బిడ్డ పనులన్నీ ఇంటిలో పెద్దవాళ్లు చేసినా, నీవు బిడ్డను ఎత్తుకొని సముదాయించటం చూచినప్పుడు నాకు నవ్వు వచ్చేది. లీలగా - ఈ పదం నా నాలుకపైన ఆడుతూ ఉండేది.

తొలి కాన్పు పసిపాప - సాకనేరని బాల
తూరుపు కోనలో - తొంగలించిన మబ్బు
తెగ పరువు లెత్తిందిలే - సొగసుల్లు పోయిందిలే !

లేత బాలింత ఇల్లాలి తియ్యని అనుభవాన్ని — కవి కమనీయంగా వర్ణించిన తీరు ఇది !

బిడ్డను ఎత్తుకోవటం నాకు చేతనయ్యేది కాదు ! నీవు నా చేతకానితనాన్ని గురించి ఆరిందావలె నవ్వుతూ ఉండేదానవు. నీవు పొందగలిగిన మాతృత్వానుభవం - ఈ సర్వ సృష్టికీ కూడా నిన్ను మాతను చేసింది ! ఈ సృష్టిలోని అణువులోని పరమాణువును నేను కనుక - నన్నూ అలముకొన్నది మహాసాగరమంతటి నీ మాతృత్వ స్పర్శ !

పాపాయి వచ్చిన దగ్గరనుంచీ కావలసినంత సందడి మన ఇంట. నవ్వినా, ఏడ్చినా, మనస్సులో చెప్పరాని తీపిని అలుముతూ ఉండేది. గుండె నిండుగా ముంచుకొచ్చిన ఈ తీపిదనమే - 'పాపాయిని ఇట్లా వర్ణించుకొన్నదేమో!

కాటుక పెట్టిన కన్ను
లేత మామిడి చిగురు
లేగంటావుల పెరుగు
కమ్మని కందిపప్పు ముద్ద
అప్పుడు కాచిన నెయ్యి
అప్పాల పండుగ -

ఎవరు వారు ! పట్టు కుచ్చుల జులపాల జుత్తుల చిన్ని పాపాయి !

ప్రియతమా !

# 31

వందే మాతరమ్ !

సుజలాం సుఫలాం మలయజ శీతలాం

సస్యశ్యామలాం - మాతరం వందే మాతరమ్ !

దేశాన్ని తల్లిగా భావించిన చిత్త సంస్కారంతో మనవాళ్ళు స్వరాజ్య సమర శంఖారావం పూరించారు. పరాయి పాలన నుండి దేశాన్ని విముక్తం చేయటానికి దీక్షా కంకణాలు ధరించారు. స్వంత సుఖాలనూ సంతోషాలనూ త్యాగం చేసి, ప్రాణాలైనా బలిపెట్టడానికి తయారు అయినారు. జన్మభూమిపై మమకారంతో - బలీయమైన ఇంగ్లండు రాజ్యపు అధికార శక్తిని కొండను ఢీకొన్నట్లు ఎదుర్కొన్నారు.

ఇందుకు తగిన ఉద్యమస్ఫూర్తిని అందించగల మహా నాయకులు దేశంలో అవతరించారు. దేశ విముక్తికోసం ఉద్యమాలు నడిపించారు. ఆయుధాలు అంటుకోకుండా - సత్యాగ్రహ బలంతో — స్వాతంత్ర్యపోరాటం సాగించాలని ఉద్బోధిస్తూ, జాతికి స్ఫూర్తిని ఇచ్చిన గాంధీగారు - దేశమంతా ఆరాధించే మహా నాయకులు అయారు.

మన దేశ స్వాతంత్ర్య పోరాటం ముమ్మరంగా జరుగుతున్న ఆ రోజులలో — మనం మహాత్ముడిని గురించి తరచుగా స్మరించుకొంటూ ఉండే వాళ్ళం. ఆయన ఉపవాస దీక్షలో ఉన్నన్నినాళ్లూ - మనకు కడుపునిండా అన్నం తినాలని కూడా అనిపించేది కాదు.

నీవైతే ఒకానొకప్పుడు కంట నీరు పెట్టుకొనేదానవు. ఉపవాసాలతో ఆనాటి కానాడు కృశించి పోతున్న గాంధీగారి ఆరోగ్య స్థితిని గురించి దిగులు పడుతూ ఉండేదానవు.

" ఒక్కసారి గాంధీజీని చూడాలని ఉంది ! " .... అన్నావు ఒకసారి నాతో. ఏ కోరికా నన్ను ఎప్పుడూ కోరని నీ ఈ కోరికను తీర్చేది ఎలా - అని ఆలోచనలో పడిపోయేవాడను.

తన కంఠమున దాచి హాలాహాలం
తల నుంచి కురిపించి గంగాజలం
మనిషి శివుడవడమే గాంధీవరం - బాపు
ననుసరిస్తే చాలు మనమందరం !

జాతీయతనూ మానవతనూ ప్రబోధిస్తూ, గాంధీగారి అడుగుజాడలకు అంజలి ఘటించే గీతాలు జనం నోళ్ళలో ఆడుతూ ఉండేవి.

కదురూ కవ్వం ఆడటం మన పల్లెనాటి సంస్కారమే అయినా, కొన్ని మంచి అలవాట్లకు మనం దూరమే అవుతున్న సంధికాలంలో - గాంధీజీ మనకు మార్గదర్శి అయినాడు. స్వదేశీ ఉద్యమంలో భాగంగా - ఇంటింటా నూలు వడికే సంప్రదాయాన్ని మళ్ళీ మనం సిద్ధింపచేసుకొనడం ఆయన చలువవల్లనే!

నీవు కూడా జాతి పిత పిలుపుకు ప్రభావితురాలవు అయినావు. ఒకటికి రెండు మూడు రాట్నాలు కొని తెప్పించావు. నీవు రోజూ కొంతసేపయినా నూలు వడకటాన్ని నియమంగా పెట్టుకొనేదానవు. నాకు ఆ విద్య తొందరగా పట్టుపడలేదు. నీ సంతుష్టికోసమై - కొన్ని దినాలు శ్రమపడి నేర్చుకొన్నాను.

దేశమనియెడి దొడ్డ వృక్షం
ప్రేమ లను పూలెత్తవలెనోయ్
నరుల చెమటను తడిసి మూలం
ధనం పంటలు పండవలెనోయ్ !

ఈ నవయుగ వైతాళిక గీతమంటే నీకు ఎంతో ఇష్టంగా ఉండేది. సన్నని కూనిరాగంతో గీతాన్ని ప్రియంగా చదువుతూ ఉండేదానవు.

అటు జాతీయోద్యమ స్ఫూర్తితోను, ఇటు అధ్యాత్మిక చైతన్య దీప్తితోనూ వెలుగులు చిమ్ముతూ వెలువడుతూ ఉండేది — ముట్నూరి కృష్ణారావుగారి కృష్ణాపత్రిక. ఆ పత్రిక అంత ప్రభంజనం లాగా తెలుగునాట వీరవిహారం చేయటానికి వెనుక ఉన్న ఆత్మ ఆయనగారే! ఆయన శరపరంపరగా పత్రికలో వ్రాసే సంపాదకీయ వ్యాసాలు - పఠితల గుండెలలోకి సూటిగా దూసుకుపోయి - దేశాభిమానంతో ఉప్పొంగిపోయేట్లు చేయగలిగి ఉండేవి. మన పల్లెలలోనూ ఏ వీధి అరుగుల మీదో ఎవరో ఒకరు చదివి వినిపిస్తుంటే - పదిమందీ ఆసక్తితో వింటూ ఉత్తేజంతో ఉప్పొంగిపోయేవారు.

ఆ రోజులలో కృష్ణాపత్రిక రాక కోసం మన ఇద్దరమూ కూడా ఎంతో ఆతురతతో ఎదురుచూచేవాళ్ళం. ప్రౌఢమైన, కవితాత్మకమైన ఆ రచనా శైలీ, ఉత్తేజకరమైన భావ పుష్టీ - వీటి అన్నిటి వెనుకా ఉన్న ఆధ్యాత్మిక శక్తీ - పోటీలు పడి - పత్రికను చదివిస్తూ ఉండేవి.

ఇన్నిన్ని స్మృతు లిన్నిన్ని స్పందనల
పోగుపెట్టిన చిరస్నేహ భాగ్యనిధివి నీవు !

# 32

బువ్వ చిక్కుము కొడవలి బూని బయలు
దేరె వరి కోత కొరకు పాలేరు చాన
ఒక విచిత్రమ్మ యగు శోభ నొలుక బోసె
వడి శరద్వేళ మాగాణి పల్లెటూరు !

నేను పుట్టి పెరిగినది ఈ నా పల్లెతల్లి ఒడిలోనే ! కొన్ని నాళ్ళు చదువుల కోసమై పై ఊళ్ళకు వెళ్ళినా, తిరిగి వచ్చి — కుదురుకొన్నది ఈ నా గడ్డ పైననే ! ఇక్కడి కష్టమూ, సుఖమూ, సౌందర్యమూ, కురూపమూ, నైర్మల్యమూ, కౌటిల్యమూ - అన్నిటినీ కాచి వడపోశాను. ఒక చిన్న సౌందర్య రేఖకే కదలిపోతూఉండటం, ఒక్క కటువాక్యానికే కంపించి పోవడం — నాకు ఉగ్గుపాలతోనే అలవాటు అయినదేమో ! అందుకే - శారద ప్రభాతవేళ — మన ఊరి సొగసును చూస్తూ నడుస్తుండగా నా నోట విశ్వనాథ శారద నాట్యమాడింది.

ఋతువు ఋతువుకూ మారే రంగులను, శోభలను - రసోత్కర్షతో అనుభవించడం — ఎవరూ నేర్పకుండానే నీకు నీవై నేర్చుకొన్న విద్య. కాలానుగుణంగా జరుగవలసిన ఇంటి పనులను, వ్యవసాయపు పనులను_అకళింపు చేసుకొన్నావు. కర్షకవృత్తిలోని మెలకువలన్నీ గ్రహించటానికి నీకు ఎక్కువ కాలం పట్టలేదు. నేను నమ్ముకొన్న వృత్తిలో నీవూ భాగస్వామివై దోహదం చేశావు. నాకు ఎప్పటి కేది అవసరమో ఎరిగి వర్తిస్తూ — నా శ్రమభారంలో సమభాగం పంచుకొంటూ ఉండేదానవు.

కర్షక కార్మికుడు ఎంత కాయకష్టం చేసి అలసి సొలసి వచ్చినా, ఏనాటి కానాడు అతడిని తేరుకొనేటట్లు సేద తీర్చగలిగినది అతడి ఇల్లాలి చఋవదనం ! ఆమె చల్లని మాట అతడికి క్రొత్త ఊపిరిని పోస్తుంది అతడిని శ్రాంతుడినీ, స్వాదు స్వాంతుడినీ చేయగలిగినది - ఆమె కడగంటి చూపులోని అమృతాంశువు మాత్రమే !

ఉషకు గాడుపు పొంగున కుమ్మరిల్లి
సంజ కెంజాయ నాతప స్నానమాడి
వాబు దెమలించుచున్నాడు వల్లభుండు
భార్య ప్రోత్సాహమతనికి పట్టుగొమ్మ !

మహా నగరాలలో ఉండే నాగరీకులు పల్లె జీవితాన్ని గురించి ఏవో భ్రమలకు లోనవుతూ ఉంటారు.

నాకు బాగా జ్ఞాపకం — ఒకరోజు బొంబాయిలో ఉద్యోగం చేస్తున్న నా బాల్యమిత్రుడు ఒకడు వచ్చాడు. అతడు మన ఇంట మూడురోజుల పాటు ఉన్నాడు. తోటలోనివి, అప్పుడు కోసిన కూరగాయలతో, ఘుమఘుమలాడే వెన్న కాచిన నేతితో, ఎర్రని గడ్డ పెరుగుతో - నీవు పూట పూటా కమ్మని భోజనం పెట్టావు అతడికి ఇష్టం అని — మంచినీళ్ల కు బదులు కొబ్బరిబొండాలనీళ్లు ఇప్పించావు. నేను అతడిని మన తోటలోకీ, చేని గట్టుకీ - వాహ్యాళికి తీసుకు వెళ్ళాను. స్వాదిష్ఠమైన ఈ భోజనానికీ - పైరగాలికీ — పల్లె అందానికీ అన్నిటినీ మించిన మన ఆత్మీయతా భావానికీ - ఎంతగానో కరిగిపోయినాడు నా మిత్రుడు.

" ఎందుకు వచ్చిన ఉద్యోగం ! కొరమాలిన నగర జీవితం ! మీరు నిజంగా ఎంత అదృష్టవంతులు ! అందరూ అయినవాళ్ల మధ్య, అందమైన కల్మీ ఎరుగని జీవితం గడపటం కన్నా అదృష్టం ఏముంటుంది ! " .... అన్నాడు వాడు — తన దురదృష్టానికి చింతిస్తూ !

అక్కడే వున్న నీవు చిన్నగా నవ్వి అన్నావు.

" అంతా అందమే, ఆనందమే అయితే - అది జీవితం ఎట్లా అవుతుంది అన్నగారూ ! ఈ నిండుదనం వెనుక, ఈ కనిపించే అందం వెనుక - ఎంత స్వేదం, శ్రమా, నిరుపేదతనం - ఉన్నాయో ఎలా చెప్పను ! చూడండి — కవి దర్శనంలోని కర్షక కష్టాన్ని !

చూపులు చుమ్మలై సురిగి చూచెను నా నిరుపేద డొక్కలో
గాపుర మున్నదో కరవు కాంత, దరిద్రత తాండవించెనో
మూపుల మీద గద్దదిక ముప్పిరిగొన్నదో ? కష్టమందు సం
తాపము మాత్రమా తనువు దగ్ధమొనర్చిన దొక్క పెట్టుగన్!

కొంతసేపు మౌనం తరువాత నా మిత్రుడు నిట్టూర్చి ఇలా అన్నాడు.

" మామూలు మనిషి చూడలేని చీకటి కోణాలను సైతం కవి అయినవాడు చూస్తాడు. చూచిన దానిని అక్షరాలలో పొదిగి చిత్ర కల్పన చేస్తాడు. అందుకే కాబోలు - రవి కాంచనిచో కవి కాంచునే కదా " అన్నారు ! "

" ఋషి అయినవాడు మాత్రమే కవి కాగలుగుతాడు కనుక - అతడికి ఆ దర్శనం కలుగుతుంది ! " .... అన్నాను నేను.

ఏ చిన్న పల్లెటి అందం మనస్సును కదిలించినా, నాకు స్ఫురణకు రాక మానదు - ఆ నాటి మన సమార్ద్రి సంభాషణం !

# 33

మధ్యాహ్నపు కలత నిదుర నుండీ ఇంకా తేరుకొనకముందే ఎవరో వచ్చి - "బాబుగారూ !" .... అంటూ పిలిచారు. మోకాలివరకూ ఎగగట్టిన సీరుకావి పంచె, ముతక ఖద్దరు చొక్కా, పండిన పలుచని జుట్టు - నుదుటి ముడుతలలో నిలిచిన చెమటబొట్లు - వెంకయ్య ఒడలిన ముఖంలో సంతోషపు ఛాయలు.

"బాబుగారూ ! నా మనుమరాలికి కొడుకు పుట్టాడు. సాయంత్రం ఒక్కసారి మీరు వచ్చి పసివాణ్ణి దీవించి పోవాలి ! నా కూతురు మీకు మరీ మరీ చెప్ప రమ్మన్నది" .... అన్నాడు సంబరంగా. "అలాగే టోయ్ ! తప్పక వస్తానులే ! మునిమనుమణ్ణి ఎత్తుకున్నావన్నమాట !" .... అన్నాను భుజం తట్టి-

ఇప్పుడు నా జీవితంలో ఎదురయ్యే ఏ సన్నివేశమైనా — స్మృతిపథంలో చుట్టుకొని చుట్టుకొని నిన్ను స్పర్శించి రావలసిందే ! వెంకయ్య చాలా చిక్కుల్లో ఉన్నప్పుడు నీవు ఆదుకొని కొంత సొమ్ము సహాయం చేశావు. అందువల్లనే అతడు కూతురి పెళ్లి చేయగలిగాడు. అప్పటినుంచీ వెంకయ్య కుటుంబానికి నీవు ఆపదలో ఆదుకొనే దేవతవు. వారి ఇంట ఏ శుభకార్యం జరిగినా నీవు ప్రథమ తాంబూలం అందుకోవలసిందే ! ఇప్పుడు నీకు బదులుగా నేను వెళ్లాలి. నీవు మామూలుగా చేసే పనులు నేను చేయాలి. పసిబిడ్డకూ, పచ్చి బాలింతకూ-ఏమేమి అవసరమో - అన్నీ తెప్పించి ముందుగానే వెంకయ్య ఇంటికి పంపించాలి.

వెంకయ్యది అంతంత మాత్రపు సంసారం. మొదటినుంచీ కాయకష్టంతోనే గంపెడంత సంసారాన్ని ఈదుతూ వచ్చాడు. ఇహ, బ్రతికినన్నాళ్లూ ఈదుతూనూ ఉంటాడు.

రంగ దుత్తుంగ భంగ తిమింగిలాకు
లంబయిన వార్ధి దాటగలాడు నరుడు
నిన్ను దరియింప జాలడు నిక్కువంబు
సంకట కదంబ ! సంసార సాగరంబ !

ఏ ఏటి నీటినయినా దాటటానికి తెప్ప కావాలి. ఆ తెప్ప ఆర్థిక వనరు. అది లేనప్పుడు - అవుతుంది ఆ సంసారి బ్రతుకు ఏటికెదురీత ! అత్యవసరమైన వస్తువుల కోసం కూడా, నిత్యమూ ప్రాకులాడవలసిన అవస్థలో ఉండేవారిని గురించి - నీవు అమితంగా బాధపడుతూ ఉండేదానవు.

ఉష్ణుతో దొమ్మిది యున్న కాపురములు
నేయు గృహిణుల కే చిక్క లేదు
ఎవ్వ లేకున్నను నిరుగు పొరుగు కులాం
గనలకు జేయొగ్గి గైకొనుటకు
నిష్ట పడక, యున్నదే పెట్టి యక్కర
వాపుకొనెను మానవతుల కెందు
లేమిడి సంసార మేమొయి బరువుతో
గడపంగ నిక్కట్లు గలుగుచుండు !

అనుకొంటూ లేమిడిలో మునిగి తేలే ఇల్లాళ్ళను గురించి ఎంతో సహానుభూతిని ప్రదర్శిస్తూ - నీవు దిగులుపడుతూ ఉండడాన్ని నేను ఎరుగుదును.

దారిద్ర్యం గురించి నీవు ఒకనాడు చెప్పిన చిన్న కథ పంచతంత్రం లోనిది అనుకుంటాను - నేను ఎప్పటికీ మరువలేనిది.

దారిద్ర్య భారంతో కృంగిపోయిన వాడొకడు ఒకనాడు శ్మశానం పక్కగా నడుస్తూ ఉన్నాడు. సమాధి క్రింద - భూమితల్లి ఒడిలో ప్రశాంతంగా నిద్ర పోతున్న అసామీని చూచాడు ఆతతో అన్నాడు ఇలా -

" అన్నా ! ఒక్కసారి లేచి రావా ? నా భుజం మీది ఈ కొండంత బరువును - దరిద్రాన్ని - కాస్త చేయూతనిచ్చి దింపాలి నువ్వు ! ఈ బరువును ఇక మోయలేకపోతున్నాను. నా శక్తి అంతా ఉడిగిపోయింది. ఒక్కసారి దీన్ని నా మీద నుంచి దయతో దింపితే చాలు - నేను వచ్చి నీవు పడుకున్న చోటునే విశ్రాంతి తీసుకుంటాను బాగా అలసిపోయాను. ఇహ ఒక్క అడుగు కూడా వేయలేను. " సమాధి క్రింద నిద్ర పోతున్న భౌతికకాయం ఈ మాటలు వినటమైతే విన్నది కాని కదలలేదు, మెదలనూ లేదు ! దానికి బాగా తెలుసు- నిత్య దరిద్రుడిగా బ్రతికే కన్నా శవమై విశ్రాంతిగా నిద్రించటం మెరుగని !

కరుణతో కరిగిపోతూ, నీవు అప్పుడెప్పుడో చెప్పిన ఈ కథ - నన్ను ఇప్పటికీ వెన్నాడుతూనే ఉంది. అందుకే, మనకు కలిగిన దానిలో ఎంతో కొంత ఈ దరిద్రులకు ఇచ్చి సాయపడాలనే నియమాన్ని మనం ఇద్దరమూ పాటిస్తూ వచ్చాము. దరిద్ర నారాయణుల పట్ల నీకు కల సానుతాపం-కరిగి-నీ గుండెల నుండి కారుణ్యఝరిగా సాగివచ్చి నన్నున్నూ పునీతం చేసింది !

మలినుండై కడు డస్సి కుస్సి మది నున్నత్త్వాకృతిం దేజముం
దలయుం జీరయు దోసు వీడ జడుడై దైన్యంబునం బొంది దు
ర్బలుడై మెచ్చని వారి వేడ జను దౌర్భాగ్యాత్ముడౌ నిన్నెదం
దలపం గాంచి సురేంద్రుడై వెలయడే ! దారిద్ర్య నిద్రావణా !

లాభమ్మా లాభమ్మా ఏమి లాభమ్మా
కొడుకుల కంటేను కోటి లాభమ్మా !

అనుకొంటారు మనవాళ్లు కోటి ఆశలతో ! పున్నామ నరకం నుండి రక్షించటం మాట ఏమో కాని, కొడుకులు ఉంటే కోడళ్ళు రాక మానరు ! అంతో ఇంతో ముడుపులు మూట కట్టుకుని రాక మానరు !

కొడుకంటూ పుట్టాడు కొంటె కోణంగి
కోడలంటూ వచ్చింది రవ్వల్ల రాణి !

వాడు కొంటె కోణంగి అయినా, కొదమ సింహమైనా, ఆ వచ్చే కోడలు కొంచెమో ఘనమో ఏటన్నా కొంగున కట్టుకుని తేక మానదు ! అయినా, ఆ కొడుకును కన్న అమ్మకు – అత్తకు – ఆ పిల్ల కంటి నలుసు కాకా తప్పదు! ఇది – ప్రపంచ పద్ధతి ! యుగాలుగా స్త్రీ మనస్తత్వానికి అద్దం పడుతూ ఉన్న పద్ధతి ! అత్తా కోడళ్ల మధ్య సయోధ్యను సాధించలేని జాతిలో ప్రబలుతున్న వైర బాంధవ్య పద్ధతి ! ప్రపంచంలో ఎక్కడో ఒకచోట చాలా సకృత్తుగా ఇందుకు భిన్నంగా జరిగిన సంఘటనలు కనిపిస్తాయి. నీరెండ నిర్మలంగా కాస్తూ ఉండగానే – పువ్వులు రాలినట్లు సన్నని వానజల్లు పడటం ఎంతటి మనోహర దృశ్యమో, అత్తాకోడళ్ళు అమ్మా కూతుళ్లవలె మెలగటం – అంతటి హృదయ రంజకమైన దృశ్యం !

నీవు ఈ ఇంటి కోడలివై వచ్చిన తరువాత – ఈ ఘన నిష్పురమైన సన్నివేశాన్ని ఎన్ని మారులు చూచానో ! ఒక దేవతకు కొడుకునైనందుకూ, ఇంకొక దేవతను సహచరిగా పొందినందుకూ ఎన్ని మారులు ఉప్పొంగిపోయి – కృతజ్ఞతాభరితచిత్తంతో – సర్వేశ్వరునికి వందనాలు అర్పించుకొన్నానో !

కౌసల్యకూ – కోడలు సీతకూ మధ్య నెలకొన్న సౌందర్యమయమైన బాంధవ్యమేదో – నీకూ మీ అత్తగారికీ మధ్య స్థిరపడింది ! విశ్వనాథ కవి భావిస్తాడు – ఈ అపురూపమైన బాంధవ్యాన్ని ఇంత అందంగా !

రామచంద్రుడు విల్లు పట్టడం నేర్చిన దగ్గరనుంచీ – కౌసల్యకు కుమారుడు దూరమైనాడన్న చింత పట్టుకున్నదట ! బిడ్డలు తమ ఒడి వీడినప్పుడు ఏ తల్లికైనా తప్పని ఆవేదన ఇది ! అప్పుడు – చిరబాంధవిలాగు చిన్ని సీత–కోడలై వచ్చింది. అప్పటినుంచీ కౌసల్యకు –

సీత యన్నమ్మా స్నానమ్మా సీతే జపము
సీత శ్రీరామచంద్రుడు సీత యయ్యె

బట్టమహిషికి లోభికి బరమమైన
ధనమె యైనట్లు సౌఖ్య సాధనములెల్ల !

నీవు కోడలిగా వచ్చిన దగ్గరనుంచీ అమ్మకు నీ పైన ప్రీతి జనించింది. చిన్న వయస్సులో ముద్దరాలివై వచ్చిన నిన్ను ఆమె గారవంతో అక్కున చేర్చుకొన్నది. నీవు కూడా అమ్మ కనుసన్నలలో మెలగుతూ - గృహిణీత్వపు ధర్మాలన్నిటినీ ఆమె శిక్షణలో నేర్చుకొంటూ ఎదిగివచ్చావు అమ్మ నీకు స్వయంగా కొసరి కొసరి అన్నం వడ్డించటమో, నీవు ఆమెకు రాత్రిపూట కాళ్ళు పట్టటమో చూచినప్పుడు నా మనస్సు ఏదో పరమార్ధ్రమైనభావంతో తనిసిపోయేది !

ఎవరి నోటనైనా, అమ్మను గురించి ఒక్క నిష్ఠుర వాక్యమైనా నీవు సహించేదానవు కాదు ఆమె పైన ఈగవాలటం కూడా నీకు ఇష్టం ఉండేది కాదు! అమ్మకు వయస్సు పైనపడి - శరీరం రోగగ్రస్తమైనప్పుడు నీవు ఎంతో శ్రద్ధాసక్తులతోను, ప్రేమానురాగాలతోను, ఆమెకు సేవలు చేశావు ఎప్పుడూ ఆయాసంతో బాధపడుతూ ఉండే అమ్మకు నీవు వీపుమీద చెయ్యివేసి నిమురుతుంటే ఎంతో ఉపశమనంగా ఉండేది.

నిన్ను ఎప్పుడూ 'అమ్మాయి' - అని కాని పిలిచేది కాదు అమ్మ మీ ఇద్దరి అతిలోకమైన బాంధవ్యాన్నీ చూచినప్పుడు - అమ్మ పాడుతూ ఉండే 'సీత గడియ' - అనే అందమైన జానపద గీతం జ్ఞాపకం వస్తూ ఉండేది. "పరగ కౌసల్యకు పానుపు పరచి, అత్త కౌసల్యకు ఉడుగులు వత్తి"-యూమె ప్రొద్దుపోయి పడకటింటికి చేరిందట జానకి. ఈ ఆలస్యానికి రఘురామునికి కోపం వచ్చి తలుపు గడియపెట్టుకు పవ్వళించాడు. సీతమ్మ తలుపుతియ్యమని ప్రాధేయ పడింది. రామయ్య బిగుసుకుపోయాడు. తలుపు తియ్యలేదు సరికదా-బెట్టుసరితో-

నీవు నిల్చుంటేను నాకేమి సీత-పువ్వులు బుక్కాయ అది నాకు తోడు
నీవు నిల్చుంటేను నాకేమి సీత-గంధమ్ము కస్తూరి అది నాకు తోడు-

అంటూ భీష్మించుకు కూర్చున్నాడు జానకిరాముడు ! అత్తచాటు కోడలు-అప్పుడేమి చేయగలదు- అత్తగారి వద్దకు వెళ్ళి ఆమె కుమారరత్నం చేస్తున్న ఆగడాన్ని చెప్పడం కన్నా ! కౌసల్య బహు ప్రియంగా కోడలిని వెంటబెట్టుకొని కొడుకు వద్దకు వచ్చి -

దశరథుని పుత్రుడవు జనకు లల్లుడవు
భూదేవి అల్లుడవు బుద్ధటర నీకు !

అంటూ మందలించి తలుపు తీయిస్తుంది. దిగివచ్చి రాముడిలా అన్నాడట.

అమ్మ నీ కోడలిని అతి గారవమున
నలినాక్షి పెంచితే నన్ను గైకొనునా !

ఆ మాటే ఎప్పుడైనా నేనూ అమ్మను అడగాలని అనిపిస్తూ ఉండేది నా కొంటెమనసుకు !

ప్రియతమా!

# 35

ఆముక్తమాల్యదలోని ఒక రసవత్తరమైన సన్నివేశాన్ని చదువుతున్నాను. ఈ నాటి సాయంవేళ, "పన్నీటితో కదంబము చేసి పూసిన మృగనాభి పస రాచనగరు దెలుప" – పాండ్యదేశపు రాజుగారు 'భోగినీ సంగతికి' బయలుదేరినారు. దారిలో ఒక సజ్జన గోష్ఠిలో కొన్ని హిత వాక్యాలను విని విరక్తి కలిగి వెనుకకు మరలినాడు.

ఎక్కడి రాజ్య వైభవాలు! ఎక్కడి భోగాలు! ఏటి సంభ్రమాలు! బుద్బుద ప్రతిమమైన శరీరమును నమ్ముకొని వెఱ్ఱినైతినే! .... అని పశ్చాత్తప్తుడయినాడు రాజు. సభాముఖంగా తత్త్వవిచారం చేసి నిర్ధారించాలని సంకల్పించాడు.

విల్లిపుత్తూరులో నెలకొన్న మన్నారు స్వామివారికి చలనం కలిగింది. తన మెడలో తులసీదామం సర్దుతూ మురిసిపోతున్న విష్ణుచిత్తులవారి పైన కన్ను పడింది. అంతే – స్వామివారు ఆజ్ఞాపించారు ఆ అమాయక భక్తశిఖామణిని!

పాండ్యరాజు సభకు వెళ్ళి అక్కడ చేరిన దుర్మదాంధుల శుష్క వాదనలన్నీ ఖండించి, తన మహిమను ప్రకటించవలసినదనీ, ఆ రాజు ఇస్తానన్న విద్యాశుల్కాన్ని గ్రహించి, రాజును విష్ణుభక్తునిగా చేయవలసినదనిన్నీ ఆదేశించాడు స్వామి

ఆ మాటలకు అదరిపోయినాడు – ఆ "ద్వయ పద్మ వదనుడు! స్వామి వారి ముందు సాగిలపడి – అంటున్నాడు ఇలా!

గృహ సమ్మార్జనమో, జలాహరణమో శృంగార పల్యంకికా
వహనంబో వనమాలికా కరణమో, వాల్లభ్య లభ్య ధ్వజ
గ్రహణంబో వ్యజనాత పత్ర ధృతియో ప్రాగ్దీపికారోపమో
నృహరీ వాదములేల లేరె యితరు ల్నీలీలకుం బాత్రముల్ !

ఈ పద్యం నీకు ఎంతో ఇష్టంగా ఉండేది. పదేపదే చదువుతూ తన్మయీభావం పొందేదానవు.

విష్ణుచిత్తుని వినయశీలతనూ భక్తి తత్పరతనూ, ఎంత రమ్యంగా వర్ణించారు రాయలవారు! గృహ సమ్మార్జనము దగ్గరనుండీ ప్రాగ్దీపికారోపము వరకూ తాను అవలీలగా, అతి ప్రియంగా, చేయగలిగిన పనులు. కాని, రాజాస్థానంలో విద్వత్ వాదనలా!

" స్వామి ముందు చేతులు నలుపుకుంటూ నిలువబడిన విష్ణుచిత్తులవారు మూర్తి కట్టినట్లున్నారు ఈ పద్యంలో ! ".... అనేదానవు రసమయ చిత్తంతో !

నేను నవ్వుతూ అనేవాడను - " కావ్య రసాస్వాదనతో ఇంతగా తదేక భావన కలిగితే ప్రమాదం ! నీవు కూడా పెరియాళ్వారిణివి అవుతావేమోనని భయం ! "

అవును ! నీవు ఏ గ్రంథాన్నయినా పైపైన చదివి ఊరుకొనేదానవు కాదు ! కావ్య గత సౌందర్యాన్నీ, సన్నివేశ చమత్కారాన్నీ తరచి తరచి మననం చేసుకొని రసానుభూతిని పొందుతూ ఉండేదానవు. మన ఇద్దరకూ కూడా అది ఒక రస నిర్భరమైన అనుభవంగా, అలవాటుగా, మారింది

అనుకోకుండా ఒకరోజున మన ఇంటికి శర్మగారు వచ్చారు. ఆయన నాకు విద్యార్థిదశలో తెలుగూ, సంస్కృతమూ బోధిస్తూ ఉండేవారు. విస్తారంగా శాస్త్రాధ్యయనం చేసిన విద్వాంసుడు, మేధావి, స్వయంగా కవి. ఉభయ భాషల పట్ల నాకు ఉండిన అపారమైన అభిమానం వలన ఆయనకు దగ్గరవాడనైనాను. నేను విద్యార్థిదశను దాటి గృహస్థును అయినా, శర్మగారు పదవీ విరమణ చేసినా, మా ఉభయుల మధ్య ఆత్మీయత వర్ధిల్లుతూనే ఉన్నది.

మన వివాహమైన తరువాత, మొదటిసారి ఆయన మన ఇంటికి వచ్చినప్పుడు నీవు ఎంతో ఆనందించావు. నాకు చదువు చెప్పిన గురువుగానే కాక, మన ఇంటిని పావనం చేయటానికి వచ్చిన పుంభావ సరస్వతీ పుత్రునిగా భావించి ఎంతో మన్నన చేశావు.

అప్పుడాయన మన ఇంట ఉన్న రెండు రోజులూ కడుపునిండా విద్వద్గోష్ఠుల విందులే! ఎన్నో స్వారస్యమయమైన విషయాలు చర్చకు వచ్చేవి. ఒకొక్క విషయాన్ని గురించి ఎంతో విపులంగా విశ్లేషించి వివరించి చెప్పేవారు శర్మగారు

ఆయన తిరిగి వెళ్లేటప్పుడు మళ్లీ మళ్లీ వస్తూఉండవలసిందిగా అభ్యర్థించావు. క్రొత్త పంచెలచాపును తెప్పించి వారికి సగౌరవంగా సమర్పించావు. అప్పుడు నీ సాహిత్య ప్రియతను మెచ్చుకొంటూ - శర్మగారు నవ్వుతూ నా భుజం తట్టి ఈ పద్యం చదివారు.

కవితా కన్యక గుణములు
కవి కన్న రసజ్ఞుడెరుగు గవి రే మెరుగున్
భువిలో గన్యక గుణములు
ధవుడెరుగును గాక కన్న తండ్రేమెరుగున్ !

నీవు దిద్ది తీర్చుకొన్న ఇల్లు ఇది ; నీవు తీర్చి దిద్దుకొన్న మనిషిని నేను ! ఈ ఇల్లూ, ఈ మనసూ, ఇంత విశుద్ధంగా ఉండడంలో ఆశ్చర్యం ఏముంటుంది కనుక !

స్వచ్ఛత - నీకు జన్మతో సంక్రమించిన వరం ! లేకపోతే - నీవైనా, నీకు సంబంధించిన వస్తువేదయినా, ఎప్పుడూ కడిగిన ముత్యంవలె ప్రకాశిస్తూ ఉండడం ఎట్లా సాధ్యమవుతుంది !

ఇంటి శుభ్రత విషయంలో మాత్రం నీవు చండశాసనరాలవుగా ఉండేదానవు. పొరపాటున కూడా రవ్వంత దుమ్మూ ధూళీ పేరుకొని ఉండటం సహించేదానవు కాదు. రోజూ ఇల్లు సర్దటమూ, ఎక్కడి వస్తువులక్కడ అమర్చడమూ విధి విధాయకంగా నీవు స్వయంగా చేసేదానవు " ఎందుకు ఈ చిన్న చిన్న పనులకోసం అంతగా శ్రమపడతావు! ...." అన్నాను ఒకసారి.

ఎవరి పనులు వారు సవరించుకొను నెడ
మనకు నింత దురభిమానమేల ?
కష్టపడుట వలన గౌరవమ్మువిపోదు
మానవత్వమునకు మచ్చ రాదు

అంటూ నవ్వుతూ సమాధానం చెప్పావు నాకు !

" పరిశుభ్రత నాకు దైవంతో సమానం " .... అంటూ ఉండేదానవు తరచుగా. " ఇంటిని చూచి ఇల్లాలిని చూడు " .... అని మనవాళ్లు మాటల మధ్య అనుకొనే సామెత — నీ పట్ల సార్థకమైనట్లు ఉండేది.

రెడ్డొచ్చె రెడ్డొచ్చె రెడ్డొచ్చెనమ్మా !
వీరభద్రా రెడ్డి విచ్చేసెనమ్మా !
పొద్దున్నె మా రెడ్డి పొరకూడ్చిపించు
నిలువెల్ల నడి వీధి నీరు జల్లించు
సందు గొందులలోన సాన్పుపోయించి
చీకట్ల పసుపు కుంకుమలు పూయించు
రంగవల్లుల నూరు రాణింపజేయు !

ఎప్పటిదో - ఈ జానపదగేయం జ్ఞాపకం వచ్చేది — రోజూ ప్రొద్దుటివేళ కళకళలాడుతూ ఉండే వీధివాకిళ్లను చూచినప్పుడు ! రెడ్డిరాజుల కాలంనాటి పారిశుద్ధ్య వారసత్వమే కాబోలు ఇదంతా ! .... అని అనుకొంటూ ఉండేవాడను తరచుగా.

ఉదయాన్నే వీధి వాకిలి శుభ్రం చేసుకోవడమనే ఈ మన సంప్రదాయం ఎంత ప్రాచీనమైనదో ! ఊడ్చి, కలయంపిచల్లి, ముగ్గులు పెట్టిన గడప - అలంకార శోభితంగా, మంగళకరంగా, కనుల పండుగ చేస్తుంది.

ఈ వీధి వాకిలి శుభ్రత విషయంలో పట్టణాల కంటె గ్రామవాసులకు పట్టింపు ఎక్కువ. క్రొత్తగా కాపురానికి వచ్చిన కోడలయినా సరే - ఈ వాకిలి ఊడవటం కోసం - ఇంకా చీకటి ఉండగానే లేచిపోవలసిందే !

అత్తల యాడుబిడ్డల భయంబొకవంకయు గోర్కె వేరెడం
జిత్తములాగ గ్రొవ్వెదయు జీరయు వే సవరించి తూగుమై
మత్తున నున్న వల్లభుని మంచము మెల్లన వీడి దీనయై
బిత్తరి కోడలిల్వెడలె వేకువ బ్రాచి పనుల్వొనర్పగన్ !

ఇంత హృద్యంగా వర్ణిస్తాడు ఈ సన్నివేశాన్ని - జానపదుల జీవనాడిని ఎరిగిన కవి !

భర్త కౌగిలి నుండి విడి వడి - వేకువజామున పడకగది వదలి రావడం పాపం క్రొత్త కోడలికైనా తప్పదు ! చీకట్లు విడలక ముందే వాకిళ్ళు, అద్దాలు కావాలన్న నియమం అంత కఠినమైనది మరి !

అందరూ మామూలుగా చేసే ఇంటిపనులే నీవూ చేస్తావు. కానీ, ఆ చేయటంలో ఎంత విలక్షణత ! శుచి, శుభ్రతలతో పాటు ఎంత చిన్న పనినయినా అమిత శ్రద్ధాసక్తులతో చేసేదానవు. పని విషయంలో నీవు ఏమాత్రమూ అలసత్వాన్ని సహించి ఎరుగవు.

మూర్తీభవించిన శ్రద్ధవు - శుచివి, - నీ పర్యవేక్షణలో మన మామూలు పల్లె ఇల్లు - స్వర్గధామమై భాసించింది. ఏ మూల చూచినా, నీ చేతి సవరింపుల ప్రత్యేకత ఏదో గోచరిస్తూ ఉండేది !

నీ చల్లని హస్త స్పర్శ ఈ మన నివాసానికి ఒక సౌందర్య దీప్తిని అద్దినది. శుచిమంతమైన, శోభస్కరమైన ఆ దీప్తి నా అంతరాత్మను కూడా వెలిగించింది !

నా సొగసు టింట జిన్ని రత్నంపు దీప
మిడికొనిన రీతి పదును చేయించుకొన్న
నాదు పొలమున సురగంగ బోదెకొదుగు
లీల నా యాత్మ నీవు వెలిగించినావు !

ఆ వెలుగు రేఖకు అనమాలు ఈ అక్షర నీరాజనం !

# 37

పంజరంలో పచ్చని రామచిలుక - చూడటానికి ఎంత అందంగా ఉన్నా నాలో అంతులేని అనుకంపను కలిగిస్తుంది. అవధి లేని ఆకాశవీధిలో - తన చిత్తానికి వచ్చినట్లు ఎగిరే స్వేచ్ఛావిహంగానికి - కాళ్లకు బందీలు వేసి కట్టి వేయడం అమానుషమని అనిపిస్తుంది.

స్వేచ్ఛా ప్రవృత్తి - మనిషికైనా పక్షికైనా ఒక్కటే ! స్వతంత్ర భారతంలో కన్నుతెరచిన నేటి పౌరునికి తెలియదు - దేశం పరకీయమైనప్పటి దుర్భర స్థితిగతుల తీరుతెన్నులు ! ఎవరి ఇంట వారే ఒదిగి ఉండవలసి రావట మేమిటో - అప్పటి అస్వతంత్ర జీవనులైన భారతీయులందరూ ఎరుగుదురు.

ఒక్క పెట్టున జాతి అంతా స్వేచ్ఛావాయువుకోసం దద్దరిల్లిపోయింది. దేశభక్తితో కైపెక్కిన కవులు కలాలను ఆయుధాలు చేసుకొని విజృంభించారు. ఆ కవిత్వాల కైపు కొంత నీకూ నాకూ కూడా ఎక్కింది !

ఏ పూర్వ పుణ్యమో, ఏ యోగ బలమో
జనియించినాడ వీ స్వర్గ ఖండమున
ఏ మంచి పూవులన్ ప్రేమించినావో
నిను మోచె ఈ తల్లి కనక గర్భమున !

అంటూ, మహా తన్మయతతో పాడుకొనేవాళ్లం. దేశ విముక్తి ఉద్యమంలో నడుముకట్టుకుని దూకిన మహనీయులను మహా ప్రీతితో స్మరించుకొంటూ ఉండేవాళ్ళం !

ఆ రోజుల్లోనే అనుకొంటాను - ఒక చల్లని మాట చెవులకు తాకింది. గాంధీగారు తనంత తానుగా ఆంధ్రదేశానికి తరలివస్తున్నారని ! ఆ మాట విన్నప్పటి నీ సంభ్రమ సంరంభం ఇంతా అంతా కాదు ! పాపను తీసుకువెళ్లి గాంధీ మహాత్ముని దర్శించుకోవాలని ఉబలాటపడిపోయావు.

ఆయనకోసం ఆంధ్రావళి అంతా విరగబడి వచ్చింది. పిట్టంత మనిషి గాంధీజీ ! ఆయనలో ఏనుగంత ధార్మిక శక్తి బ్రహ్మతేజస్సుగా దృశ్యమానం అవుతున్నది. కంటి తుదలలో ఒక కారుణ్యరేఖ తొణికిసలాడుతున్నది. సత్యాహింసల సాత్త్వికగుణం వెన్నెల మడుగై ఆ బడుగు దేహాన్ని కాంతిమంతం చేస్తున్నది .

వెన్నపూసా మనసు, కన్నతల్లి ప్రేమ
పండంటి మోముపై బ్రహ్మతేజస్సు !

ఉప్పెనలాగు కమ్ముకొన్నారు జనం మహాత్ముణ్ణి! మూర్తీభవత్ భారతీయ ఆత్మను,

చక చక నడిస్తేను జగతి కంపించేను
పలుకు పలికితేను బ్రహ్మవాక్యేను !

సహాయ నిరాకరణోద్యమాన్ని గురించీ, జాతీయ పునర్నిర్మాణ కార్యక్రమాల గురించీ, గాంధీజీ ఆనాడు ఉపన్యసించారు. వచ్చినవారంతా క్రొత్త ఊపిరులూదుకొని ఉత్తేజితులైనారు. మహాత్ముని స్వరాజ్య నిధికి ఎవరికి చేతనయినట్టు వారు సహాయం చేశారు. నీవు నా వంకకు ఒక్కసారి చూచి ముందుకు కదిలావు. ఆ చూపులోని అర్థాన్ని అందుకొన్నాను నేను. యశోధరను ఎత్తుకుని నీ వెనుకనే నడిచాను.

జనం మధ్య నుంచీ బహు ప్రయత్నం మీద త్రోవ చేసుకొని నీవు ఆ తేజస్వి తుని వద్దకు చేరుకొన్నావు చేతికి ఉన్న నాలుగు బంగారు గాజులు తీసి ఆయన చేతల్లో పెట్టి – " దేశ విముక్తి యజ్ఞానికి ఇదీ ఒక చిన్న సమిధ. బాపూ! స్వీకరించండి! " .... అంటూ నమస్కరించావు నేనూ నమస్కరించి, పాపచేత మ్రొక్కించాను మహాత్ముడికి.

అప్పటి నుండీ నియమంగా మనం ఖద్దరు వాడుక మొదలుపెట్టాము. మనవాళ్లందరిచేతా ఖద్దరు కట్టించే ప్రయత్నం చేస్తూ వచ్చాము

శీత ధరాధర శేత్వాంతర నర
నారులతో స్వాతంత్ర్యరథం
భారత భూ పతనాభ్యుదయమ్ముల
పడి లేచే స్వాతంత్ర్యరథం -

ఒక్కుమ్మడిగా కదిలింది జనసందోహం. ఎవరి శక్తిని అనుసరించి వారు మాతృభూమి విముక్తికోసం నడుంకట్టి నడిచారు. అది ఒక ఊపు. ఆ గాలినీ, దేశభక్తి పూరిత వాతావరణాన్నీ అంత బాగా ఎరిగిన మనం – ఇప్పటి రాజకీయపు స్థితిగతులనూ చూస్తూనే ఉన్నాం.

నాకు బాగా జ్ఞాపకం – నీవు యశోధరకు దేశభక్తిని ఉగ్గుపాలతో రంగరించి పోస్తూ ఉండటం. పాపకు తల దువ్వుతూనో, బొట్టు పెడుతూనో, ఈ గేయాన్ని పాడుతూ ఉండేదానవు – ఇలా -

దేశమును ప్రేమించుమమ్మా
మంచి అన్నది పెంచుమమ్మా
వొట్టి మాటలు కట్టిపెట్టి
గట్టి మేల్ తలపెట్టుమమ్మా !

ఈ సాయంత్రం సంధ్య చీకట్లు ముసురుతూ ఉండగా - ఒక్కడనే కూర్చున్నాను, ఏదో పుస్తకం చేత పట్టుకుని. ఎక్కువసేపు అలా కూర్చుని చదవలేకపోయాను అక్షరాల మధ్య అమృతమయంగా తొంగి చూచింది నీ రూపం ! నీవు అలా సాక్షాత్కరించడం నాకు ఏమాత్రమూ ఆశ్చర్యం అనిపించలేదు - నిన్ను అనుక్షణమూ ధ్యానిస్తూ ఉండటమే ఇప్పటి నా ప్రవృత్తి కనుక !

మెలగుచున్నావు నేత్ర నిమీలనమున
మెలగుచున్నావు వీక్షణోన్మీలనమున
నిన్ను నిరతంబు ధ్యానించుచున్నవాడ !
దేవి ! వీనికి వేరొండు దృష్టి లేదు !

అన్నిటికన్నా ఎక్కువగా నీవు అక్షరాలలోనే నివాసం ఏర్పరచుకొని ఉంటావని నేను ఎరుగుదును - వాగ్దేవి భక్తురాలవు కనుక ! ఎందరో గొప్ప కవులూ పండితులూ మన ఇంట కాలు పెట్టడం - నీ ఈ సారస్వతప్రీతి చేతనే !

నా గురుదేవులు శర్మగారి పనుపున సాహిత్యమూర్తులు కొందరు మన ఇంటిని పావనం చేస్తూ వచ్చారు అలా మన ఇంటికి ఆగంతుకంగా వచ్చినవాడు రామశాస్త్రి. చేతిలో తన అసంపూర్ణ కావ్యప్రతిని పట్టుకు వచ్చాడు వచ్చినవాడు కవి - అని విని - నీవు అతడికి సకల మర్యాదలూ చేశావు. అతని స్నానమూ, జపానుష్ఠానమూ అయిన తర్వాత, విందు భోజనం అమర్చి పెట్టావు.

సిగ్గు పడుతూనే అన్ని మర్యాదలూ స్వీకరించుకొన్నాడు శాస్త్రి. నివురు గప్పిన నిప్పులాగు - పేదరికం మాటున తన పాండిత్య ప్రతిభను దాచుకొన్నవాడు.

ఆ రాత్రి ఆరుబయలున వెన్నెలలో తన కావ్యాన్ని చదివి వినిపించాడు శాస్త్రి. ఒక వైపున వెన్నెలలో తడిసిపోతూ, మరొక వైపున కావ్య గత మాధుర్యంలో తేలిపోతూ - ఇద్దరమూ ఒక రస నిర్భర స్థితిలో కూర్చుండి పోయాము అంతసేపూ !

పల్లెలో పుట్టి పెరిగిన ముద్దరాలు ఒకతె పరదేశంలో ఉన్న పెనిమిటి కోసం కలవరిస్తున్నది. ఇదుగో. వస్తానని వెళ్ళినవాడు ఎన్నాళ్ళకూ తిరిగి రాలేదు. ఆమె దిన దినమూ కళ్ళలో వత్తులు వేసుకుని ఎదురు చూస్తున్నది- అతడి రాక కోసం ! ఎటు వైపు నుండి వస్తాడోనని ఎదురు తెన్నులు చూస్తున్నది. కనుల నిండా కలుపుకొన్న మూర్తికోసం - కంటి కానినంతమేర చూస్తూ ఉండటం తప్ప ఎవరికీ చెప్పుకోలేని సిగ్గరి ఆ ముగ్ధ !

అప్పుడే ఒక కమ్మ తెమ్మెర తెర - ఆ బేలను తాకుతూ అనునయ పూర్వకంగా స్పృశించింది ! అప్పుడు వీచిన గాలి తెరను ఆమె ఆత్మీయునిగా చేసుకొన్నది. ఆయన గాటికి సందేశం పంపుకొంటున్నది ఆ గాలితో ! ఇదీ కావ్య వస్తువు.

' వాయు సందేశ కావ్యం ' ఆపాత మధురంగా ఉన్నది. ఆ పదహారేళ్ల పల్లె పడుచుతో తాదాత్మ్యతను పొందుతూ కవి విరహాన్ని వెళ్లబోసుకుంటున్నాడు. అది ప్రౌఢ విరహం కాదు అత్యంత సుకుమారంగా ఒక నూత్న వధువు అనుభవించే విరహ స్థితి ! వికిలీ విడలని విరి కన్యక ఎద లోతున దాగిన ముగ్ధ మౌన విరహం !

అంతా విని, నీవు ఈ పద్యాన్ని చదివావు.

పూరి కొట్టము పెద్ద గాడ్పునకు జెదర
లోన దిగు వాన సోనల నానకుండ
గడువు దినమని గోడపై నిడిన వ్రాత
జేతు లడ్డముపెట్టి ప్రోచెడిని గృహిణి !

భర్త దూర దేశానికి వెళుతూ, ఇన్నాళ్లకు తిరిగి వస్తానని గడువు పెట్టిన మాటను ఆమె గోడ పైన గీతలుగా గుర్తు వ్రాసుకొన్నది. గాలీ వర్షం వచ్చింది ఒకనాడు. పూరి కొంప చూరు నుండి వర్షధారలు దిగి, గోడల మీదుగా కారుతూ ఉన్నాయి. గుడిసెలో తడిసిపోతున్న ఇతర వస్తువుల గురించి ఏమీ పట్టలేదు ఆ ఇల్లాలికి. అతడు వస్తానన్న తేదీని వ్రాసుకొన్న గోడ పైన వ్రాత ఎక్కడ కరిగిపోతుందోనన్న భయంతో ఆమె చేతులు అడ్డంగా పెట్టి - ఆ గోడ పైన వ్రాతను కాచుకొన్నదట !

ఇప్పటి వరకూ విన్న సందేశ కావ్యంలోని నాయికకు సజీవ రూపకల్పన లాగు అమరిన ఈ పద్యం విని రామశాస్త్రి కదలిపోయినాడు. నీ విజ్ఞతకూ వైదుష్యానికీ ముగ్ధుడైనాడు.

ఆ తరువాత, ఆ కవిని ప్రోత్సహించి కావ్యాన్ని పూర్తిచేయించే భారాన్ని నీవు పైన వేసుకొన్నావు. తన గ్రంథాన్ని అచ్చులో చూసుకొనే ఆనందాన్నీ అతడికి కల్పించిన గౌరవం నీకే దక్కింది !

ఆ విధంగా - అక్షర సరస్వతిని అర్చన చేయడం మన ఇద్దరకూ జీవ ధర్మం అయిపోయింది. అప్పటి నుండీ ఈ మన పల్లె ఇల్లు శారదా నిలయంగా మారిపోయింది !

ఇట్టి ముద్దులాడి బాలుడేడ వాడు వాని
బట్టి తెచ్చి పొట్ట నిండ బాలు వోయరే !

తిరువేంకటాచలాధిపుని, శ్రీనివాసుని - బాలకృష్ణుని రూపంలో లాలించి ముద్దుచేస్తున్నారు అన్నమాచార్యులవారు ! అంతటి స్వామిని అడ్డాలలో బిడ్డగా ఊహించి ముద్దులాడడం ఆ దివ్య సంకీర్తనాచార్యులకే చెల్లింది !

పాటలో, మాటలో, పద్యంలో-ఎక్కడ రవంత వాత్సల్యభావం కనిపించినా, తలమునకలుగా రస పరవశులం అయ్యే గుణం మన ఇద్దరకూ ఉన్నది. మనలోని వాత్సల్యభావాన్ని తొలుత పొంగులెత్తించినది మన బిడ్డ యశోధ !

పాలు త్రాగే పసివయసునాటి యశోధర రూపం ఇంకా నా కనులకు కట్టినట్లుగానే కనిపిస్తున్నది. బిడ్డ ఎంత ఎదిగి పెద్దఅయినా, తల్లిదండ్రులకు మాత్రం ఎప్పటికీ పసిపాపగానే కనుపిస్తూఉండడం ఎంత విచిత్రమయిన సంగతి!

అప్పుడే అమ్మాయి ఎదిగివచ్చింది - నీ లాలనలో, నియమబద్ధమైన పెంపకంలో, ఇంటా బయటా, వివేకంతోనూ, విచక్షణతోనూ మెలగటం నేర్చుకొన్నది. మన పాప పదిమందిలో నేర్చుకొన్నది పాఠశాల చదువు. సత్య శివ సుందరంగా - జీవితం గడపటానికి కావలసిన జీవిత పాఠాలు నేర్చుకొన్నది మాత్రం నీ ఒడిలోనే !

పరికిణీ ఓణీ వేసుకొన్న యశోధర - కూనిరాగం తీస్తూ వాకిలి ముందు ముగ్గు పెడుతుండడం చూస్తూ ఉన్నాను. పాలు త్రాగటానికి మారాము చేసే పాలబుగ్గల పాప ఇంతగా ఎప్పుడు ఎదిగింది ! ఏదో క్రొత్త సంగతి అప్పుడే గ్రహించినట్లు ఆశ్చర్యం కలిగింది. వంటఇంట పనిలో ఉన్న నిన్ను పిలిచి అదే మాటను అడిగాను. నీవు నవ్వుతూ నా భ్రమను పోగొట్టావు ఈశ్లోకాన్ని చదివి-

అనియత రుదితస్మితం విరాజ
త్కతిపయ కోమల దన్త కుట్మలాగ్రమ్
వదన కమలకం శిశోస్స్మరామి
స్ఖలదసమంజస ముగ్ధ జల్పితంతే !

జనకమహారాజు అంతటి మహా జ్ఞాని - భూమితల్లి ఒడిలో - తనకు దొరికిన ముద్దుపాపను మురిపెంగా పెంచి పెద్దచేశాడు. ఆమెకు పెళ్ళిచేసి ఒక్క అయ్య చేతిలో పెట్టి అత్తవారి ఇంటికి పంపించి కూడా చాలా కాలమయింది.

అయినా, ఆ తండ్రికి కొమార్తెను తలచుకొన్నప్పుడంతా - తొక్కు పలుకులు పలికే బాలసీతగానే మనోనేత్రం ముందు గోచరిస్తుందట !

వచ్చీ రాని లేత దంతాలు మొగ్గలవలె ప్రకాశిస్తున్నవి బాలసీత ముఖంలో! ఒకటి చెప్పబోయి తడబడి, మరొకటి చెపుతున్న తొక్కు పలుకులు ! కారణం లేకనే అంతలో నవ్వు ! అంతలో ఏడుపు !

" ఇట్లా ముద్దులొలికే సీత శైశవరూపాన్ని పదేపదే స్మరించే జనక మహారాజుకీ - యశోధరను ఇంకా పసిదే అనుకొంటున్న మీకూ భేదం ఏమిటో నాకు తెలియటం లేదు ! " అన్నావు నవ్వుతూ !

" అనుభవాన్ని అనుభూతిగా మలచుకొని అనితరసాధ్యమైన భావుకతతో మేళవించి, ఒక కారుణ్యమయ ప్రపంచాన్ని కవితాబద్ధం చేసినవాడు భవభూతి ! అంతటి ద్రష్ట, స్రష్ట - అబద్ధం ఎట్లా చెపుతాడు మరి ! " .... అన్నాను నేనూ నవ్వుతూ !

యశోధరను మూర్తీభవించిన మమ్మూర్తులా నీ ఆదర్శాలకు అనుగుణంగా మలచుకొన్నావు అవసరం అనుకున్నంతవరకూ పాఠశాల చదువుకు పంపించావు. పల్లెటూరులో పుట్టి పెరిగినా, నాగరికమైన సంస్కారాన్నీ ప్రపంచ పరిజ్ఞానాన్నీ అలవడజేశావు.

ఒంటరి పిల్లల్ని తల్లులు అమిత గారాబం చేస్తారు.

'అమ్మో, తూరుపు తెల్లవారె, నిక లెమ్మా' యంచనన్ నూల్గి మం
చమ్మున్ డిగ్గక, బుజ్జగించినను - పో చాల్చాలు, వేన్నీళ్లు లే
కెమ్మైనే బోనుదోముకొందు జలిలో, నింతాగడంబా ? యం
చమ్మం గూతురు కోపగించుకొను గన్యాత్వంపు గారామునన్ ! '

" ఇంతటి గారాబం పిల్లలకు మేలు కంటే చెరుపునే చేస్తుంది -" అనేదానివి నీవు అందుకే, నీ చేతులలో పెరిగిన యశోధర ఇంతటి వివేకమూర్తి అయింది అయినా, ఆ బిడ్డపైన నీకు ఎంతటి అనుబంధ బంధం !

అన్నిటికన్నా ఆశ్చర్యకరమైన విషయం ఏమిటంటే - ఆ బిడ్డపైనే కాదు- ఏ బిడ్డను చూచినా, ఎందుకో నీకు అపరిమితమైన వాత్సల్యం కలగటం ! ఎవరి బిడ్డలయినా, పసిపిల్లలు నీకు ఇట్టే మాలిమి అయిపోయేవాళ్ళు ! నిన్ను చూచీ చూడగానే, కన్నతల్లి వనుకొని, చిత్రంగా కరుచుకుపోయేవాళ్ళు !

తనువు మనసులు నిండి తల్లితనము
తరుణి వత్సల రూపిణిగ మారె ధరణి నీకు !

అలా నిన్ను ఎరిగున్నవారందరూ ఎప్పుడో ఒకనాడు నీ మాతృత్వ వ్వాప్నమూ ఎరిగినవారే !

ప్రియతమా !

# 40

ఉదయం ఎనిమిది గంటలకే ఉక్క పోస్తున్నది ఎండ మండిపోతున్నది. రానురానూ గ్రీష్మతాపం అధికమవుతున్నది.

తలచిన డెందము గందును
బలికిన నోరెల్ల బొక్కు; బ్రభ సూచిన రె
ప్పలు గమరు; ననగ బటుతర
విలయానల భాతి నెండ వేసవి గాచెన్ !

నన్నెచోడుని మాటలలోనే, వేసవి తాపాన్ని కసురుకొని విసుకుకొంటూ ఉండే వాళ్ళం మన ఇద్దరమూ. ఆ తీవ్ర గ్రీష్మతాపాన్ని ఉపశమింప చేయటానికి నీవు ఎన్నో సదుపాయాలను చేస్తూ ఉండేదానవు. వట్టి వేరుల తెరలను తెప్పించి కిటికీలకూ వాకిళ్ళకూ కట్టించి చల్లని నీరు చల్లించుతూ ఉండేదానవు వట్టి వేరుల పరిమళాలు ఎప్పుడు ఎక్కడ సోకినా - ఆ పాతకాలం నాటి వేసవి మధ్యాహ్నాలు చప్పున స్ఫురిస్తాయి నాకు !

వేసవిలో శరీరానికి చలువ చేసే ఆహార పానీయాలను-సమకూర్చడమనే కళను నీవు ఎక్కడ నేర్చుకొన్నావో తెలియదు. నేర్చుకోకుండానే అనేక కళలు ఇల్లు దిద్దుకొనే ఇల్లాళ్ళకు అందివస్తాయి కాబోలు ! లేకపోతే-అమాయకపు టిల్లాలు-విష్ణుచిత్తులవారి అర్ధాంగి-అతిథి దేవుళ్ళకు ఇంత కమ్మని చల్లని భోజనం సమకూర్చగలుగుతుందా !

తెలి నులి వెచ్చ యోగిరము దియ్యని చారులు దిమ్మనంబులు
న్బలుచని యంబళుల్చెరకు పాలెడ నీళ్ళు రసావళుల్ఫలం
బులును సుగంధి శీత జలము ల్వడ బిందెలు నీరు జల్లయు
న్వొలయగ బెట్టు భోజనము వేసవి జందన చర్చ మున్నుగన్ !

ఇంటికి ఎవరు వచ్చినా, చల్లని కొంకాయ నీళ్ళో, మజ్జిగ దాహమో ఇవ్వడం నీ చలువ వలన మన ఇంటి మర్యాద అయింది. తియ్యని పెరుగులు, చలువ చేసే పచ్చి కూరలు, కారపు ఘాటు లేని చారులు—దోస బద్దల ఫలహారాలు-ఇవి మన వేసవి ఆహారాలుగా ఉండేవి.

"నీవు అన్నపూర్ణవో ! అశ్వినీ దేవతవో ! ...." అని నవ్వుతూ అడిగే వాడను-కాలాన్ని అనుసరించి-శరీర సౌఖ్యాన్ని గుర్తించి-నీవు అమర్చి పెట్టే వంటకాలను ఆరగిస్తూ ! నీవు నా జీవిత భాగస్వామినివైన దగ్గర నుంచీ-నా శరీర ఆరోగ్య విషయమై నా కంటే ఎక్కువగా నీకే తెలుస్తూ వచ్చింది. నీ చేతిలో ఎంత నిశ్చింత నాకు !

అలసినెడ డస్సినెడ నా
కలి తృష్ణయు నైన యెడల, గడఁకొని ధరణీ
తలనాధ పురుషునకు ని
మ్ముల భార్యయ పాచు చిత్తమున దుఃఖంబుల్ !

కష్టమైనా, దుఃఖమైనా అనుభవించ వలసి వచ్చినప్పుడు పురుషునికి భార్య ఆదరం కొండంత బలాన్ని ఇస్తుంది లౌకిక వ్యవహారాలన్నిటిలో అతడిది ప్రధాన పాత్రగా కనిపించినా, ఆ వెనుక ఉన్న ఆత్మబలమంతా ఆమెదే—అన్న విషయం అందరూ గ్రహించలేని సత్యం !

నా ఆరోగ్య విషయంలో నీవు వైద్య సలహాదారువి. ఆహార విషయంలో తల్లివి. అన్నిటినీ మించి నా ఆత్మకు ఈశ్వరివి అంతేనా ! నాకే కాక, ఇతరులకు కూడా హితాన్ని కూర్చే స్నేహితురాలవు నీవు.

ఎంతో ఆదరించే నీ సౌజన్య గుణం అందరికీ నిన్ను బంధువుని చేసింది, వచ్చిన సమస్య ఎటువంటిదైనా, నీతో చెప్పుకుని ఉపశమనం పొందటానికి వస్తూ ఉండేవాళ్లు చాలామంది. వారికి నీకు యుక్తమని తోచిన సలహాలు ఇస్తూ ఉండేదానవు చేతులతోనూ చేతనైన సహాయం చేస్తూ ఉండే దానవు.

క్రమంగా, "అమ్మగారు ఉన్నారా ?"....అంటూ మన ఇంటికి వచ్చే వాళ్ళు ఎక్కువ అయ్యారు. ఇంత మందికి, ఇంత కొద్ది కాలంలో-ఇంత కావలసిన దానవు ఎట్లా అయినావో అని మొదట్లో నాకు ఆశ్చర్యంగా ఉండేది. ఆ తరువాత ఎప్పుడో-ఉత్తర రామ చరిత నాటకంలోని ఈ శ్లోకాన్ని చదువు కొన్నప్పుడు కానీ-నాకు అర్థం కాలేదు- సౌజన్యపూరితమైన నీ వ్యక్తిత్వం ఎంతటి శక్తిమంతమైనదో !

ప్రియప్రాయావృత్తి, ర్వినయ మధురో వాచి నియమః
ప్రకృత్యా కల్యాణీ మతి, రనవ గీతః పరిచయః
పురో వా పశ్చాద్వాత దిదమవిపర్యాసితరసం,
రహస్యం సాధూనామను పధి విశుద్ధం విజయతే !

చేతమంతయు ప్రియమైనది. మాట నియమబద్ధమైనది. వినయముతో మంజులమైనది, చిత్తవృత్తి-స్వభావము చేతనే శుభావహమైనది వారితో స్నేహము అనిందితము. ఎట్టి పరిస్థితులలోనూ మార్పు చెందని రుచికలిగినది-సజ్జనుల చిత్తవృత్తి. నిర్వ్యాజమైన అట్టి సాధు స్వభావం పరిశుద్ధమైనది-పరమోత్కృష్టమయిన దిన్ని !

నీ సహజ ఔదార్య గుణం అటువంటిది. ఉదాత్తమైన నీ స్నేహ శీలత అంతటి హిమాలయ మంతటిది !

ఉదయం నుంచీ చల్లని గాలి వీస్తున్నది. తొలకరి మబ్బులు తొంగి చూస్తున్నవి. ఏదో ఊపిరి వచ్చినట్లు చేల గట్టు వైపు నడక సాగించాను.

పని ఉన్నా, లేకపోయినా, రోజూ మన పొలాల వైపుకు వెళ్ళి రావటం అలవాటుగా మారి చాలా కాలమయింది. ఈ మట్టికీ, నా ఒంటికీ ఉన్న అనుబంధం అటువంటిది !

చల్లగాలి వచ్చిందంది - పిల్ల మబ్బు వేసింది
మెరపు కన్నెలొచ్చారు-మద్దెళ్ళ చప్పుళ్ళు
సన్న సన్న చినుకులు-పెద్ద పెద్ద చినుకులు
వానలూ వరదలూ - వరి చేల పంటలూ
వరహాల మూటలూ - బుడుగో బుడుగో !

గేదెలపైన సవారీలు చేస్తూ గొడ్లకాడ బుడ్డాళ్ళు పదాలు పాడుతున్నారు. ఈ పల్లె పదాలంటే నీకు ఎంతో ఇష్టం. రోజూ పొలం పనులకు వచ్చే కూలి జనం పాడుకునే పాటలన్నిటినీ సాయంవేళ ఇంటికి వచ్చి యథాతథంగా నీకు నివేదించుకొనేవాడను. వాటిని ఒక పుస్తకంలో ముత్యాలవంటి అక్షరాలతో వ్రాసిపెట్టుకొనేదానవు

" ఎంతటి మాధుర్య గుణం ఉంది ఈ పల్లె పాటల్లో ! ఏ నాడు ఏ అజ్ఞాత కవుల గుండెలు పొంగి పదాలుగా పాటలుగా, ప్రవహించాయో ! .... " అంటూ ఉండేదానవు గాఢమైన, అనుభూతితో !

పాటలతోనూ, పాటకపు పనులతోనూ తాదాత్మ్యం చెందుతూనే వ్యవసాయపు పనులలో మునిగితేలేవాడను. నేలతల్లిని నమ్ముకొన్నవాడను. అదునెరిగి భూమిని దున్ని, నీరు కట్టి, ఎరువు వేసి, కలుపు తీసి - హరిత సస్యాలు పండించడం వ్యవసాయకళ. ఈ కళను నేను ప్రత్యేకంగా అభ్యసించక పోయినా, అనుభవసారమే ఆ విద్యను నాకు ప్రసాదించింది.

నా ఈ వ్యవసాయ పరిశ్రమ మీద నీకు ఎంతో గౌరవం, ఇంటి పనులలో నిమగ్నవయి ఉంటూనే, నీవు మన చేలలో జరుగుతూ ఉండే పని పాటులను గురించి ఆకళింపు చేసుకుంటూ ఉండేదానవు.

పొలం పనులు జరుగుతూ ఉన్నన్నినాళ్ళూ - అన్నమూ కూరలూ వండి అందరకూ పొలానికి పంపించడం నీకు ప్రియమైన పనిగా ఉండేది. మధ్యాహ్నపు వేళ-అందరితో పాటూ కలసి-పొలంగట్టున ఆ వేడి వేడి అన్నాన్ని ఆరగించటం నాకూ ఎంతో ఇష్టంగా ఉండేది. ఆ భోజనం అతి రుచ్యంగానూ ఉండేది !

ఏదో ఒక వేపుడూ కూర, నాలుక చుర్రనిపించే పచ్చళ్ళు, కూర ముక్కలతో చిక్కనైన పప్పు పులుసు, ఉదయమే చిలికి చేసిన చిక్కని

మజ్జిగ-కలుపుకుని, తృప్తిగా తిని-గుర్రున త్రేన్చి, కూలి జనం మళ్ళీ పనులకు తలపడే వాళ్ళు.

"అమ్మ పంపిన భోజనం అమృతం లాగు ఉంది"....అని వాళ్ళ తృప్తిగా అనుకొంటూ ఉండే మాటలు సాయంత్రపు వేళ నీకు నేను చేరవేసినప్పుడు నీ కళ్లు అర్ద్రమైపోయేవి. నీ అన్నపూర్ణతత్త్వమంతా నీవు పొలానికి పంపే అన్నపు భాండంలో దృశ్యమానమవుతూ ఉండేది!

"అందరూ కడుపు నిండా అన్నం తిన్నారు కదా!".... అంటూ సాయంత్రం వేళ పలుకరించే నీ అదర పూర్వకమైన పరామర్శలో అలవిమాలిన అమ్మతనం గోచరిస్తూ ఉండేది!

పప్పు పచ్చడి వాయ పదునురా దిగిచిన
దోలి ముద్దకే నోట జలము గ్రమ్మ
అరచేతిలో గుజ్జు పెరసి పోవు కొలది
ఉచ్చిళ్లు నాల్కపై కుదుటు చూపు
పెరుగు మీగడ జిడ్డు పేరుకొన్న కొలది
దంత మౌక్తిక కాంతి దమ్ము సడలు
తలియలో నన్నంబు తరుగుచున్న కొలది
గర్రంచు త్రేపులు గడలుకొనును!

"ఇంత కడుపారా తిన్నాము నీవు పంపిన భోజనాన్ని! రోజూ పొలంలోనే తినాలని కూడా అనిపిస్తూ ఉంది!"....అని నవ్వుతూ అనేవాడను.

"మీ వరుస చూస్తే-ఏటి ఒడ్డున, చెట్ల నీడన, ఇసుక తిప్పల మీద కూర్చుని అలనాడు బాలకృష్ణుడు చల్ది లారగించిన ఘట్టం జ్ఞాపకానికి వస్తున్నది!"....అంటూ పద్యం ఎత్తుకున్నావు.

మాటి మాటికి వ్రేలు మడచి యూరించుచు నూరుగాయలు దినుచుండు నొక్క-
డొకని కంచములోని దొడిసి చయ్యన మ్రింగి చూడు లేదని నోరు సూపు నొక్క-
డేగురార్గుర చల్ది లెలమి బన్నిద మాడి కూర్కొని కూర్కొని కుడుచు నొక్క-
డిన్నియు దగ బంచి యిడుట నెచ్చెలితన మనుచు బంతెన గుండులాడు నొకడు!

"నామ సామ్యం కారణంగా ఈ పనులన్నీ మీరున్నూ చేసి ఉంటారని నా నమ్మకం!"....అని గంభీరంగా నీవు అంటూ ఉంటే, ఆ మాటల వెనుక ఉన్న హాస్యస్ఫూర్తికి తెరలు తెరలుగా నవ్వు పొంగుకు వచ్చేది.

నేను అలా హాయిగా నవ్వుతున్నప్పుడు, నీ కన్నులలో మెరిసిన మెరుపు-అదుగో-ఆ మేఘ మాలిక మాటున మెరిసిన విద్యుత్ప్రభకన్నా సొగసుగా ఉండేది.

# 42

నా మనసు నేనెరుంగని నాడె
నడుముకొని వచ్చి నా జీవితాంతమునకు
నన్ననుసరించుకొంచు వెంటబడి వచ్చు
నీ తపోరాశి చేత బునీతుడైతి !

పదిమందికీ ఉపయోగించే పనులు చేయటానికి ప్రోత్సహించి నాచేత శ్రీకారం చుట్టించిన స్ఫూర్తిమూర్తివి నీవు ! ఈ రోజు ఉదయం మన స్కూలు హెడ్‌మాస్టరుగారు వచ్చారు. శ్రీధరు అనే కుర్రవాడికి ఈ సంవత్సరమంతా అధిక మార్కులతో ఉత్తీర్ణుడైనందుకు స్వర్ణపతకం ఇవ్వటానికి నిశ్చయించామనీ, సభ ఏర్పాటు చేయటానికి నాకు అనుకూలమైన తేదీ తెలుసుకోవటానికి వచ్చాననీ అన్నారాయన.

అప్పుడు-అప్పుడెప్పటివో అత్యంత మాధురీమయమైన జ్ఞాపకాలు నన్ను తరుముకుని వచ్చాయి. మన ఊరి పాఠశాల ఈ విధంగా రూపు దిద్దుకొనడానికి కారణం నీవు.

నేను తరచుగా-నా చిన్నతనంలో నా చదువరితనానికి ప్రోది చేసిన ఒక పుణ్యమూర్తిని గురించి నీ దగ్గర ప్రస్తావన చేస్తూ ఉండేవాడను. మనకు బంధువు కూడా అయిన ఆ తల్లి-అప్పటికింకా చదువు సంధ్యలపైన ఆసక్తి కలుగక-ఊరికే తిరుగుతున్న నన్ను చూచింది. తన వెంట ఊరికి తీసుకు వెళ్ళింది. ఉత్తములైన అధ్యాపకుల వద్ద నన్ను ఉంచి శ్రద్ధగా చదివించింది. ఆ తల్లి అప్పట్లో ఆ పుణ్యం కట్టుకుని ఉండకపోతే - నాకు ఈ విద్యా సంస్కారం అలవడి ఉండేదికాదేమో! రోజూ దీపం పెట్టినప్పుడల్లా ఆ పుణ్యమూర్తిని తలచుకొని నమస్కరించేవాడను.

ఒకనాడు ఇదే ప్రసంగం మన మధ్య వచ్చింది. నీవు అన్నావు-

అక్షరంబు వలయు కుక్షి జీవనులకు
నక్షరంబు జిహ్వ కక్షరసము
అక్షరంబు తన్ను రక్షించు గావున
నక్షరంబు లోక రక్షితంబు !

"మీకు అక్షర భిక్ష పెట్టిన ఆ తల్లి పేర-మన ఊరి పిల్లలకు అక్షర జ్ఞానం కలిగించే పాఠశాల నొకదానిని మనం ఏర్పాటు చేస్తే ఎలా ఉంటుంది!" ....అని సలహా ఇచ్చావు.

వినగానే, నీ సలహా ఎంతో బాగున్నదని అనిపించింది. ఆమెను శాశ్వతంగా అక్షర ప్రపంచం గుర్తు ఉంచుకోవడానికి ఇంతకన్నా నేను చేయగలిగిన మంచి పని ఉండదనీ అనిపించింది. కాని అంతలోనే ఒక నిరుత్సాహమున్నూ కలిగింది. బడి కట్టించడమంటే మాటలా ! నా ఒక్కడి వల్లా అయ్యే పనికాదు కదా !

"మన తూర్పు వైపు చావడి స్థలం ఉన్నది కదా ! దాని విలువను లెక్క కట్టుకోకుండా పాఠశాలకు దానం చేయండి ఒక మంచి పని కోసం ఊరిలో పది మంది పెద్దలూ తలా ఒక చెయ్యి తప్పక వేస్తారు !"....అని నీ వన్న మాటలకు నాలో ఉత్సాహం పుంజుకున్నది.

అక్షరాలా నీ వన్నట్లే జరిగింది మన స్థలంలో మన ఊరిలో క్రొత్తగా బడి వెలిసింది. ఎవరికి తోచిన సహాయం వారు చేశారు. మన ఊరి పిల్లలకు చదువుకోవటానికి పొరుగూరు వెళ్ళవలసిన అవసరం తప్పింది. తత్కారణంగా చదువుకొందుకు బడికి వెళ్లే పిల్లల సంఖ్య పెరిగింది.

గురువుల దృష్టిలో అందరు విద్యార్థులూ సమానులే ! అందరకూ ఒకే విధంగా విద్యను గరపినా, కొందరు మాత్రమే ఆ విద్యవల్ల ప్రకాశాన్ని పొందుతారు. పరిశుద్ధమైన రత్నానికి ఉన్న ప్రతిబింబక శక్తి మట్టిముద్దకు ఉండదు కదా- అన్న సత్యాన్ని భవ భూతి ఇలా ప్రస్తావిస్తాడు.

వితరతి గురుః ప్రాజ్ఞే విద్యాం యథైవ తథా జడే ;
నహి ఖలు తయో ర్జ్ఞానే శక్తిం కరోత్యపహన్తివా

భవతి చ తయోర్భూయాన్ భేదః ఫలం ప్రతి; తద్యథా
ప్రభవతి శుచిర్బింబ గ్రాహే మణిర్న మృదాం చయః !.

ఉత్తమ విద్యార్థికి ప్రోత్సాహకరంగా ఉండేటట్లు ఏటా ఆ తల్లి పేరనే ఒక పతకం బహూకరించేటందుకు ఒక నిధిని ఏర్పాటు చేయించినదీ నీవే ! అందుకే అన్నాను - నీ వితరణ గుణతపఃఫలమంతా నన్ను వెంటాడుతూనే ఉన్నదని !

బహుమతి అందుకొనే విద్యార్థి కన్నులలో మెరుపునీ, ఆ పిల్లవాడి తల్లి తండ్రుల సంతోషాన్నీ చూడటం ఒక హర్షదాయకమైన అనుభవంగా ఉండేది. బహుమతి పొందిన పిల్లనో పిల్లవాడినో-నీవు ప్రత్యేకంగా ఇంటికి పిలిపించి పిండి వంటలతో భోజనం పెట్టి క్రొత్త బట్టలు కొని ఇచ్చేదానవు.

"ఎందుకు నీవు ప్రతి విషయానికీ అంత శ్రమ తీసుకొంటావు !".... అంటూ ఉండేవాడను అప్పుడప్పుడూ.

"చిన్న చిన్న శ్రమలు తీసుకోవటం వల్లనే ఎంత గొప్ప తృప్తీ ఆనందమూ కలుగుతున్నదో చూచారా !"....అనే నీకు చెప్పదగిన సమాధానం నా వద్ద ఉండేది కాదు !

ధృతిః క్షమా దయా శౌచం కారుణ్యం వాగనిష్ఠురా
మిత్రాణాం చానభిద్రోహః సప్తైతాః సమిధః శ్రియః !

సర్వజన హితం కోసం, శ్రేయస్సు కోసం-సప్తసమిధలను సమర్పించ గలిగిన మానవివి నీవు-అని మాత్రం అనుకొనేవాడను ఆర్ద్ర చిత్తంతో !

## 43

క్షమా దానం క్షమా యజ్ఞః క్షమా సత్యం హి పుత్రికా
క్షమా యశః క్షమా ధర్మః క్షమయా నిష్ఠితం జగత్ !

కుశనాభుడనే మహారాజు తన కుమార్తెలకు బోధిస్తున్నాడట- ఓర్పే దానము; యజ్ఞము ; కీర్తి; ధర్మము ; భూ సంబంధమగు ఓర్పు చేతనే లోక మంతా నిలచి ఉన్నదని ! బహుశః నేను అనుకొంటాను-మీ తండ్రిగారు కూడా నీకు ఇదే విషయాన్ని బోధ చేసి ఉంటారని ! లేకపోతే-నీవు అంతటి క్షమా మూర్తివీ, ఓర్పుమంతురాలవూ ఎట్లా అయినావు !

పాపను ప్రాణప్రదంగా పెంచి పెద్దదానిని చేశావు. కళ్ళలో వత్తులు వేసుకొని కాపాడుకొంటూ విద్యా బుద్ధులు చెప్పించావు. మన బిడ్డ యశోధరను ఒక అయ్య చేతిలో పెట్టవలసిన తరుణం వచ్చింది. ఎప్పుడూ నీ వెనుకనే నీడలాగు తిరుగుతూ ఉండే చిట్టితల్లిని వదలి నీవు ఎట్లా ఉండగలుగుతావోనని భయపడ్డాను. నీవు ఎంతటి మానసిక వేదనకు గురి అవుతావోనని విలవిలలాడి పోయాను.

నీవు పళ్ళ బిగువున నీ దిగులు నంతటినీ సహించావు. ఓర్పు - అనే కవచం మాటున నీ మనోవ్యధ నంతటినీ దాచుకొన్నావు. నేను ఎప్పుడైనా ఆ ప్రస్తావన తీసుకు వస్తే, నేర్పుగా మాటను మళ్లించివేసేదానవు. అందుకే-తలచినప్పుడల్లా ఆశ్చర్యంలో మునిగిపోతుంటాను నీ మహత్తర గుణాన్ని !

మన బిడ్డ తన భర్తతో దూరపు ప్రదేశానికి వెళుతూ ఉన్న సమయంలో నా కంఠంలో కరుడు కట్టిన మహాదుఃఖమేదో అడ్డుపడినట్లయినది. మన కన్నుల ముందు ఆడుతూ పాడుతూ పెరిగిన బిడ్డ — ఇకముందు తనదంటూ ఏర్పడుతున్న ఇంటికి తరలిపోతున్నది !

పొమ్మని జూచు, జూచి మది బుట్టిన ప్రేమము ప్రేగ్మి బాష్పముల్
గ్రమ్మిన గ్రమ్మరం బెడమొగంబయి కన్నుల నీరు మింగుచున్
గ్రమ్మర దా శకుంతల మొగంబగు, నశ్రులు నించు గొంతసే
పమ్మని జాలి బొంది ధృతియంతయు నిల్వక విచ్చిపారగన్ !

సరిగ్గా అప్పటి నా స్థితీ—అలనాటి ఆ కణ్వుని స్థితీ-ఒక్కటే ! సర్వ సంగ పరిత్యాగి-తపస్సంపన్నుడు-ఆ కణ్వమహర్షి ! పెంచిన మమకారమే ఆ సమాధి నిష్ఠుణి అంతగా విచలితుడిని చేస్తే ఇక నేననగా ఎంత !

వీడ్కోలు వేళ-యశోధర కన్నులు రెండూ కెంపు తామరలే అవటం చూచాను. గుండె కరిగి నీరవటం అంటే ఏమిటో అప్పుడే నాకు తెలిసింది! నీవంటి ప్రజ్ఞా మూర్తిని, ప్రేమమయిని, తల్లిగా పొందిన భాగ్యశాలిని తాను! నీవు నేర్పిన ఓర్పే తనకు రక్షగా-మనకు పాదాభివందనం చేసి తన ఇంటికి ప్రయాణమై వెళ్ళింది చిన్న పెళ్ళికూతురై తాను!

నీ మనోగత భావాలన్నిటినీ అణచిపట్టి నీవు మామూలు పనులలో లీన మయినావు. కర్తవ్య పరిపాలనా దీక్ష నిన్ను ఆదినుండీ నడిపిస్తూనే-వచ్చింది. నీ పైన ఉన్న చిన్న బాధ్యతనైన నా అమిత శ్రద్ధాసక్తితో నిర్వహిస్తూ ఉండే దానవు. అందుకే-అమ్మాయి పెళ్ళి చేసి, ఆమెను ఒక ఇంటికి పంపించే బాధ్యతను అంతటి క్రమపద్ధతిలో నిర్వహించావు.

యశోధర మన ఇల్లు వదలి వెళ్లేటప్పుడు-మన పూజాపీఠం ముందుకు తీసుకు వెళ్ళి-ఈ శ్లోకాన్ని చదివించావు.

వాగర్థా విత సంపృక్తౌ వాగర్థ ప్రతిప త్తయే
జగతః పితరౌ వందే పార్వతీ పరమేశ్వరౌ !

ఆ దివ్యమూర్తుల అతిలోక దాంపత్య దీప్తిని ఇంతకన్నా మిన్నగా సంభావించుకోవటం ఎవరికి సాధ్యం అవుతుంది! వాగర్థముల వంటి దంపతి భావాన్ని క్రొత్త దంపతులకు స్ఫురింప చేయడం నీ లక్ష్యమైనా, అందులోని నిగూఢమైన కవితాతత్త్వ దర్శనం నీకు ఎంతో ప్రీతికరమైనదని నేను ఎరుగుదును.

వాక్కుకు అర్థం ప్రాణం. అర్థానికి ఆలంబనం శబ్దం. శబ్దార్థముల కలయిక-సహృదయైక వేద్యమైన సాహిత్యం, దానిని అర్ధ నారీశ్వర రూపంగా, అద్వైత జీవన సంయోగంగా-ఊహించి సన్నుతి చేశాడు పరమ భావుకుడైన కవితా కళానిధి కాళిదాసు!

ఎంతటి మనోహరమైన భావన! అతడు వాక్కు! ఆమె అర్థం! అతడు భాష! ఆమె భావం!

'శబ్దార్థ సహితౌ కావ్యమ్ '....అన్నాడు కదా వామనుడు!

శబ్దాన్ని అనుసరించి అర్థాన్ని, అర్థాన్ని అనుసరించి శబ్దాన్ని-ప్రయోగించి కవులు ఉత్తమ కావ్య రచనం చేస్తారు. పరమ రసాత్మకంగా మన ఈ జీవన కావ్యాన్ని నడిపిస్తూ వచ్చిన నీ చేతిని-మౌనంగా నా చేతిలో ఉంచుకొన్నాను, యశోధర తన ఇంటికి వెళ్ళిపోయిన ఆ నిశ్శబ్ద వేళ! నీ కరస్పర్శ నాకు ఇచ్చిన ఓదార్పు సాక్షిగా!

"అనఘా ! మన మధ్యయనంబు సేయుచు, అన్యోన్య స్నేహ వాత్స ల్యంబులం జేయు కృత్యంబులు మరుపవు కదా !"....అని-తమ చిన్ననాటి స్నేహాన్ని గుర్తుకు తెస్తూ-కుశలప్రశ్నలు వేశాడట కృష్ణుడు-కుచేలుణ్ణి చూచి !

అంతకు ముందే ఆ మహానుభావుడు-తన నెచ్చెలికాడైన "పేద విప్రుని, అశ్రాంత దరిద్ర పీడితుని, కృశీభూతాంగుని, జీర్ణాంబరుని, ఘన తృష్ణాతుర చిత్తుని, హాస్య నిలయుని, ఖండోత్తరీయుని"....తన ఇంటికి రావటం చూచాడు. తల్పము దిగి, ఎదురుగా వెళ్ళి, పరిరంభణ మాచరించి, బంధుస్నేహ స్ఫురణతో దెచ్చి, తన తల్పమున సమాదరమున కూర్చుండ బెట్టి, నెయ్యమున కనక కలశ సలిలముచే కాళ్ళు కడిగి, భక్తితో ఆ జలములు మస్తమున దాల్చి, లలిత మృగమద ఘనసార మిశితమైన మలయజము మేన జొబ్బిల్ల నలది, శ్రమము వాయంగ దాళ వృంతముల విసరి, బంధురామోద కలిత ధూపంబులొసగి మించు మణి దీపముల నివాళించి, సురభి కుసుమ మాలికలు సిగముడిం దునిమి, కర్పూర మిశిత తాంబూలంబులిచ్చి, ధేనువు నొసంగి - సాదరంగా తమ చిన్న నాటి నెయ్యపుతీపి తలపులను నెమరు వేసుకొన్నాడట ఆ గోపాలకుడు! మైత్రీ పాలకుడూ !

ఈ తియ్యని స్నేహసంపదలో ఎంత సమార్ద్రమైన సంభావనా గరిమ !

మానవీయమైన ఈ సుహృత్తును జన్మబంధంగా పుణికితెచ్చుకొన్న స్నేహాభిరామవు నీవు ! నిన్ను ఎరిగిన వారందరూ నీకు సన్నిహితులు కావడానికి కారణం నీవేనన్నసంగతి తెలుసు నాకు- నీ కరుణాంతరంగాన్ని ఎరిగిఉన్నందున! ఎంతమంది స్నేహితులు నీకు ! నీవు చిన్నవాడు గుజ్జన గూళ్ళు ఆడుకొనే నాటినుంచీ పెంచుకొచ్చిన స్నేహసంపద అపారమైనది.

మన ఇంటికి వచ్చి వెళ్ళే అతిథి అభ్యాగతులైనా, బంధు మిత్రులైనా, ఒకసారి నీతో పరిచయం కలిగితే చాలును - అది ఎంతో గాఢమైన స్నేహ బంధంగా మారిపోవలసిందే ! నీ సహజ సౌజన్య గుణం చేతనే ఇంతటి స్నేహ శీలివి కాగలిగినావని అనుకుంటాను.

అలా నీ స్నేహానికి పాత్రులయిన వారందరూ నీకు ఉత్తరాలు వ్రాస్తూ ఉండేవారు. నీవు బదులు వ్రాయడంలో ఏ మాత్రమూ ఆలస్యం చేసేదానవు కాదు. ఈ ఉత్తరాల పూల వంతెనతో-స్నేహ సౌందర్యాన్ని హృదయస్థితం చేసుకొన్నావు. స్నేహశీలతను గురించి ఎన్నో మారులు మన మధ్య ప్రసంగాలు నడిచినాయి.

" కవులు, పండితులు, అయినవారి మధ్య సాధారణంగా విద్యా విషయకమైన స్పర్థ, స్వోత్కర్ష - తప్ప, స్నేహభావం కలికానిక్కూడా కనిపించదు!" .... అన్నాను ఒకసారి. నీవు ఒప్పుకోలేదు! " అక్కడా అక్కడా ఉంటారు సాహిత్య మూర్తులలో కూడా మైత్రీ పాలకులు " .... అన్నావు.

పాయక పాకశాసనికి భారత ఘోర రణంబు నందు నా
రాయణునట్లు దానును ధరామర వంశ విభూషణుండు నా
రాయణ భట్టు వాఙ్మయ ధురంధరుడీ కృతి క్లిష్టుడన్ సహా
ధ్యాయుడునైన వాడభిమతంబుగ దోడయి నిర్వహింపగన్ !

" ఆ విధంగా ఫలించిన మన సాహితీ సుక్షేత్రంలో—నరునకు నారాయణునట్లూ, నన్నయకు నారాయణ భట్టు నట్లూ—కలసి మెలసి కావ్యములను రచించి రాణకెక్కిన జంట కవులు ఎంత మంది లేరు! " ....అన్నావు నీవు సాలోచనగా.

"అది ఒక తరంనాటి కవుల విషయం. ఇప్పుడలా చేతులు కలుపుకోగలిగిన కవులైనా, రచయితలైనా—కాగడా వేసినా కనిపించరే!"....అన్నాను నవ్వుతూ. విశుద్ధమైన మైత్రికి ఎంత త్యాగనిష్ఠ కావాలి! క్షీర నీర న్యాయంతో ఉపమిస్తూ బహు చతురంగా చెపుతాడు భర్తృహరి.

క్షీరము మున్ను నీటికొసగెన్ స్వగుణంబులు దన్ను జేరుటన్
క్షీరము దప్తమౌట గని చిచ్చురికెన్ వెతచే జలంబు యు
ద్వార సుహృద్విపత్తిగని వహ్ని జూరంజనె దుగ్ధ మంతలో
నీరము గూడి శాంతమగు నిల్చు మహాత్ములమైత్రి యీ గతిన్!

ఇది సన్మిత్రి లక్షణం! మానవీయమైన మహత్తర లక్షణం! స్నేహశీలతకు ఇది పరాకాష్ఠ! అరమరికలు లేనిదీ—అంతస్థులు ఎరుగనిదీ, ఆత్మగతమైనదీ - అయిన ఒకానొక సౌహృద భావశుద్ధి మహాత్ముల మధ్య స్నేహదీప్తి వెలిగిస్తుంది.

మత్పురానేక జన్మములు పండి
జాహ్నవీ స్వచ్ఛవును, సుధా స్వాదుమూర్తి
వైన నీ దివ్యసాన్నిధ్య మందుకొంటి
పుడమికిన్ స్వర్గమున కొక్క ముడి రచించి !

అలా చూరగొన్న అపారమైన మైత్రీ సంపద మన జీవితాలకు తుష్టినీ పుష్టినీ సమకూర్చి పెట్టింది-

## 45

మనం ఇద్దరమూ కలసి సుఖాన్నీ, దుఃఖాన్నీ కలబోసుకొన్న అనుభూతులెన్నిటినో పంచుకొన్నది ఈ మన నివాసం! నాకు ఎంతో ప్రియమైనది- ఇందులోని ప్రత్యణువూ ప్రాణప్రదమైన స్మృతి రేఖ లెన్నిటినో ప్రక్షిప్తం చేసుకొన్నది కనుక!

ఈ రోజు బయటకు వెళ్లాలని అనిపించక వాలుకుర్చీలో కన్నులు మూసి పరుండి ఉన్నాను. నా అంతర్దృష్టికి నీ ప్రసన్న సాధు రూపం సాక్షాత్కరించింది.

అద్భుతాకర్షక శక్తిమూర్తివి నీవు
కాకున్న మది యేల అటు లూగి ఇటు లూగి
నీవంకకే తూలి తుళ్ళింతలాడు!

అన్నాను ఒక సారి నవ్వుతూ!

"చదివి చదివీ చివరకు మీరూ కవులైనారుగా!"....అన్నావు నీవూ నవ్వుతూ!

"చదవేస్తే ఉన్నమతి చెడటమంటే ఇది కాదు కదా!".... ఇంకా అన్నావు ముసి ముసిగా నవ్వుతూ—

"చదవేస్తే ఉన్న మతి పోవటమంటే ఇది కాదు! ఏదో చెప్పనా?" ....అన్నాను నేనూ నీ నవ్వులో శృతి కలుపుతూ!

ఇన్నాళ్లు సేవ చేయుచు
నున్నది యుం బోయె నేడ యోగ్; కౌగిలి యి
మ్మన్నంత జదువ బెట్టగ
నున్న మతియు బోయె ననుటహో నిజమయ్యెన్!

యతి వేషంలో జపం చేస్తున్నట్లు నటిస్తూ, చెలియ చేత పరిచర్యలు చేయించుకొంటున్నాడు అర్జునుడు— 'చేసినది జపంగా-వేసినది గాలంగా!' పూజకోసం పత్ర పుష్ప ఫల జలాదికములు సమకూర్చి పెడుతున్నది ఆ అందాల ప్రోవు!

సుభద్ర సోయగం చూడగా చూడగా మతిపోతున్నది ఆ యతి వేష ధారికి. నాటకం కోసమైనా జపతపానష్ఠానం చేయడం మాని వేశాడు.

"రమణి యొయ్యారములపై పరాకు చేత"....చవి ఎరుగడట! వడ్డించునవీ ఎరుగడట!

ఆమె పైన ఆపుకోలేని తమకం చేత, ప్రీతి చేత—అర్జునుడు తానెవరో తెలుపుకొన్నాడు. నీకై తపస్సు చేస్తున్నానని అన్నాడు. తనపైన దయ తలచ వలసినదని వేడుకొన్నాడు. ఇంకా ఏమేమో ప్రియోక్తులు పలుకుతూ ఉన్నాడు.

ఆ మాటలకు ఆ ముగ్ధకు ఎక్కడ లేని సిగ్గూ తరుముకు వచ్చింది. తుర్రుమని అంతఃపురంలోకి పారిపోయింది! తన తొందరపాటుకు రవంత వగపుతో—అప్పుడనుకొంటూ ఉన్నాడు అర్జునుడు—

'చదవేస్తే ఉన్నమతి పోయిన సామెత అయినదేమో' — అని!

ఇద్దరమూ ఒక్క పెట్టున నవ్వుకొన్నాము — ఆ విరహాతురుని అవస్థను ఊహలలో నిలుపుకొని! మనకు లభించే తీరిక వేళల్లో—ఎన్ని మారులు ఇలా రసోత్సుకతతో కావ్యగత సన్నివేశాలను త్రవ్వి పోసుకున్నాము! కావ్యాలలో నవరస భావాలను దర్శించి ఆత్మలో అలదుకొన్నాము! రసపుష్టిని సృష్టించు కొని—మన జీవితాన్ని ఎంతటి సుందరకావ్యంగా మలచుకొన్నాము!

'సరస్వత్యా స్తత్వం కవి సహృదయాఖ్యం విజయతే'—

కావ్యరసాస్వాదనకు కావ్యసృష్ట మాత్రమే కాక, సహృదయుడైన రసజ్ఞుడు కూడా అవసరమే కదా!

ఏ కావ్యం చదువుకొన్నా, ఏ పద్యం చెప్పుకొన్నా, అందులోని అర్థ శక్తీ, అభివ్యక్తి రీతి—మనలను ఎంతగానో అలరించి వేసేవి. చేతిలో చేయి వేసుకొని—ఒకొక్కరమూ ఒక్కొక్క పద్యాన్ని చదువుతూ—రసపరవశులం అవుతూ కూర్చుండిపోయిన సంధ్యవేళలు ఎన్నెన్నో!

నిజానికి ఋషి వంటి వాడు కవి అయితే, కవి అంతటి వాడు సదసద్వి వేచనా పరుడైన రసజ్ఞుడు! ఆస్వాదనకు నోచుకొనని కవిత్వం అడవిని కాచిన వెన్నెలకదా!

ఏ పని చేస్తున్నా, ఏదో ఒక సందర్భాన్ని పురస్కరించుకొని ఒక పద్యాన్ని నీవు చదవటమో—నేను అందుకొనడమో జరుగుతూ ఉండేది! ఇప్పుడు—ఈ సంధ్య వేళ—నా హృదయమంతా నీవు నిండిన వేళ—ఆ రసమయ సన్నివేశాలు నన్ను ఒకటొకటిగా చుట్టుముట్టి పరవశుణ్ణి చేస్తున్నవి

సుందర సర్వలక్షణ విశుద్ధ కవిత్వము గన్నచో రస
స్యంది నిజ స్వభావుడనజాలినయట్ల నిజస్వభావు డా
నందము బొందునట్లు కుజన ప్రకరంబు లెరుంగ నేర్చునే
చందురు జూచి మోదమున సాగరముబ్బిన నూతులుబ్బునే!

జీవితంలోని ఒడిదుడుకులను, ఆటుపోటులను. ఎదుర్కొంటూనే—సారస్వత రసాస్వాదనతో సేద తీర్చుకొంటూ సాగి వచ్చిన మన జీవనరేఖలు ఇవి!

# 46

చాగు నిర్మల చంద్రికా పూరమట్లు
హృదయ తాపము చల్లార్చి ముదము గూర్చు
త్వన్నిరంతర మధుర భావనలె కాని
ఇతర మేమియు మదికి రానీయ నెపుడు !

నాకూ నీకూ కూడా ప్రియమైనది సాహిత్య సమారాధన. ఆ సమారాధన పర్వంలో మనకు ఎంతమంది మహానుభావులైన విద్వత్కవులతో పరిచయ భాగ్యం కలిగింది ! ఆ కావ్య జగత్తులో మన ఇద్దరమూ కలసి జంటగా విహరిస్తూ, రస పరవశులమై ఆనందస్థితిని పొందిన సందర్భాలు ఎన్నని !

మన ఈ కవితా విషయికమైన రసలోలుపత కారణంగా కవిమిత్రులు ఎందరో మన ఇంటికి వచ్చి వెళుతూ ఉండేవారు. వారితో కవితాగోష్ఠులు జరుపుతూ ఉన్నప్పుడు ఈ మన నివాసం సరస్వతీ నిలయమైనట్లు తోచేది. శబ్ద సంస్కార మహిమచేత పునీతమయినట్లూ అనిపించేది.

ఇద మంధం తమః కృత్స్నం జాయేత భువన త్రయమ్
యది శబ్దాహ్వయం జ్యోతిరా సంసారం నదీప్యతే

శబ్దమనే జ్యోతి ఈ జగత్తునంతా వెలిగించకపోతే ముల్లోకాలూ అంధకారంలో మునుగుతూ అల్లకల్లోలమై పోయేవి-అన్న ఆలంకారిక ప్రవచనం సాక్షిగా – మన ఇంట వాగ్దేవి మసలిన ఛాయలు దీప్తిస్తూ ఉండేవి.

ఆ వచ్చేవారిలో ఉద్దండులైన పండిత ప్రముఖులూ ఉండేవారు. అంకూరంగా అప్పుడే రచనలు చేయటం ప్రారంభించిన ఔత్సాహికులూ ఉండేవారు. ఎవరు వచ్చినా, భక్తి గౌరవాలతో ఆతిధ్య సత్కారాలు చేసి, యథాశక్తిని సత్కరించి పంపటం –మనకు స్వధర్మమైపోయింది.

లక్ష్మి సరస్వతులిద్దరూ ఒక్కరినే అనుగ్రహించటం చాలా అరుదన్న మాట – ఆ పండితులను చూచినప్పుడు మన అనుభవానికి వచ్చినమాట ! ప్రజ్ఞా ధురీణులైన విద్వత్కవులు కొందరు తమ గ్రంథాలను అచ్చువేయించుకొనలేని స్థితిలో మన ఇంటికి రావటం జరిగింది.

ఆకటియ్యంబగు సాంపరాయని తెలుంగాధీశ ! కస్తూరికా
భిక్షాదానము సేయరా సుకవి రాడ్బృందారక శ్రేణికిన్ !

అని – అర్థించటంలో కూడా ఆత్మాభిమానాన్ని పొంగించిన సకల విద్యా సనాథుడు – చిన్నారి పొన్నారి చిరుత కూకటినాడే సంస్కృతాంధ్ర భాషల

ప్రౌఢ కవిత్వాన్ని చెప్పనేర్చిన బ్రాహ్మీదత్త వరప్రసాదునికే ఒకప్పుడు సిరి చూచిన చిన్నచూపు తప్పలేదు ! దారిద్ర్యబాధ అనుభవించక తప్పలేదు !

కృష్ణవేణమ్మ గొనిపోయె నింత ఫలము
బిల బిలాక్షులు గొనిపోయె దిలలు పెసలు
బొడ్డుపల్లెను గొడ్డేరి మోసపోతి
నెట్లు చెల్లింతు టంకంబు లేదు నూర్లు !

అని పరిదీనుడై దుఃఖించకనూ తప్పలేదు !

దైన్య స్థితిలో ఉన్న కవి పండితులను చూస్తే ఒక వంక అత్యంతమైన గౌరవభావము, మరిఒక వైపున వారి స్థితికి అనుకంపతో కూడిన సానుతాపము - నన్ను నిలువునా కలచివేసేవి. సీరుకావి పట్టిన కట్టుపంచె, లాల్చీతో - చేతిలో నలిగిపోయిన కాయితాల కట్టతో, మాసిన గడ్డంతో - ఒకనాడు దూరదేశ కవిఎవరో వచ్చాడు మనఇంటికి. భోజనం చేసి ఎన్నాళ్ళయినదో అనిపించేటంతగా అతడు అవురావురుమంటూ నీవు అప్పటికప్పుడు వండి వడ్డించిన అన్నాన్ని తిన్నాడు.

నేను ఆతనితో ఏవో సాహిత్య విషయాలు మాట్లాడుతూకూర్చున్నాను. ఆతను వ్రాసిన కావ్య వస్తువును గురించే ప్రశ్నిస్తున్నాను. నీవు వాకిలి లోపల నుంచి నన్ను సైగతో పిలిచావు. ఒక జత ధోవతులతోపాటు, కొంత సొమ్మును ఉంచిన కవరును నా చేతికి అందించి - " ముందు వీటిని ఆయనకు ఇచ్చి పంపించండి. మీ కావ్య చర్చలతో కాలయాపన చేయవలసిన అదను కాదు ఇది ! " - అన్నావు. "ఈ సొమ్ము కావ్య ప్రచురణకోసమా ! అ రచన ఎటువంటిదో ఇంకా చూడకనే నాపోతిమే ! " .... అన్న జిజ్ఞాసలో ఉన్న నన్ను చూచి, నవ్వి అన్నావు-

" అక్షరార్చనతో జీవితాన్ని సాగదీస్తున్న సారస్వతేయుడు, ఆయన ఏమి వ్రాస్తేనేమి ! ఆయన ఈ సొమ్మును తన గ్రంథ ప్రచురణకోసమో, గ్రాసంకోసమో ఉపయోగించుకోనివ్వండి ! ఈ సొమ్ము ఎంత అవసరమో తెలుస్తూనే ఉన్నది. ముందు జీవించడం ముఖ్యం ! " అన్నావు ఆర్ద్రచిత్తంతో ! నీ మాటలు విన్నప్పుడు -

నడవకయె నడచి వచ్చితి
నడచిన నే నడచి రాను నడచెడునటులన్
నడిపింప నడువనేరను
నడవడికలు చూచి నన్ను నడిపింపరయా !

అన్న పద్యం మననానికి వచ్చింది - కన్నులు చెమర్చుతూ ఉండగా !

# 47

గుండె గొంతుకలో కొట్లాడి కొట్లాడి - నండూరి సుబ్బారావును నాయుడు బావను చేసుకొన్నది యెంకి ! ఆవిడ రాణోరింటికైనా రంగుతెచ్చే పిల్ల. కళ్ళెత్తితే సాలు కనకాభిషేకాలు కురిపించగలిగిన అందగత్తె. అతని నీడలోనే మేడ కట్టుకుంటానని అంటుంది. అతడికీ ఆమె పైన కొండంత అనురాగం ! ఆ అనురాగ బలం అతడిని ఎంతటి శక్తిమంతుడినైనా చేస్తుంది !

యెంకి గాలొక సాలి యిసిరినా సాలు
తోటంత రాజస్సె తొవ్వి పోసేను !

అంటాడు అంతులేని ఆత్మవిశ్వాసంతో ! ఇంకా -

ముందు నువ్వుంటే నే కిందా నిలబడగలను
నీ నీడనే తొక్కుకోని సులువుగ రాగలను !

అనగలిగినంత గాఢంగా, ఆమె అందమూ, ఆలంబనాన్నీ ఆకాంక్షిస్తాడు.

నీవు నా జీవన సహచరివైన నాటినుంచీ, నాకు తెలియకనే, నీ పైన అన్నిటికీ ఆధారపడటం అలవాటు అయింది. నీవు కూడా, అప్రయత్నంగానే నా బాధ్యత యావత్తూ నీ పైన వేసుకొన్నావు. ఆప్యాయంగా, అతిప్రియంగా, నీ చేయూతను ఇస్తూ, నన్ను ఆదుకొంటూ వచ్చావు. ఎట్టి సంక్లిష్ట సమయంలో నయినా, ఎంతటి గడ్డు సమస్యనయినా ఎదుర్కొనగలిగిన ధీశక్తిని నాకు అలవడ చేశావు

అతి విశాల గభీర భవార్ణవంబు
నన్ను దాటింప జాలిన నౌక వీవ
స్థిర పవిత్ర మదీయ హృత్సీర నిహిత
దివ్య విమలానురాగాధిదేవిNీవ !

భౌతిక జగత్తులో జీవిస్తున్నంతకాలమూ ఎవరెంతటి మహాత్ములకైనా సుఖ దుఃఖానుభవం జీవులకు తప్పదు ! రామునికైనా, భీమునికైనా, గోపన్నకైనా, వేమన్నకైనా, త్యాగయ్యకైనా, అన్నమయ్యకైనా ఏదో ఒక కారణంగా, ఏదో ఒక సమయంలో వేదనానుభవం తప్పలేదు. నేననగా ఎంత !

ఏవో చికాకులతో మనస్సు ఘూర్ణిల్లినప్పుడు, ఏదో తీవ్రమైన దుఃఖం గుండెను వ్రయ్యలు చేసినప్పుడు, ఎప్పుడో శరీరం రుజాగ్రస్తమై దుర్భర వేదనకు గురిఅయినప్పుడు, నీ చల్లని హస్త స్పర్శ నాకు ఊరట నిచ్చింది. ఎల్లప్పుడూ

నీ పెదవుల పైనే తొంగి చూచే సుకుమారమైన హాసరేఖ - నా గాయాలకు ఉపశమనం కలిగించింది. అన్నిటినీ మించి పువ్వుకన్నా మెత్తనైన నీ మృదు భాషణం నన్ను సర్వ తాపాలనుండీ విముక్తుణ్ణి చేసింది!

మ్లానస్య జీవ కుసుమస్య వికాసనాని
సన్తర్పణాని సకలేన్ద్రియ మోహనాని
ఏతానితే సువచనాని సరోరుహాక్షి
కర్ణామృతాని మనసశ్చ రసాయనాని

అన్న రామ వాక్యమే నాకున్నూ శరణ్యమైనది!

ఎప్పుడైనా మనఃక్లేశం కలిగినా, దేహం అస్వస్థతకు గురి అయినా, నీవు నాకు తోడుగా ఉన్నావులే - అన్న కొండంతభావం నన్ను వెన్నుతట్టి నడిపిస్తూ వచ్చింది. నిజానికి ఇది పరమేశ్వరుని పైన భక్తునికి ఉండవలసిన ప్రపత్తి భావమని నేను ఎరుగుదును. అయినా, నీ పైన నా సర్వ భారమూ వేయటం న్యాయమనే అనిపించింది - నీలో అనేకమారులు నా ప్రత్యక్షదైవాన్ని చూచు కొన్నాను కనుక! అంతులేని నీ కారుణ్యామృతాన్ని కుత్తుకదాకా నింపుకొన గలిగిన భాగ్యశాలిని కనుక!

ఇంతటి దయనూ, మమతనూ దోసిలి నిండుగా నింపుకుని, బ్రహ్మ ఒక దివ్యముహూర్తంలో స్త్రీమూర్తిని సృజించి పురుషునికి ప్రసాదించి ఉంటాడు ఎంతో ఉదారంగా! ఎంత కృతజ్ఞుడై ఉండాలి అతడు ఆమెపట్ల! ఆ భగవంతుడిపట్ల!

అడవికి పోతున్న రాముడిని అనుసరించి వస్తానని ప్రాధేయపడుతూ, ఆమె ఎంతటి దయార్ద్రమూర్తి కాకపోతే ఇలా అనగలుగుతుంది!

అయ్యెడలందు గంటకితమై చనుదోవల గాళ్ళక్రింద నా
పయ్యెద నొడ్డెదన్ బెడగ వచ్చిన ముండ్లను గ్రుచ్చుకొన్న నే
కయ్యల కాలు జారినను కన్నుల వెచ్చని నీళ్ళనద్దిస
తొయ్యల బాధ దీర్చు నడ తూకువ సాగును కాదె రాఘవా!

కంటక శిలామయమైన ఈ జీవనమార్గంలో - నిరాటంకంగా ఇంత దూరం నేను ప్రయాణిస్తూ వచ్చింది - నీ బాపతుతోనే! చిత్రమేమంటే, నీవూ ఇదే మాటను నాతో అనేకమార్లు అంటూ వచ్చావు! మన ఉభయుల మధ్యా వర్తిల్లినది ఇట్టిదట్టిదనరాని అపురూపమైన అంతరిక స్థితి! నీవు నాకు దయతో అందించిన భావాతీత బ్రహ్మానందమయ స్థితి!

ప్రియతమా !

# 48

ఈ సాయంత్రం వాహ్యాళికి వెళ్ళినపుడు అషాఢ మేఘాన్ని చూచాను. ఆప్త మిత్రుని లాగు తోచిన నల్లని మేఘాన్ని చూస్తూ ఉంటే, ఎన్ని పురా స్మృతుల మేఘ మాలికలు-గుండెల నిండుగా !

ఒక నాటి సాయంవేళ, ఆకాశం వైపు అలవోకగా చూచి నవ్వుతూ-

" ఏదో చాలా బరువైన వియోగ గీతమే మోసుకొస్తున్నాడల్లే ఉంది మేఘమాతు డివాళ ! మరీ అంత కాటుక రంగును పూసుకుని బరువుగా కదలి వస్తున్నాడు !"....అన్నావు నీవు.

నీదైన చిరు స్పర్శకైనా, చిన్న మాటకైనా, ప్రతిస్పందించి పరవ శించక తప్పని స్థితి నాది !

"అసలు బయలుదేరినప్పుడే అంతటి ఆర్ద్ర జలదమూర్తి ! ఏ ప్రవాస దుఃఖితుడైనా తనకోసం వెతుకుతున్నాడేమోనని ఆగి ఆగి చూస్తూ, సాగి వస్తున్నాడు. అందుకే అంత మంద గమనం !" ....అన్నాను నేను.

నీవు అందుకొన్నావు-అద్భుతమైన భావస్ఫూర్తితో-

ఏ విరహార్తుడేని హృదయేశ్వరి సన్నిధికేగ జాలు వా
ర్తావహు గోరి, నామే గిరినితంబ తటమ్ముననేని చిక్కి, వా
పోవుచు నుండె నేమొ యని, పొంచి దెసల్ పరికించి చూచుచు
న్నానె! ప్రవాస దుఃఖిత మనఃప్రియవార్తవమా! పయోదమా!

ఇంతటి రసలౌల్యత మన ఇద్దరనూ చుట్టి వేసింది ! ఆ స్మరణ దీప్తిని ఊతగా చేసుకొంటూ నడుస్తూ ఉన్నాను. నాకు దగ్గరగా వచ్చి పలుకరించే దాకా, మన స్కూలు హెడ్ మాస్టరుగారిని అందుకే నేను గమనించలేకపోయాను.

ఆయన నమస్కారం చేసి అన్నారు-

"ఆగస్టు పదిహేను వస్తున్నది కదా ! జండా ఎగురవేయాలి. పిల్లలకు ఏవో పంచిపెట్టాలి. తమకు జ్ఞాపకం చేద్దామనీ, ఆ ఏర్పాటుల గురించి మాట్లాడు దామనీ వస్తున్నాము."

ఏటా ఇది ఒక లాంఛనం. సెలవు ఇచ్చిన రోజు మన దేశానికి స్వాతంత్ర్యం వచ్చిన రోజని కొంత హడావుడి. అంతవరకే ఈ నాడు మన వాళ్ళకు ఉన్న స్వాతంత్ర్య దిన స్ఫురణ. స్వతంత్ర భారతంలో పుట్టి పెరుగు తున్న ఈ తరానికి, పరాయి పాలన నాటి పీడనలూ అవమానాలూ తెలియవు.

ఎంతటి తీవ్రమైన స్వాతంత్ర్య కాంక్ష - ఆనాటి సత్యాగ్రహ వీరులనీ, త్యాగ మూర్తులనీ ఉసుళ్ళు కాలిపిందో వీరు ఎరుగరు! ఎంతటి గాఢమైన దేశ భక్తి శక్తి స్వరూపమై వెన్ను తట్టి శతఘ్నులకు ఎదురుగా నడిపించిందో వీరి ఊహకు అందదు! నాకు బాగా జ్ఞాపకం-నీకు ఇష్టమైన పద్యం ఇది-

నీచపు దాస్యవృత్తి మననేరని శూరత మాతృదేశ సే
వాచరణమ్ము నందసువులర్పణ సేసినవారి పార్థివ
శ్రీ చెలువారుచోట తదసృగ్ర్యచులన్ వికసించి వాసనల్
వీచుచు రాలిపోవగ వలెన్ తరుదాత్త సమాధి వృత్తికన్!

తీవ్రమైన స్వాతంత్ర్య కాంక్ష, మాతృదేశాభిమానమూ-కవిని నిలువునా కదలించి వేసి-ఇంతటి సముదాత్త సుమ భావుకుణ్ణి చేశాయి!

శతాబ్దిల పారతంత్ర్య శృంఖలాలు విడివడిన ఆ మంచి రోజున మన ఇంట పండుగ చేశావు. దేశం యావత్తూ స్వేచ్ఛా వాయువులు పీల్చు కొన్నప్పటి మహత్తరానుభూతిలో - కడలి తరంగమల్లే ఉప్పొంగి పోయింది. ఆ పొంగులో మన ఇద్దరమూ పాలు పంచుకొన్నప్పటి జ్ఞాపకాలు దొంతర దొంతరలుగా ప్రతి స్వాతంత్ర్యదినం నాడు నన్ను వెన్నాడుతూనే ఉన్నాయి.

ఆ నాడు ప్రత్యేకంగా-ఊరిలోని పేద సాదలను పిలిచి పంక్తులుగా కూర్చొనబెట్టి విందుభోజనం పెట్టించావు.

"మహాత్ముడు మనకు సాధించిపెట్టిన స్వాతంత్ర్య భిక్ష ఇది"....అని ఎన్నోమారులు అనుకొన్నావు.

ఇంతటి ఆర్భాటం వెనుకా, చీకటి తెరలాగు ఒక చింతారేఖ. ముక్కచెక్కలైన దేశాన్ని చూచుకున్న మహాత్ముడి మనస్సులో ఒక విషాదం, మనుష్యుల మధ్య, మతం కారణంగా ప్రబలుతున్న విద్వేషం పట్ల ఒక నిర్వేదం! నాకు ఆలోచిస్తున్న కొలదీ చిత్రంగా తోచేది ఏమిటంటే, ఇన్నేళ్ళ తరువాత, ఈ ఉన్మాదం వెనుభూతమై ఇప్పటికీ మనసు వేధిస్తూనే ఉండటం!

ఎన్ని స్వాతంత్ర్య దినాలు వచ్చినా, లాంఛన ప్రాయంగా మనం ఎన్ని ఉత్సవాలు చేసుకున్నా, మారని ఈ పరిస్థితులకు మనస్సు విచలిస్తూనే ఉంటుంది. ఒక ఉదాసీన భావం కలుగుతూనే ఉంటుంది. అయినా, మన ఇద్దరమూ కలిసి ఉప్పొంగిపోతూ జరుపుకొన్న ఆ మొట్టమొదటి స్వాతంత్ర్య దినం మననానికి వస్తూనూ ఉంటుంది.

ఆషాఢం రాగానే-కనుల ముందు కారుమేఘం కదలాడుతుంది. ఆ వెను వెంటనే స్వాతంత్ర్య దినమూ తరుముకు వస్తుంది, ఆ తొలి స్వాతంత్ర్య దినం నాటి తొలకరి చినుకువంటి చిరునవ్వుతో నీవూ నా మనస్సున సాక్షాత్కరించి-

నిశీథి నిర్మలంగా ఉన్నది. నిశ్శబ్దంగానూ ఉన్నది. ఈ రాత్రి నిదుర నా దరికి రాలేదు. ఏవో కావ్యాలు తిరగవేస్తూ ఉన్నాను. చదివినవే మళ్ళీ చదువుతున్నాను. ఎంత సేపయినా నిద్ర పట్టక, వాకిలి ముందు మన చిన్న తోటలోకి వచ్చి రాతి తిన్నెపైన కూర్చొన్నాను.

తోటంతా సన్నని వెండి వెలుగు పరుచుకుని ఉంది. తల ఎత్తి చూస్తే, సజ్జనుడి స్వాంతమల్లే స్వచ్ఛంగా మెరుస్తూ చంద్రబింబం కనుపించింది. నిన్ను చూచినట్లే అనిపించి, ఒంటినిండా చలువ పూతలు పూసుకొన్నట్లు అయింది ! ఎందుకంటే-

అప్పుడు కూడా ఇటువంటిదే పున్నమి వేళ, ఇద్దరమూ ఈ మొక్కల మధ్యనే కూర్చుని ఉండినవేళ, అమృతము గూడుకట్టిన దొరకోసం ఊపిరి బిగబట్టి ఉత్కంఠతో ఎదురు చూస్తూ ఉంటిమి. పింజ మేఘము మాటున దాగి కూర్చుని, ఎంతకూ కనులముందుకు రాడు-వెన్నెల దొర !

“ నేను రప్పించనా రాకాసుధాకరుడిని ! .... ” అన్నావు మెరుస్తున్న కళ్ళతో ! అంటూనే పద్యం అందుకొన్నావు.

కపురపు పల్కుఁ లేళ్ళు, కలకండ పొడింబలె సన్నసన్న గా
ర్పొరల సందు సందుల చలించి, వెసన్ మణిముక్కు త్రుంచిన
ట్లు పొదలి క్రొత్తికెన్ కురసి లోపల లోపల చల్ల చల్లనై
కృప కల నీదు రే వెలుగు రేకలు మాకు ప్రసన్నమయ్యెడిన్ !

నీ స్థితప్రజ్ఞత ఎంతటిదో నాకు అప్పుడే తెలిసి వచ్చింది. దాగుడు మూతలాడి అది, విసిగి ఎదుటకు వచ్చిన వరహాల తండ్రివలె ఆ వెలుగు రాయడు మబ్బు తెరలను చీల్చుకొని వెలికి వచ్చాడు—నీవు పద్యం చదవటం పూర్తి కాగానే !

చందమామకు అంతటి నేస్తురాలవు. నాకు నిద్ర త్వరగా పట్టక పోవటం మంచిదే అయింది ! ఈ జాబిల్లి వెలుగు రేకలలో నీ దర్శనం అయింది. నిజంగా నిద్రా దేవత కరుణామయి. తాను వరించినదంటే - వ్యథలన్నిటినీ దూరం చేస్తుంది—తాను దరికి చేరక, రవ్వంత వేధించినా, రసరమ్య భావనలెన్నో రగిలిస్తుంది. ఇటువంటి నిదుర రాని ఏకాంతసమయంలోనే కవిహృదయం పోటెత్తిన తరంగ మవుతుంది. ఉదయ కాంతి అవుతుంది. కారుమబ్బు అవుతుంది !

బహుశః ఇటువంటి నిద్ర పట్టని రాత్రి వేళలోనే ఒక కవికి చిత్రమైన ఆలోచన వచ్చింది। తన పాటు ఏదో తాను పడటం కాక, నిదురలేక బాధ పడుతున్న వారందరి మీదా అపారమైన జాలి పుట్టుకు వచ్చింది. ఆ జాలి ఇంతై అంతై అన్నట్లు భూలోకమంతా చుట్టి వచ్చి విష్ణులోకాల పైపుకు మళ్ళింది। సాక్షాత్తూ పాల కడలిపైన శయనించిన పెరుమాళ్ళనే చుట్టివేసింది।

కలశపయోధి మీాద దరగల్ మరి హోరని(మ్రోయ వేయు భం
గుల తలపాన్పు పాము బుసకొట్టగ నేగతి నిద్ర చెందెదో
యలసత తండ్రి! చీమ చిటుకన్నను నిద్దుర రాదు మాకు నో
బలవదరీ! దరికుదర భాస్వదరీ! యదరీ! దరీ! హరీ!

"ఈ పద్యం వ్రాసి పూర్తి చేయగానే, కవిగారికి తప్పక నిద్ర పట్టి ఉంటుందని నా నమ్మకం। విష్ణులోకాల వరకూ వెళ్ళి వచ్చిన అలసట వల్ల।"
....అన్నావు నవ్వుతూ।

నలత వల్లనో మరే కారణం వల్లనో నిద్ర పట్టని నిశీథి వేళయినా, నీ చేతిలో చేయి వేసుకొని ఉన్నట్లయితే- కొండంత నిశ్చింతగా ఉండేది నాకు।

అధిక దుఃఖరోగార్తున కౌషధంబు
సురు చిరంబుగ భార్యయ చువ్వె నెందు
నొనర భార్యా సమేతుడై యున్నవాని
కెంతలయ్యు నాపద లెరుకపడవు!

ఆమె చెంత ఉంటే-అతడు అడవిలో నయినా ఆపదలను ధైర్యంగా ఎదుర్కొ- గలిగిన వాడవుతాడు। కాని - దురదృష్టమేమిటంటే-సాధారణంగా మగవాడి మనస్సుకు ఈ విషయం ఎక్కక పోవటం। అందుకే - నలమహారాజు అంతటి వాడికి కూడా భార్య అంతగా నొక్కి- చెప్పవలసి వచ్చింది। తెలిసి తెలిసీ-మగవాడికి ఎందుకో ఈ మరపు। ఆమె అంటే అంత అలసతాభావం।

ఆ నాడు నవవధువువై, నా చేతిలో చేయి ఉంచి, నన్ను అనుసరించి వడుస్తున్న నిన్ను చూచి అనుకొన్నాను ఇలా - నాలోన నేను।

"ఈ నాడు ఇంత మంది ఎదుటా నీ కరగ్రహణం చేసి నిన్ను నా వెంట నడిపిస్తున్నాను. కానీ, ఇక ముందు జీవిత మంతా నీవే నాకు చేయూతనిచ్చి నన్ను నడిపించాలి।"

నీవు నా మనస్సులోని మాటను ఏ దివ్య శక్తి కారణంగానో గ్రహించి అందుకు సాక్ష్యంగా, నా చేతిని మెల్లగా నొక్కి-నట్లు అనిపించి పొంగిపోయాను।

అవును। నడిపిస్తూనే ఉన్నావు నన్ను-అప్పుడు దర్శనీయవై-ఇప్పుడు దృశ్యమూర్తివై।

నిన్నటి నుంచీ చలిగాలి తిరిగింది. ఋతుధర్మం ఎంత కర్తవ్య నిష్ఠమైనది ! క్రమం తప్పక తన ధర్మాన్ని కాలం నిష్ఠురంగా నిర్వహిస్తూనే ఉన్నది.

శిశిర మేఘు డెంచె జెరగుల నాల్గింట
దెలుగునాట సుమవతీ లతా స
తీ సుమ ఝుంగతి ధురీణ కాంతా ప్ర
కాశమాన కైశికముల దాక -

శిశిరం అటు తొంగిచూస్తూనే - ఇటు నీవు నా చలికాలపు దుస్తులను తీసి ఎదుట ఉంచేదానవు. బయటకు వెళ్ళబోతున్నప్పుడు నా ఉన్ని శాలువా తీసుకు వచ్చి, చేతికి అందించేదానవు. నా సకల సౌఖ్యాలూ సౌకర్యాలూ చూచే భారం ఎంతటి ఆత్మీయతారాగంతో నీ పైన వేసుకొన్నావో కాని - నేను మాత్రం - నీవు లేని ఉనికిని ఊహించలేని స్థితిలో ఉండినమాట నిజం !

బాల్యంలో తల్లిగా, తరువాత ఇల్లాలుగా - అపారమైన దయాంతరంగంతో పురుషుణ్ణి కాపాడుకు వస్తూనే ఉన్నది స్త్రీమూర్తి ! పసితనంలో పయ్యెద మాటున ప్రాణశక్తిని పొంగించి ఊపిరి పోసిన తల్లితనమే - జీవన పర్యంతం అతనికి తన జీవన సహచరిలోనూ లభ్యం కావటం ఎంతటి అదృష్టకారణం !

వడ్లగింజలు కొనముక్కు- పంటనదిమి
మొదలు దన కూన యెట్టిని వదనమునకు
దవిలి యందిచ్చుచున్నది తల్లిపక్షి
తల్లి ! నీ విశ్వరూపమే యెల్లయెడల !

ఇట్టి తల్లితనాన్ని నీలో నేను దర్శించుకొన్న దివ్య ఘడియలు ఎన్నో ! నీ సాహచర్యం లభించినది మొదలుగా - నాకు ఇది నిత్యానుభూతి ; రానురానూ రాగానుబంధాలను అధిగమించిన నీ విశ్వ మాతృకా స్వరూపం నన్నూ, నా వంటి వారందరినీ నీ ముందు శిశుప్రాయులనే చేసివేసింది !

ఆ తల్లితనం ఎటువంటిదంటే -

"భక్తి ద్రోవకు సాధ్వి పరికరంబులు పెట్టి, కట్టిన పొరివిళంగాయగములు
నెసటి పోతలు గాగ నేర్చి నించిన చిరంతనపు శాలి క్షేమ తండులము
నడి బెట్టి లో జీర గుడము సాబాలాన్న జెంగు సంబారంపు జింతపండులు
పెల్లులో హిండి కావిళ్ళ కొమ్ము ద్రేలు, గిద్దిమొత్తము నేతి ఒద్దిగలును
బెరుగు వడియంబులును బచ్చి నరుగు బేడలు యతరాచ్యుత పూజోప
కరణ పేటికలును"-

ఇంట ఉన్నప్పుడు భర్త సౌకర్యాలను చూడడం - ఏ గృహిణికైనా సామాన్యధర్మమే! కాని, అతడు పనిమీద బయటకు వెళ్ళినప్పుడు కూడా - ఆమె తపన అంతా అతడి సుఖజీవనం కోసమే!

విష్ణుచిత్తులవారి ఇల్లాలు - ప్రయాణమై పాండ్య దేశానికి వెళుతున్న భర్తకోసం - ఇన్నిన్ని సంబారాలు సర్ది కావిళ్ళకెత్తి పంపినదట!

నేను ఎట్టి సమయంలో ఏ దుస్తులు ధరించవలెనో అనే విషయం కూడ నాకంటె నీవే బాగా ఎరుగుదువు. నీ పైన ఆధారపడటంలో ఎంత చిన్న పిల్లవాడినయినానంటే - ఎప్పుడు ఏ దుస్తులు నా కోసం కొని కుట్టిస్తున్నావో కూడా నాకు తెలిసి ఉండేది కాదు!

చిత్రమేమిటంటే - ఈ యావత్తు ఆనందాన్నీ, ఆత్మబలాన్నీ అనుభవించే అదృష్టవంతుడు - ఆ పురుషుడే - ఈ విషయాన్ని తరచుగా విస్మరిస్తూ ఉండటం సాక్షాత్తు దుష్యంతుని అంతటి మహారాజే - అంతటి నిర్దయకు పాల్పడటం మనం ఎరిగిన విషయమే!

అందుకే, భార్య అంటే ఎవరో ఏమిటో - అంతగా నొక్కి నొక్కి చెప్పవలసి వచ్చింది ఆమెకు!

' ధర్మార్థ కామ సాధన కుపకరణంబు గృహనీతి విద్యకు గృహము విమల చారిత్ర శిక్షకాచార్యకం బన్వయ స్థితికి మూలంబు సద్గతికి నూత గౌరవంబున కేకకారణంబున్నంత స్థిర గుణమణుల కాకరము హృదయ సంతోషమునకు సంజనకంబు భార్యయ చూవె - '

ఇంకా ఆమె ఏది కాదు! .... అన్నది విచికిత్స! నీ సాహచర్యంలో నాకు నిత్యమూ కలుగుతూ ఉండిన స్ఫురణ అది!

అన్నీ నీవైన నిన్ను ఏ పూలతో పూజించుకోను! ఏ అపురూప గౌరవాలు అందించుకోను!

నన్ను మాత్రమేనా! కనుపించిన వారందరిపైనా నీవు కారుణ్యాన్ని ఒలికిస్తూ ఉండేదానవు. అమృతం వంటి అమ్మతనపు ఆదరంతో అందరినూ వాత్సల్య రసంలో ముంచెత్తివేస్తూ ఉండేదానవు!

విశ్వాత్మకమైన మాతృభావనను హృదయంనిండా నింపుకొన్న నిన్ను చూస్తున్నప్పుడు- నీ చర్యలు పరికిస్తున్నప్పుడు నాకు పరమాత్మ్యతంగా ఉండేది. నీకు చేతులెత్తి నమస్కరించాలని కూడా అనిపిస్తూ ఉండేది.

ఇప్పుడు కూడా తలచినంతనే నా కనులముందు సాక్షాత్కరించి - నన్ను సేద తీర్చుతూ ఉన్నది - నీ తల్లితనం!

వజ్రాదపి కఠోరాణి మృదూని కుసుమాదపి
లోకోత్తరాణాం చేతాంసి ; కోను విజ్ఞాన మర్హతి !

వెన్నవంటి మెత్తని మనస్సూ-పువ్వుకన్నా సుకుమారమైన హృదయ సౌజన్యమూ - నీకు జన్మతః వచ్చిన లక్షణాలు. ఆ గుండెల నిండుగా అంతులేని కరుణారసం - దివినుండి దిగి వచ్చిన పావన గంగ లాగు ! అశ్రుధారల్ని చిలికించే తడిమబ్బులాగు !

మహాత్ముల మనఃస్థితిని గురించి వర్ణిస్తూ—అంతటి సౌకుమార్యమూ, అవసరమైతే అతి కఠినంగా మారిపోతుందని చెపుతాడు భవభూతికవి. అలవి మాలిన దుఃఖాన్ని కంఠగతం చేసుకొని- మళ్లీ కర్తవ్య నిష్ఠలో మునిగిపోయిన నిన్ను చూస్తుంటే- ఈ శ్లోకమే గుర్తుకు వచ్చేది !

నా విరుల దోట బెంచికొన్నాడ నొక్క-
పవడపు గులాబి మొక్క- నా ప్రణయ జీవ
నమ్ము వర్షమ్ముగా ననయమ్ము గురిసి
కొన్ని నాళ్లాయె ; సుకుమార కుసుమ మొకటి
నవ్వె కలకల మని నా వనమ్ములోన !

మొగ్గ తొడిగిన దాదిగా అపురూపంగా చూచుకొని పెంచుకొన్న ముగ్ధ కుసుమం యశోధర. ఆ బిడ్డ సృష్టికర్తను అడిగి అన్నీ తెచ్చుకొన్నది కాని- ఆయువును అడగటం మరిచిపోయింది అందుకే, తొందరపడి వెళ్లిపోయింది, తన బ్రతుకుజోడునూ కన్నబిడ్డనూ వదలిపెట్టి-

దుర్భరమైన విషాద వేదనలో మునిగిపోయిన మన ఇద్దరమూ ఒకరి నొకరము చూచుకొనలేకపోయేవాళ్లము ! మన చేతుల మీదుగా పెంచుకొన్న లేలేత పసి మొక్క - నయనానందకరంగా పెరిగి పెద్దదై, హరిత వృక్షమై, పుష్ప ఫల శోభితమై - మన కన్నులకు వెలుగు నిస్తూ, ఉన్నట్లుండి ఒక కాల ప్రళయ ఝంఝకు పెళ్ళగిల్లి, నిలువునా కూలిపోవడం చూచాము ! చెరుపైన గుండెను ఉగ్గబట్టుకుని-మనం జీవించగలగటానికి కారణం - యశోధర వదలి వెళ్ళిన చిన్న బిడ్డలు !

సుహృదివ ప్రకటయ్య సుఖప్రదః
ప్రథమ మేక రసామనుకూలతామ్
పునరకాణ్డ వివర్తన దారుణో
విధిరహో విశినష్టి మనోగుజమ్ !

కొంతకాలం పాటు సుఖాలనే ఇస్తూ, హితమునే కూర్చుతూ, ప్రాణ మిత్రములాగు సంచరిస్తూ ఉండే విధి - తటాలున ఎదురుతిరిగి వక్రిస్తుంది. కారణము లేకనే కష్టాలలో ముంచెత్తుతుంది. అంతలో సుఖము, అంతలో దుఃఖము, కలిగిస్తూ వినోదించడం విధివిలాస లక్షణం!

విధి ఆడే విచిత్రపు పాచికల ఆటలో, పావుల వంటి వాళ్ళం మనం! విధి ఎదురుతిరిగినప్పుడు - ఏటి కెదురీత ఈదడానికి కావలసినది కొండంత ఆత్మబలం. అందుకు గాను గుండెను కరకురాయిగానూ, వజ్రం కన్నా కఠినంగానూ చేసుకోవలసి ఉంటుంది.

నీవు ఈ పరమ సత్యాన్ని ఎరిగిన ప్రాజ్ఞురాలవు. విడిలిపోయిన గుండెను కూడగట్టుకొన్నావు. ముక్కు పచ్చలారని కూనలను, మన బిడ్డ బిడ్డలను-ఎదకు హత్తుకొన్నావు. వారిని పెంచి పెద్దచేసి, యోగ్యులుగా తీర్చి దిద్దటమనే బృహత్తర కార్యం - నీకు దైవదత్తమైన బాధ్యతగా స్వీకరించావు.

నిన్ను చూచినప్పుడల్లా, లోకకళ్యాణం కోసం కాలకూట విషం మ్రింగిన పరమ శివరూపం దృశ్యమానం అవుతూ ఉండేది నాకు!

"కంటే జగముల దుఃఖము, వింటే జలజనిత విషము వేడిమి" అంటూ సర్వ జగత్తుపట్లా జాలితో కరిగిపోయిన పరమేశ్వరుని వ్రతం సర్వజన హితం కోసం!

పరహితము సేయు నెవ్వడు
పరమ హితుండగును భూత పంచకమునకున్
పరహితమె పరము ధర్మము
పరహితునకు నెదుగు లేదు పర్వేందు ముఖీ!

అంటూ పరహితం కోసం అర్థాంగి అంగీకారాన్ని అర్థించి, ఆ అర్థనారీశ్వరస్వామి కాలకూట విషాన్ని కంఠాన నిలుపుకొన్నాడు!

స్థితప్రజ్ఞతతో - నీవు నీ ధర్మాన్ని నిర్వర్తించుకొన్నావు. జీవ సంస్కారంగా నీకు సంక్రమించిన మహిత మాతృత్వభావ స్థితి యశోధర చిన్న శిశువులపైన అమృతపు సోనగా వర్షించింది. అందుకు సాక్ష్యం-వారిప్పుడు ప్రాజ్ఞులై, ప్రయోజకులై, ప్రజ్ఞా ప్రాభవోపేతులై, వైదుష్యవంతులై సుఖంగా వర్ధిల్లుతూ ఉండడం!

అతుల సంసార సాగరమందు గాల
జలము సుకృత దుష్కృత వాత చలిత మగుచు
సుఖ విషాదపు దరగలై సుడియుచుండ
బడవలై గట్టు జేర్తువు పతిని గృహిణి!

# 52

జయన్తి తే సుకృతి నో రససిద్ధాః
నాస్తి తేషాం యశః కాయే జరామరణజం భయమ్,

ధన్యాత్ములు రససిద్ధులు అయిన కవీశ్వరుల కీర్తి శరీరానికి జరామరణ భయం లేదు. అట్టివారు సర్వోత్కృష్టులు - అంటాడు భర్తృహరి.

అట్టి మహాకవుల మీద అంతులేని గౌరవభావం నీకు. వారంతా సరస్వతీ మానసపుత్రులని అంటూఉండేదానవు. రానురానూ, మనకు సారస్వతోపాసన నిత్యనైమిత్తిక ధర్మంగా, నిరంతర కర్మాచరణగా మారటం మన అదృష్టం. అందుకు నీ ఉత్సాహమూ, ప్రోత్సాహమూ నాకు ఎనలేని స్ఫూర్తిని అందించాయి కవి పండితులు ఎందరో మన ఇంటికి వస్తూ పోతూ ఉండేవారు. సాయంవేళలలో, వెన్నెల రాత్రులలో-సారస్వత గోష్ఠులలో - శారదాదేవి కాలి మువ్వల ఘలంఘలలు వినిపించేవి. మొట్టమొదటి రోజుల్లో, మనం పండిత పక్షపాతులమని తెలిసి, కవులు ఏదో సహాయంకోరి వస్తూ ఉండేవారు. మన స్తోమతుకొలదీ వారి గ్రంథ ప్రచురణకు సహాయం చేస్తూ ఉండేవారం.

ఆ తరువాత - ముఖ్యంగా నీ సాహిత్యప్రియత సారస్వత లోకంలో సంస్తుతి కెక్కుతూ వచ్చింది. క్రొత్తగా వ్రాసినది ఒక్క పద్యమే అయినా, మన ఇంట కావ్యగానం చేయాలన్న ఉత్సుకతతో వారు వచ్చేవారు.

రసవత్కావ్యరచనకు సార్థకత - తత్కావ్య రసాస్వాదనచేయగల సహృదయుల సౌజన్యత పుష్కలంగా దొరకడం ! అట్టి సౌజన్యత వారికి నీ సాహిత్య ప్రియంభావుకతలో లభ్యమైంది.

శాస్త్రిగారు తరచుగా మన ఇంటికి వస్తూ ఉండేవారు తాను వ్రాసినదో, మరొక కవి కావ్యంలోనిదో, పద్యాలు ఎత్తి బహుశ్రావ్యంగా చదివి వినిపిస్తూ ఉండేవారు. ఒకసారి అన్నారు ఇలా—

"అమ్మా ! ఈ రస తన్మయత ఉన్నదే-దీనికి వేళాపాళా తెలియదు ! ఆకలి దప్పులూ బాధించవు - నేను ఎప్పుడైనా అసమయంలో వచ్చి మీకు అసౌకర్యం కలిగిస్తున్నానేమోనని భయం ! "

నీవు చాలా నొచ్చుకొంటూ అన్నావు - " శాస్త్రిగారూ ! అమృతపు సోనని బొట్లుబొట్లుగా అందిస్తూ - రుచికరంగా లేక పోతే ఆపివేస్తాను - అన్నట్లున్నది మీ మాట ! ఇక మా అసౌకర్యపు మాటా ,

వానిది భాగ్యవైభవము వానిది పుణ్యవిశేషమెమ్మెయిన్
వానిదవంధ్య జీవనము వానిది జన్మము వేరు సేయకె
వ్వాని గృహాంతరంబున భవాదృశయోగిజనంబు పావన
స్నాన విధాన్న పానముల సంతసమందుచు బోవు నిచ్చలున్ !

అన్న పద్యం వినిపించి ఇంకా ఇలా అన్నావు.

"ఋషికి ఎంతటి ఏకాగ్రత అవసరమో, కవికి కూడా అంతటి అవధానం కావలసి ఉంటుంది. కనుక అతడు ఋషితుల్యుడయినాడు. ఉభయులదీ ఒక తపశ్శక్తి ! తపస్సిద్ధి ! ఇక్కడ 'యోగిజనం' అనటంలో నా అర్థం అదే ! కావ్యస్రష్టలు అనే అర్థమే !"....

నీ పైదుష్యానికీ, సమయోచిత భాషణకూ ముగ్ధులయినారు శాస్త్రిగారు. ఆయన ద్విగుణీకృతోత్సాహంతో పద్యం మొదలు పెట్టారు.

ఎంత చక్కని వరం మనకు తెలుగు పద్యం ! చలువ వెన్నెల లాగు, చందన గంధం లాగు, హృదయాన్ని రసప్లావితం చేస్తుంది. నోటికి పట్టిన తెలుగు పద్యం కలకంఠ పోడి ! పంచదార చిలక ! తెలుగు పద్యం తేటగీతి ! ఆటవెలది ! ఇంకా ఎన్నో రూపాల చిత్ర శిల్పం ! సమర్థుడైన కవి చేతిలో పద్యం పలుకుతుంది, పాడుతుంది, ఆడుతుంది, తీవిని ఒలకబోస్తుంది, ఒయ్యారాలు పోతుంది. పద్యం ఛందోమయం. ఆదికావ్యపు ఆదిశ్లోకం ఛందోమయం. ఋతువేల ఛందోమయం ! అందుకే తెలుగు పద్యం వెయ్యేళ్ళకైనా నిలిచిఉంటుంది.

గుడి కూలును ; నుయి పూడును
వడి నీళ్ళన్ చెరువు తెగును
చెడనిది పద్యం బొకటియె
కుడి యెడమల కీర్తి గన్న గువ్వలచెన్నా !

పద్యమంటే మన ఇద్దరికూ ప్రాణం. పద్యాలు చదువుతూ పలకరించుకోవటం మనకు పరిపాటి అయిపోయింది.

తమ్మి చూలి కేలుదమ్మిని గల నేర్పు
కవి కలంబునందు కలదు గాన
నీశ్వరత్వమతని కే చలామణియయ్యె
నిక్కువముగ పూజనీయుడతడు !

అవి కవులను గౌరవంగా సంభావించుకొంటూ ఉండేదానవు. మహాకవుల సుప్రసిద్ధ పద్యాలెన్నో గంటలతరబడి నీవు చదువుతున్నప్పుడు, నీ ప్రక్కనే నిశ్శబ్దంగా కూర్చుని వినటం-నాకు ఇష్టమైన పనిగా ఉండేది।

నిను గనిన యంతనే నిఖిల లోక గంభీరతా
మనోజ్ఞ మహితాభయే మదికి దోచు సీమంతినీ
జనించు వెనువెంటనే చకితలోచనాంతోల్లస
ద్వినమ్రత ఘనమ్ముగా విమల భావ సంశ్లిష్టమై !

నీ మృదుల స్వభావమూ, నీ మాట మెత్తదనమూ, నన్ను ఎప్పుడూ చకితుణ్ణి చేస్తూ ఉండే విషయాలు ! ఉన్నతమైన నీ వ్యక్తిత్వం ముందు నేను శిశువునైనట్లు భావన చెందుతాను. వినమ్రుడినీ అవుతాను.

అసలు చిత్రమేమిటంటే, మెత్తని నీ మాటల వెనుక దిట్టతనం కూడా ఉండడం ! ఎవరితో ఏ విధంగా ప్రవర్తించాలో, ఎదురైన చిక్కులను ఎలా పరిష్కరించుకోవాలో — నీకు బాగా తెలిసిఉండేది.

నాకు బాగా జ్ఞాపకం — ఏదైనా సమస్య ఎదురైనప్పుడు నేను కొంచెం చికాకు పడుతూ ఉండేవాడను. నీవు నాకు అప్పుడు మంత్రిణివై, వచ్చిన సమస్యను పరిష్కరించుకోవటానికి సలహాలు ఇచ్చేదానవు. సాంత్వన వాక్యాలతో నా స్వాంతమును చల్లబరుస్తూ ఉండేదానవు. ఒకసారిఏదో చికాకుతో నేను ముఖం చిట్లించుకుని ఉన్నవేళ నీవు చిన్నగా నవ్వి — అన్నావు -

పిలువకనె పెంపొదవు పిల్ల కోపము నీకు
పెదవి మాటున దాగి భృకుటిలో మొలిచి
సుడి పడిన వేళలో ప్రియతమా నీదు
శైశవార్భటి చూచి మురిసి నవ్వితిని !

నాకూ మూతి బిగింపు సడలి నవ్వు వచ్చింది. కానీ, ఆ సమయాన, అందని ఎత్తులకు ఎదిగిన నీ కారుణ్యమయ వాత్సల్యమూర్తి ముందు — నేను మళ్లీ పసిపిల్లవాడినే అయినాను. నన్ను మాత్రమే కాదు — తన వారనీ, పరాయి వారనీ — భేదం లేక చింతలూ చిక్కులూ వచ్చినప్పుడు — అందరనూ ఆదుకోవటానికి ముందుకు వచ్చే, దయామయివి నీవు !

సూర్యకాంతిని అంధకారమూ, వెన్నెలను చీకటీ — తరుముకు వస్తున్నట్లే — కాలచక్రభ్రమణంలో జీవికి కష్ట సుఖానుభూతులు తప్పనివి. ఒక్కొకసారి — ఈ పృథివి మీద మనం అనుభవించే సుఖాల కన్నా, దుఃఖాలే ఎక్కువ అనుభవించవలసి ఉంటుంది

జీవిత మన్నచో ప్రబల చింతలు దుర్భర వేదనల్ నిరా
శావళు లంతులేని విపదబ్ధులు నాప్త వియోగముల్ రజలు
చావులు కంటి నీళులు విచారములున్ గృశియింపులున్ ఇవే
జీవిత మన్న ! నీ కిచట చిక్కిన దెట్టి ప్రశాంతి భార్గవా !

అంటాడు వంతల చింతల జీవితాన్నే రుచి చూసిన కవి ;

ఇతరుల కష్టాలకు సహానుభూతిని చూపించి ఆదుకోవడం మానవ లక్షణం.

ఇతరులకు ఏ కష్టం వచ్చినా ఇట్టే చలించిపోయే స్వభావం నీది జరా రుజా పీడితులన్నా, వయో భార వ్యధితులన్నా నీకు అలవిమాలిన దయ. మాటల తోనూ చేతలతోనూ – వారికి ఉపశమనం కలిగిస్తూ ఉండడం నీకు సహజప్రకృతి.

ఆకటి వేళల - అలసైన వేళలను
తేకువ హరినామమే మరి దిక్కులేదు
ఆపద వచ్చిన వేళ ఆరడి పడిన వేళ
పాపపు వేళల - భయపడిన వేళ
ఓపినంత హరినామమొక్కటే గతి !

అంటూ అన్నమయ్య, త్యాగయ్యల వంటి మహా భక్తిరససిద్ధులు పరమాత్మ స్మరణతో భవార్ణవాన్ని దాటగలిగినవారు. సామాన్య మానవునికి ఆపదవేళల్లో ముందు ఊరడి కావాలి. విడిలిపోయే గుండెను కూడగట్టుకోవటానికి ఓదార్పు కావాలి. ఆదరణతో కూడిన సానుతాప స్పర్శ కావాలి.

నేను ఎరుగుదును – ఎందరో వ్యధార్తులకు నీవు ఆపద్బాంధవివి కావడం; వారి అశ్రు సిక్త నయనాలను అద్ది, ఆదరంగా అక్కున చేర్చుకొనేదానవు.

పూరోత్పీడే తటాకస్య పరీవాహః ప్రతిక్రియా
శోకక్షోభే చ హృదయం ప్రలాపై రేవ ధార్యతే!

మిక్కుటమైన మనోవేదన కలిగినప్పుడు మనసారా ఏడ్చినట్లయితే, కొంత భారం తగ్గినట్లు అవుతుంది – అన్న విషయం ఎరిగినదానవు. మౌనంగా దుఃఖోపహతులైన వారి వెన్ను నిమురుతూ నీ భుజాన్ని అండగా అందించేదానవు.

సౌరభము తేల చిమ్ము పుష్పవ్రజము
చంద్రికల నేల వెదజల్లు చందమామ !

బహుశః – అందుకేనేమో నీ హృదయం అంతటి దయాపారావారం కావడం ;

నీ నిజస్వరూపమ్ము ధ్యానింపనెంచి
విశ్వ వస్త్వంతరమ్ముల వెదకి వెదకి
కొనకు నా హృదయాంతర కోటరస్థ
మైన సూక్ష్మాకృతిని నిన్ను నే నెరిగితి !

నిన్ను నేను జన్మాంతరములుగా ఎరుగుదును కాని, నీవు ఒక్కొకసారి నా ఎరుకకు అందని విశ్వాత్మక విరాడ్రూపిణివిగా గోచరిస్తావు ! నీ భౌతిక రూపాన్ని నేను ఎరుగుదును. ఆ రూపం నా ఈ జన్మకు శత సహస్ర విధాల ధన్యతను చేకూర్చింది. నీ అమూర్తరూపాన్ని నేను ఎరుగుదును! ఆ రూపం నన్నిప్పుడు పరమాప్తమూర్తిగా, పరమేశ్వర కరుణాకటాక్ష విశేషంగా నడిపిస్తున్నది.

నీ మనోహరమూర్తి నిశ్చల భక్తి
ధ్యానంబు సేయుచు దన్మయత్వమున
నేకాగ్రదృష్టితో నేనున్న వేళ -
నీవె లోకంబుగా నేనున్న వేళ -

నా కనుల ముందు ఒక విద్యుత్ప్రభాపుంజం గోచరిస్తుంది. ఒక భవ్య వాద్యస్వనం వినిపిస్తుంది. ఒక సుకుమార మారుతం స్పృశిస్తుంది. ఒక దివ్య పరిమళం పరివేష్టిస్తుంది. నీలో ఈశ్వరత్వాన్ని, ఈశ్వరునిలో నిన్ను దర్శించడం చేతనయినవాడిని కనుక -

దేవి, నీ రమ్యమూర్తి మదీయ హృదయ
పుండరీకాసనమున ప్రపూర్ణ భక్తి
నిష్టదైవతముగ ప్రతిష్టించి యెపుడు
వివిధ విధముల నిన్ను సేవించుచుందు !

నీవు నా చెంతను లేనిదెపుడు ! అహర్నిశలూ నీ సన్నిధి నన్ను తేజస్వంతుని చేస్తూనే ఉన్నది నేను నాలోకి – లోలోనికి – అంతర్ముఖుడనై భావసమాధినిష్ఠుడనై ఉన్నప్పుడు, సత్య శివ సుందరమూర్తివై నా మనోనేత్రం ముందు సాక్షాత్కరిస్తావు. బంధుమిత్రులు ఎంతమంది మధ్య కూర్చొని ఉన్నా, అంతులేని ఏకాకితనం నన్ను చుట్టుముట్టినప్పుడు – పిల్లగాలిగా వచ్చి స్పర్శించి – దిగులు తీరుస్తావు, నా ప్రియతమవు కనుక ! ప్రాణశక్తివి కనుక !

అకి ఇ్చ దపి కుర్వాణ స్సౌఖ్యై ర్దుఃఖాన్య పోహతి
తత్తస్య కిమపి ద్రవ్యం యోహియస్య ప్రియోజనః !

తమ సన్నిధి మాత్రం చేతనే ప్రియజనం మనస్సులోని వేదనను పోగొట్టి ఆనందాన్ని కలిగిస్తారు. అట్టి ప్రియజనం - అట్టి ఓట్టిదనరాని అపార సంపద. ఆ సంపద అంతా, నాకిప్పుడు నీలో దాగిన పరమేశ్వర తత్త్వంలో అనుభవానికి వస్తున్నది నీవు నాకు సహధర్మచారిణివి నేను నీ అడుగుజాడలలో నడచే భక్తపరాయణుడను. నీవు అడుగడుగున అందించిన స్ఫూర్తి నాకు జీవితంలో కర్మ యోగానుష్ఠానం నేర్పింది. నీవు వాగ్దేవి భక్తురాలవు. అక్షరంలో ఆనందబ్రహ్మను దర్శించగలిగిన ధన్యజీవివి. సరస్వతీ వరపుత్రులను సంభావన చేయడంలోని సంతృప్తిని అనుభవానికి తెచ్చుకొన్న అదృష్టవంతురాలవు.

వాక్కులో నివసించే సరస్వతి సమ్మోహనకరి ! ఎందరో మహా విద్వాంసుల వాగ్విలాస వైభవాన్ని సభాముఖంగా సాహిత్య ప్రియులకు అందించాలని ఆకాంక్షిస్తూ ఉండేదానవు. ఆ ఊహతో మనం వార్షికంగా ప్రారంభించిన యశోధర స్మృత్యంక సభ అందుకు నిదర్శనం.

ఇప్పుడు-"పరమ వివేక సౌరభ విభాసిత సద్గుణ పుంజ వారిజోత్కర రుచిరంబులైనట్టి సత్సభాంతర సీమలలో-"నీ సుప్రసన్నమూర్తిని దర్శిస్తున్నాను. ఆ దివ్యమూర్తిమత్త్వ స్ఫురణమే నాకు ఊపిరిని పోస్తున్నది.

ఇంతటి అద్వైత అనుబంధస్థితిని అందుకోవడం నా అదృష్టం. ఆ మహాభాగ్యానికి మూలకారణమైన నీవు భవ్యచరితవు !

> అద్వేష్టా సర్వభూతానాం మైత్రః కరుణ ఏవచ
> నిర్మమో నిరహంకార స్సమ దుఃఖ సుఖఃక్షమ
> సంతుష్టస్సతతం యోగీయతాత్మా దృఢ నిశ్చయః
> మయ్యర్పిత మనోబుద్ధిర్యో మద్భక్తస్సమే ప్రియః !

ఇతరుల యందు ద్వేషభావం లేనివాడు, మమకార బంధమూ, అహంకార దర్పమూ లేనివాడు, సుఖదుఃఖాలను సమాన ధర్మంతో స్వీకరించ గలిగినవాడు, క్షమాగుణం కలిగినవాడు, సంతృప్తితో సంతోషంతో జీవించే వాడు, ఎట్టి సంశయమూ లేక గాఢమైన విశ్వాసంతో హృదయాన్ని నాకు అర్పించేవాడు, యోగి అయినవాడు, తనకు ప్రియమైన వాడని అంటాడు జగన్నాథుడు. నీవు స్వామికి ప్రియమైనదానవు !

తత్కృత- మేదియో కొంత సుకృత విశేషం చేత, నీ సాహచర్యం నాకు లభించిన కారణంచేత - అర్ధనారీశ్వరతత్త్వమేదో, శివ శక్త్యాత్మక పరతత్త్వమేదో - మహా రసావేశస్ఫూర్తిగా నన్ను ఆవహించి - అడుగడుగునా ఆత్మోద్దీపకశక్తిగా ముందుకు నడిపిస్తున్నది ! ధన్యోస్మి ! 

# ఉదాహృత పద్యపాద సూచిక

| లేఖ | ఉదాహృత పద్యాదులు | రచయిత |
|---|---|---|
| 1. | ఈ ప్రపంచమున ఒక దినము | - బెజవాడ గోపాలరెడ్డి |
| | చల్లనై యున్న నా హృదబ్జమ్మునుండి | - విశ్వనాథ సత్యనారాయణ |
| | ఆ ముహూర్తమునందద్భుతావహముగ | - శివశంకరస్వామి |
| 2. | ప్రియాతుసీతా | - భవభూతి |
| 3. | నీవు తొలినాడు | - విశ్వనాథ సత్యనారాయణ |
| | తతపురాకృత కర్మానుగతి | - విశ్వనాథ |
| | ఇదమిత్థమని నిర్ణయింపగారాని | - విశ్వనాథ |
| 4 | ఇయం మమసుతా | - వాల్మీకి |
| | పగడపు మోవి కెంపులకు | - కొండాలి |
| 5. | ఊపి ఊపి మనసు నొక్కొ-క వేదన | - కృష్ణశాస్త్రి |
| | తల్లి చేతులలోను | - జానపదగేయం |
| | పోయిరా ముద్దులామల్లె | - జానపదగేయం |
| | తమ్ముల బంపుదు | - రామరాజభూషణుడు |
| 6. | ఈవారి శ్రీ మహాదేవ జాటాటవి | - విశ్వనాథ |
| | అపరిమేయానురాగతో యమ్మతోడ | - శివశంకరశాస్త్రి |
| 7. | వెలుగులో, యమృతాలో | - కృష్ణశాస్త్రి |
| 9. | ఈ ప్రపంచమునంతను నెత్రని జిగి | - కవికొండల వెంకటారావు |
| 10. | ఆమె నవనీత హృదయ | - వేదుల సత్యనారాయణశాస్త్రి |
| 11. | నాకును నీకు నెన్నిజననమ్ములసౌహృదమో | - వేదుల |
| 12. | నీకు నా మీది నవనవోన్మేషరక్తి | - శివశంకరశాస్త్రి |
| 13. | పూలతో వియ్యాలు | - నండూరి వెంకటసుబ్బారావు |
| | అలపెరుంగక | - పిల్లలమర్రి పినవీరభద్రుడు |
| 14. | ఇయంగేహేలక్ష్మీ | - భవభూతి |
| | గాఢతాపార్తమైన నా గాత్రమునకు | - శివశంకరశాస్త్రి |
| 15 | మామాకాశప్రణిహిత భుజం | - కాళిదాసు |
| | ప్రణయ మలయానిలోర్మికాపటలినూగు | - కృష్ణశాస్త్రి |

16 వినిశ్చేతుం శక్యో - భవభూతి
లలితశృంగార మధుమాన - విశ్వనాథ సత్యనారాయణ
17. అమ్మా ! మన్ను దినంగ నే శిశువునో - పోతన
కలయో, వైష్ణవమాయయో - పోతన
ప్రతనువిసర్గై ః - భవభూతి
అమిత తృష్ణాలసంబు - విశ్వనాధ సత్యనారాయణ
18 అషాఢస్య ప్రథమ దివసే - కాళిదాసు
కారుమేఘమా రావే రావే - జానపద గీతిక
తొలకరి ఒక మబ్బు - జానపద గీతిక
19. నాకు దోచుచునుండును - శివశంకరశాస్త్రి
భగవంతుడు కరుణామయుడు - కరుణశ్రీ
20. ఆ కనుపట్టు క్షేత్రమున - ఏటుకూరి వెంకటనరసయ్య
బహుళ జలదచ్ఛాయాచోరం - లీలాశుకులు
ఆకులో ఆకునై - కృష్ణశాస్త్రి
తెలిమబ్బు తెరచాటు తెలిచందమామ - కృష్ణశాస్త్రి
ఆకలా దాహమా - కృష్ణశాస్త్రి
21. మరల నిదేల రామాయణంబన్నచో - విశ్వనాథ సత్యనారాయణ
వంటయింటి పనులనంటిన మసిచేయి - శాలివాహనగాథాసప్తశతి
ద్రాక్షాపానక ఖండశర్కరలతో - శ్రీనాధుడు
తలపై నన్నపుడుత్త - ఏటుకూరి వెంకటనరసయ్య
22. గగన కళ్యాణి - జాషువా
బనరబోర్కాడించి - విశ్వనాధ సత్యనారాయణ
భావేనముగ్ధ చపలేన - లీలాశుకులు
23. అమృతము గూడు కట్టిన దొరా - విశ్వనాథసత్యనారాయణ
ఒక్క నేనే నీకు - నండూరి వెంకటసుబ్బారావు
24. దినకరుడు శాంతుడై తోచె - పింగళి—కాటూరి
అంబ ! భిక్షమ్ము పెట్టంచును - పైడిపాటి సుబ్బరామశాస్త్రి
25. అన్తఃకరణ తత్త్వస్య - భవభూతి
అందెలు గజ్జెలు మ్రోయగ - కృష్ణశతకము
రథాంగనామ్నోరివ - కాళిదాసు

26. పూర్వజన్మలలో ద్రవ్విపోసుకొన్న - విశ్వనాథ సత్యనారాయణ
కలిగిన వానియింట - భైరవశతకము
నా మనసు నే నెరుగనినాడె నన్ను - విశ్వనాథ
27. చూచు చుండ విలాసపు చూపులొదనె - విశ్వనాథ
మనుజ సమాజ నిర్మితి - దువ్వూరి రామిరెడ్డి
అపి స్వర్ణమయీ లంకా - వాల్మీకి
28. అసలే అనదు చూపు - కృష్ణశాస్త్రి
కొలను నడిగీ తేటనీరు - కృష్ణశాస్త్రి
అతిథిఃకిలపూజార్హః - వాల్మీకి
వండ నలయదు వేవురువచ్చిరేని - అల్లసాని పెద్దన
గగనము నీరు బుగ్గ కెనగా - కృష్ణదేవరాయలు
కెంజుకులనున్న తంగేటి జున్ను - అల్లసాని పెద్దన
29. విరియగాచినపండ్ల బరువుచే వంగి - విశ్వనాథ
పరమ ధర్మార్థమైన దాంపత్య భక్తి - రాయప్రోలు
ఇదిపౌత్రుకల భార్య - విశ్వనాథ
ఈ సుఖంబును గష్టంబునెందుకొరకు - వెంకటపార్వతీశకవులు
30. ముదిత ఇవకదమ్మై - కాళిదాసు
సిరికిం జెప్పక - పోతనామాత్యుడు
తొలికాన్పు పసిపాప - విశ్వనాథ
కాటుక పెట్టిన కన్ను - జానపదగీతం
31. తన కంఠమున దాచి హాలాహలం - కృష్ణశాస్త్రి
దేశమనియెడి దొడ్డవృక్షం - గురజాడ
32. బువ్వ చిక్కము కొడవలి బూని - విశ్వనాథ
ఉడుకుగాడుపు పొంగున కుమ్మగిల్లి - ఏటుకూరి వెంకటనరసయ్య
చూపులు చుమ్మలై సురిగి చూచెదు - ఏటుకూరి
33. రంగ దుత్తంగ భంగ - జాషువా
ఉప్పుతో తొమ్మిది యున్న కాపురములు - దువ్వూరి రామిరెడ్డి
మలినుండై కడు దస్సి క్రుస్సి - నన్నెచోడుడు

34. లాభమ్మ లాభమ్మ — జానపదగీతిక
కొడుకంటూ పుట్టాడు — జానపద గీతిక
సీత యన్నము స్నానమ్ము — విశ్వనాథ
నీవు నిలుచుంటేను నాకేమి సీత — జానపదగీతిక
దశరథుని పుత్రుడవు — జానపదగీతిక
అమ్మ నీ కోడలిని అతిగారవమున — జానపదగీతిక
35. గృహ సమ్మార్జనమో — శ్రీకృష్ణదేవరాయలు
కవితాకన్యక గుణములు — చాటుపద్యరత్నాకరము
36 ఎవరి పనులు వారు — ఏటుకూరి వెంకటనరసయ్య
రెడ్డొచ్చె రెడ్డొచ్చె — జానపదగీతిక
అత్తల యాడుబిడ్డల — దువ్వూరి రామిరెడ్డి
నా సొగసుటింట — విశ్వనాథ
37. ఏ పూర్వపుణ్యమొ ఏ యోగబలమొ — రాయప్రోలు
వెన్నపూసా మనసు — బసవరాజు అప్పారావు
చకచక నడిస్తేను — బసవరాజు అప్పారావు
శీత ధరాధర సేత్వంతర — కృష్ణశాస్త్రి
దేశమును ప్రేమించుమన్నా — గురజాడ
38. మెలగుచున్నావు నేత్ర నిమీలనమున — శివశంకరశాస్త్రి
పూరికొట్టము పెద్ద గాడ్పునకు చెదర — గాధాసప్తశతి
39. ఇట్టి ముద్దులాడి బాలుడేడ — అన్నమాచార్యులు
అనియతరుదితస్మితం — భవభూతి
అమ్మీ తూరుపు తెల్లవారె — దువ్వూరి రామిరెడ్డి
40 తలచిన దెందము గందును — నన్నెచోడుడు
తెలినులివెచ్చ యోగిరము — శ్రీకృష్ణదేవరాయలు
అలసి నెడ దప్పినెడ — నన్నయ భారతము
ప్రియపార్శ్వియా వృత్తి — భవభూతి
41. చల్లగాలి వచ్చింది — జానపద గేయం
పప్పు పచ్చడివాయ — ఏటుకూరి వెంకటనరసయ్య
మాటిమాటికి వ్రేలు మడిచి — పోతనామాత్యులు

42. నా మనసు నే నెరుంగనినాడె — విశ్వనాథ
అక్షరంబు వలయు — చాటువు
వితరతి గురుః ప్రాజ్ఞే — భవభూతి
ధృతిః క్షమా దయా శౌచం - వ్యాసుడు
43 బొమ్మన జూచు - పిల్లలమర్రి పినవీరభద్రుడు
వాగర్థా వివసంపృక్తౌ - కాళిదాసు
44 పాయక పాకశాసనికి - నన్నయ భారతము
క్షీరము మున్ను - భర్తృహరి
మత్పురానేక జన్మములు పండి — నాయని సుబ్బారావు
45. ఇన్నాళ్ల సేవ చేయుచు - చేమకూర వెంకటకవి
సరస్వత్యాస్తత్వం — అభినవగుప్తులు
సుందర సర్వలక్షణ విశుద్ధకవిత్వము - మడికి సింగన
46. చారునిర్మల చంద్రికాపూరమట్లు - శివశంకరస్వామి
ఇద మంధం తమః కృత్స్నం - దండి
అక్షయంబగు సాంపరాయని - శ్రీనాథుడు
కృష్ణవేణమ్మ గొనిపోయె - శ్రీనాథుడు
నడవకయె నడచివచ్చితి - చాటుపద్య రత్నాకరము
47. యెంకి గాలోకపాలి - నండూరి సుబ్బారావు
అతివిశాల గభీరభవార్ణవంబు - శివశంకరశాస్త్రి
మ్లానస్య జీవకుసుమస్య - భవభూతి
అయ్యెడలందు గంటకితమై - విశ్వనాథ
48. ఏ విరహార్తు దేని - వేదుల సత్యనారాయణశాస్త్రి
నీచపు దాస్యవృత్తి - వేదుల
49. కపురపు పల్కుటల్లు - విశ్వనాథ
కలశపయోధిమీద - కందుకూరి రుద్రకవి
అధిక దుఃఖరోగార్తున కౌషధంబు - నన్నయ భారతము
50. శిశిరమేగుదెంచె - విశ్వనాథ
వడ్లగింజలు కొనముక్కు పంటనదిమి - విశ్వనాథ
భక్తిద్రోవకు సాధ్వి - శ్రీకృష్ణదేవరాయలు
ధర్మార్థ కామసాధనకుపకరణంబు - నన్నయ భారతము

51 వజ్రాదపి కఠోరాణి - భవభూతి
నా వియుంగదోట బెంచికొన్నాడ - కృష్ణశాస్త్రి
సుహృదివ ప్రకటయ్య - భవభూతి
పరహితము సేయు నెవ్వడు - పోతనామాత్యులు
అతుల సంసారసాగరమందు - దుష్యారి రామిరెడ్డి

52. జయన్తి తే సుకృతినో - భర్తృహరి
వానిది భాగ్యమై భవము - మనుచరిత్ర
గుడి కూలును, నుయ్యి పూడును - గువ్వలచెన్న శతకము
తమ్మి చూలి కౌలుదమ్మని - జాషువా

53. నినుం గనిన యంతనే - శివశంకరశాస్త్రి
జీవిత మన్నచో ప్రబలచింతలు - సిరిప్రెగడ భాస్కరరావు
అకటి వేళల అలపైన వేళలను - అన్నమాచార్యులు
పూరోత్పీడే తటాకస్య - భవభూతి
సౌరభములేల చిమ్ము - కృష్ణశాస్త్రి

54. నీ నిజస్వరూపమ్ము - విశ్వనాథ
నీ మనోహరమూర్తి - వెంకట పార్వతీశకవులు
దేవి, నీ రమ్యమూర్తి - శివశంకరస్వామి
అకి ఇచ్ఛ దపి కుల్యాణ - భవభూతి
అద్వేష్టా సర్వభూతానాం - భగవద్గీత

